# కుంజర యూథం

లెఫ్టినెంటు - కర్నల్ జె. [illegible]. విలియమ్స్ ఓ. బి. ఇ.

ఆంధ్రీకర్త :

శ్రీ బులుసు వేంకటరమణయ్య పి. ఓ. ఎల్.

ప్రకాశకులు :

శివాజి ప్రెస్

గంజ్ బజారు, శికింద్రాబాదు - ఆ. ప్ర.

**First Edition 5000**
**January, 1959**

# ELEPHANT BILL

**(KUNJARA YUDHAM)**

BY

**Lt. Col. J. H. Williams**

*Translated in to Telugu by*

**Sri Bulusu Venkataramanayya, P. O. L.**



PUBLISHED UNDER THE AUSPICES OF

THE SOUTHERN LANGUAGES BOOK TRUST.

The Translated Version is an Abridged Edition of the Original Book.

*Published by*

**SHIVAJI PRESS**

**Gunj Bazaar, Secunderabad (A. P.)**

PRINTED AT SHIVAJI PRESS, SECUNDERABAD.

# ముందు మాట

మా పథ్నాలుగవ పటాలంలో రకరకాల చాయల సైనికులు ఉండేవారు. కొందరి చాయ తెలుపు. కొందరిది పసుపు. కొందరిది బూడిదరంగు. కొందరు కారునలుపుగా ఉండేవారు. అలాగే రకరకాల జంతువులూ ఉండేవి. పావురాలు, కుక్కలు, గుర్రాలు, కంచర గాడిదలు, ఎడ్లు, దున్నపోతులు, ఏనుగులు ఉండేవి; ఎంతో నమ్మకంతో బాగా కావలసిన పనులు చేసేవి. మిగిలిన జంతువుల దృష్ట్యా ఏనుగుమీద మనుష్యులకు ఎక్కువ అభిమానం వుంటుంది. అలా వుండదానికి దాని స్వరూపమూ, బలమూ కారణాలు కావు. దాని తెలివితేటలూ, హోదా ఆ అభిమానాన్ని కలిగిస్తాయి. బుజ్జగించి పని చేయిస్తే, వంతెనలూ అవీ నిర్మించేటప్పుడు, ఏనుగులు పెద్ద పెద్ద దూలాలను వాటిని ఉంచవలసినచోట సరిగా ఉంచుతాయి. దీన్నిబట్టి ఏనుగు వస్తువులను ఒకచోటినుంచి మరొక చోటికి చేరవెయ్యడానికి ఉపయోగించేది మాత్రమే కాదనీ, ఎంతో నేర్పుతో కార్యాలను నిర్వహించేదనీ తెలుస్తున్నది.

ఏనుగుయొక్కయూ, మావటివాని యొక్కయూ విచిత్రమైన శక్తిని వర్ణించ సాధ్యంకాదు. ఉభయుల పరస్పర సహకారం వల్లనే పనులు జరుగుతాయి. శాంతమూ, ధైర్యమూ, ఆనందోత్సాహాలూ ఉన్న బర్మాదేశపు ఊజీ (మావటీడు) లేకపోతే ఏనుగుల కంపెనీలే ఉండి వుండవు. 'ఎలిఫెంట్ బిల్', అతని సహాయులూ లేకపోతే ఊజీలే ఉండి ఉండరు !

ఏనుగులు మాకోసం వందలకొద్దీ వంతెనలు కట్టాయి; గ్రీసు దేశంలో హెలెన్ రాణికోసం నిర్మించిన సముద్రపు ఓడల కంటె

ఎక్కువగా మాకి యేనుగులు తోడ్పడినాయి. (హోమర్ కవి రచించిన 'ఇలియడ్' మహాకావ్యంలోని గాథ.) అవి లేకపోతే మేము బర్మానుంచి తప్పించుకుని వెనక్కి రావడమూ, తర్వాత దాని విముక్తికి తిరిగి ముందుకు వెళ్లడమూ కష్టసాధ్యాలయ్యేవి. 14-వ పటాలంలోని మేము అందరమూ మా ఏనుగుల గుంపును గూర్చి ఎంతో గర్విస్తున్నాం. అలాంటి ఏనుగులను గురించే ఈ "ఎలిఫెంట్ బిల్" మితంగానూ, వివరంగానూ తెలియజేస్తున్నాడు.

—ఫీల్డ్ మార్షల్ సర్ ఎలియం స్లిమ్.

## ACKNOWLEDGEMENTS

Apart from a few of my own, the Photographs in this book were taken by Muir Wright, Fish Herring, John Booth, and the late Peter Bankes, to whom I am most grateful.

*J. H. W.*

## కృతజ్ఞతలు

ఈ గ్రంథంలోని ఛాయాచిత్రాలలో కొన్ని మాత్రం నావి. మిగిలినవన్నీ మ్యూర్ రైట్, ఫిష్ హెర్రింగ్, జాన్ బూత్, కీ. శే. పీటర్ బాంక్స్ తీసినవి. వారందరికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

జె. హెచ్. విలియమ్స్

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప జేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘన కార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సు కోసం, అభ్యుదయం కోసం ఆ మహా పురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వ శాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం-ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరం

పరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకము లైన భిన్న భిన్న విషయా లను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప చేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకా లన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అంద జేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణభాషా పుస్తక సంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు :
ఏ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్స్లర్,
మద్రాసు విశ్వవిద్యాలయము,

మద్రాసు,
7-10-1958.

# ఉపోద్ఘాతము



"ఏనుగులతో నేస్తం" అని పేరు పెట్టదగిన విలక్షణ గ్రంథమిది. బర్మా అడవులలోని ఏనుగుల జీవితాలను, మానవుల జీవన విధానాలను, ఎన్నో సాహస కృత్యాలను, ఎన్నో ప్రణయాలను లెఫ్టినెంట్ కర్నల్ విలియమ్స్ ఈ గ్రంథంలో మనోహరంగా అభివర్ణించారు. రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం ఉత్తర చిండ్విన్, కంతి అరణ్యాలు, కెరెన్ ప్రాంతం, బొంబాయి - బర్మా కార్పొరేషన్, బర్మా ఉద్యమం చక్కగా వివరింపబడిన గ్రంథమిది. ఆ నాలుగు వేల యేనుగులు ఇప్పు డక్కడ లేవు. వాటికి శిక్షణ ఇచ్చి, వాటితోపాటు పనిచేస్తూ ఉండిన కార్మికు లందరు బర్మా స్వాతంత్ర్యం పొందిన తరువాత అక్కడ ఏర్పడిన పరిస్థితులకు తట్టుకోలేక చెల్లాచెదరై పోయారు.

ఈ గ్రంథకర్త మానవుల ఆచారాలను, మనఃప్రవృత్తులనే కాదు; యేనుగుల చిత్త ప్రవృత్తులను కూడా చక్కగా ఆకళింపు చేసుకొన్నవాడు. ఏనుగుల తెలివి తేటలను, కౌశలాన్ని, కేవలం మానవ సహజమనుకొనే జ్ఞాపకశక్తిని విశేషంగా ప్రస్తుతించాడు. ఏనుగులలోను ఏనుగు గున్నలలోను ఆయన పరిశీలించిన గాంభీర్యాన్ని, ఉత్సాహాన్ని, జాలిని, కఠోరతను ఇంపైనపదచిత్రాలరూపంలో ఆయనఅభివర్ణించాడు. పనిపాటులలో, విలాస వేళలలో, జలకేళిసమయంలో, ఆహార విహారాలలో, నడకలో, పరస్పర భాషణలో యేనుగుల చిత్ర విచిత్ర ప్రవృ

త్తులను ఆయన వివరించాడు. దారినిబడి పోతూన్నప్పుడు, బంధింపబడి ఉన్నప్పుడు, అడవులలో స్వేచ్ఛగా తిరుగుతున్నప్పుడు, మందలలో ఉన్నప్పుడు, ఒంటరిగా ఉన్నప్పుడు యేనుగులు ఎప్పుడు ఏమి చేసినా తమ ఔన్నత్యాన్ని విస్మరించకుండా ఏ విధంగా ప్రవర్తించేదీ చక్కగా అభివర్ణించాడు. అడవిలో ఏపుగా పెరిగిన గడ్డి అటూ ఇటూ ఒత్తిగిలి చిరుతపులికి దారి ఇస్తుంది. జలాశయం దాపున ఉన్న గుహలో పెద్ద పులి విశ్రాంతిగా కాళ్లుసాచి పడుకుంటుంది. కోతులు, పక్షులు చెట్ల కొమ్మల మీద ఎత్తున కూచుని కబుర్లాడుకుంటాయి. సృష్టిలో ఇతర జీవులలో కనిపించే అందచందాలు తనకు లేకపోయినా, వాటి అన్నిటి పైన పెత్తనం చేసే మానవుడు రెండు పాదాలు నేలమీద మోపి సగర్వంగా తల పంకిస్తూ నడచిపోతాడు.

ఏనుగుల కుటుంబ జీవనాన్ని గురించి, ఏనుగు గున్నలు ఆడుతూ పాడుతూ పెరిగి పెద్దవి అవటం, మానవులలో వలెనే యౌవన వార్ధక్య దశలలో వాటి ప్రవర్తనలూ వివరించే ఘట్టం ముచ్చటగా ఉన్నది. ఒక దంతావళము (మగ యేనుగు) ను మూడు సారులు బాధపెట్టి, తత్ఫలితంగా దాని వలన దుర్మరణం పాలైన బర్మాదేశీయుణ్ణి గురించిన గాథ చదవవలసినది. టాంగ్ డ్విన్ నదిలో వరదలు వచ్చినప్పుడు తన మూడు నెలల పసిబిడ్డను కాపాడుకొనడం కోసం రెండు సారులు తన ప్రాణాపాయాన్ని కూడా లెక్కచేయని మాష్వే (శ్రీమతి సువర్ణ) అనే ఆడ యేనుగు కథ రమ్యంగా ఉంది. ఆ కుంజర యూధంలోని యేనుగుల పేర్లు మాండలేలోని పెగోడా మందిర ప్రాంగణాల్లోని గంభీర ఘంటారావాలలాగ, మధురంగా, సంగీత మయంగా ఉంటయి. చిత్ సియా యా లేక ప్రేమార్హ, ఇంద్రనీల నయన లేక క్యాక్‌సీన్, మాపిన్‌వా లేక హంసగమన, క్యామ్మినే లేక వ్యాఘ్ర విజేత, పోసీన్ లేక మిణుగురు పురువు, మాహ్లో లేక సౌందర్యరాశి,

మా పలాయ్ లేక ఆణిముత్యం, మాంగ్ క్యా దాన్ లేక చదును వెన్నురాయడు, టాసిన్ మా లేక అడవి రాణి, సుప్రసిద్ధ బర్మా సేనాని పేరుతో పిలిచే బందూలా, ఈ గ్రంథకర్త భార్యపేరు పెట్టిన సుసాన్ మా-అలాంటి పేర్లలో కొన్ని.

విశ్వాస పాత్రుడైన శాన్ ష్వే ఉ అనే సేవకుణ్ణి నాట్ క్యా (దయ్యం పులి) ఎత్తుకు పోవడం, దంతాలు చుట్టలు చుట్టలుగా తిరిగి ఉండి, తను అపార బలసంపద కలది అవటంవల్ల యజమాని తనకే విధేయుడై ఉండాలని కోరే అపురూపమైన యేనుగు క్యాన్ జిట్‌ని తుపాకితో కాల్చి చంపటం, అడవిలో కంతి నది ఒడ్డున కాపురం పెట్టి, కంటబడిన మనుష్యులందరినీ అడవి బయటి దాకా తరిమికొట్టే హామ్రదియాద్ అనే నల్లని రాకాసి యేనుగు కథ మొదలైనవి నమ్మ టానికి కూడా వీలులేనంతటి అత్యద్భుత సన్నివేశాలు.

ఏనుగులు అంత్యదశలో మానవుల కంటికీ, కాలికీ దూరంగా ఎక్కడో అడవి మధ్యకు పోయి ప్రశాంతంగా ప్రాణం విడుస్తాయన్న వదంతిని గురించి ఈ గ్రంథకర్త స్వయంగా పరిశోధనచేసి, అది కేవలం కట్టు కథ అని తేల్చాడు. డెబ్బయ్యేదేళ్ల ముసలి యేనుగొకటి, తన మందతోపాటు తిరగడం మానివేసి, వేసవి వచ్చేదాకా ఆహారం పుష్కలంగా దొరికే ప్రాంతానికి పోయి, ఏకాంతవాసంచేస్తూ, వేసవి రాగానే వార్ధక్యంతో వడిలి వాడి, ఏమీ అలజడి లేకుండా ప్రశాంత ముగా ప్రాణం విడుస్తుంది. లక్ష పౌనులు రొక్కాన్ని పదియేను గుల మీదికి ఎక్కించడానికి సాయపడిన బలశాలి, సౌమ్యుడు అయిన మాంగ్‌నావ్ యా (శ్రీకదళీ తరువు) అనే కార్మికుడు, పిమ్మట పెద్ద దోపిడిగాడై, ప్రభుత్వపు ఖజానాలోనుండి 25,000 రూపాయలు ఎత్తుకుపోవడానికి రావడం మరొక విచిత్రమైన సంఘటన

వాస్తవంగా ఈ గ్రంథకర్త గారడీవాడు, గొప్పకళాకుశలుడు, మంచి నవలాకారుడు. ఈయన తన మిత్రులైన అడవి యేనుగుల జీవిత చరిత్రలను, తన శిబిరంలోని వాటి మావటివాళ్ళ చరిత్రలతో మేళవించి, రమ్యంగా చెప్పడంలో అద్భుత శిల్పచాతుర్యం అడుగడుగునా కనిపిస్తుంది. ఈయన నాయకుడు; శక్తి ఎక్కడ ఉన్నా గుర్తిస్తాడు, మెచ్చుకుంటాడు. నిశితమైన పరిశీలనశక్తి, సత్యనిరతి, మర్యాదా పాలన నిష్ఠ, మానవులకు జంతువులకు కూడా వర్తించే ఆ అనిర్వచిత ఆరణ్యకధర్మజ్ఞత ఈయనకు పుష్కలంగా ఉన్నాయి.

ఇది విధిగా చదవవలసిన గ్రంథం; ఒక్కసారి కాదు, మళ్ళీ మళ్ళీ చదువదగినది. మన భావనా పటిమకు గట్టిగా పనిజెప్పి, మన ఆలోచనా పరిధిని విస్తృతం చేయగల గ్రంథం. మానవులకు, జంతువులకు నడుమ గల అంతరాలను అధిగమించి, ద్విపాదులైనా, చతుష్పాత్తులైనా భగవంతునిలో విశ్వాసంగల వారందరు, సమయమాసన్నమైనప్పుడు తమ సృష్టికర్త సమక్షంలో నిలబడి, సర్వవిజ్ఞానమయుడైన ఆ భగవానుడు చెప్పే తీర్పులను తలదాల్చే దివ్యదేశం వరకూ ప్రసరించే భావసంపద ఈ గ్రంథంలో ఉన్నది.

యతిరాజ్ కాలేజి,
ఎగ్మూరు, మద్రాసు - 8,
అక్టోబరు 31, 1958.

మోనా హెన్స్‌మన్,

# మొదటి భాగము

## ౧

నేను ఎప్పుడూ జంతువులతో కలిసి మెలిసి ఉండేవాడను. వాటి పైని నాకు ప్రీతి. ఏవో ఒకటి-రెండు తప్ప అన్నీ నామీద అభిమానంగానే ఉండేవి. నేను కారన్‌వాలులో బాలుడనై ఉన్నపుడు నా మిత్రుడు ఒక గాడిద! అది మైదానాల మీద స్వేచ్ఛగా తిరిగేది; కాని అది ఎక్కడెక్కడ తిరిగేదీ నాకు బాగా తెలుసు. 1914-18 లో ప్రపంచ మహాయుద్ధం జరిగినప్పుడు మొదట నేను ఒంటెల దండులో ఉద్యోగిని. తర్వాత కంచర గాడిదల దళంలో రవాణా ఉద్యోగిగా ఉండేవాడను. అప్పట్లో జంతువులను గురించిన చాలా విషయాలు నేర్చుకోగలిగినాను.

యుద్ధం ముగిసిన తర్వాత నిరుద్యోగులైన లక్షలాది జనంలో నే నొకడను. ఉద్యోగ సంపాదనకు తిరిగేటప్పుడు ఒక మిత్రుడు కనబడి, ఏనుగులను గురించి తెలిసిన వానిని ఎరిగిన మిత్రుడొకడు తనకు బర్మాలో ఉన్నాడని చెప్పినాడు. అలాటి ఉద్యోగం దొరికితే అరణ్యావాసం, గురిచూచి కాల్చడం, గుఱ్ఱపుస్వారి అలవాటు కాగలవనీ, అడవుల్లో ఒంటరిగా ఉండవలసి వచ్చినా, శైలవు మీద వచ్చి

నప్పుడు నలుగురినీ చూడవచ్చుననీ ఊహ తోచినది. నా కోరిక తెలుసుకుని నా మిత్రుడు ఆ రాత్రే బర్మాలోని తన మిత్రుడికి జాబు వ్రాస్తూ, ఏనుగుల బాధ్యతను నిర్వహించడానికి నేను తగినవాడనని తెలియజేశాడు. నేనున్నూ, దీనికి సంబంధించిన-బొంబాయి బర్మా ట్రేడింగు కార్పొరేషను (బొంబాయి బర్మా వర్తక సంఘం) అధికారికి జాబు వ్రాశాను.

1920 లో - నేను ఇంగ్లాండుకు వెళ్ళకముందే - ముఖస్తంగా మాటలాడడానికి రావలసినదని, కార్పొరేషను అధికారి వద్ద నుంచి ఆహ్వానం వచ్చినది. ఆ యేడు ముగియకుండానే నేను బర్మా వెళ్ళడమూ జరిగినది.

బర్మాలో దేవాలయాలూ, వరి పొలాలూ కన్నుల పండువుగా ఉంటాయని పుస్తకాలో చదివాను. మొరటు మనిషి అయిన విల్లీని చూచినపుడు, వాటి సంగతే తోచలేదు. నేను శిక్షణను ప్రారంభించవలసినది అతని దగ్గరనే! అతని స్వాగతం - అది స్వాగతమని అనుకుంటే అనిష్టాన్నే సూచించినది. అతని స్వేచ్ఛకు నేను అడ్డువస్తానని అతడు తలచినట్లు నాకు తోచినది. కాని అతని అభిప్రాయాన్ని మార్చగలననే ధైర్యంకూడా నాకు ఉన్నది. అయితే, అలా చెయ్యడానికి కొంతకాలం పట్టినది.

ఇది ముప్ఫయి ఏళ్ళ కిందట జరిగినా, నిన్ననే జరిగినట్లుగా తోస్తున్నది. ఐదుగంట లయ్యేసరికి ఏడు ఏనుగులు ఆ మకాముకు వచ్చి, పరీక్ష కోసంవలె వరసగా నిలిచినవి. విల్లీ - ఒక్కమాట కూడా ఆడకుండా తన కుర్చీలోంచి లేచి వాటి దగ్గరకు వెళ్ళాడు. నన్ను పిలవక పోయినా, అతని వెంబడినే నేనూ వెళ్ళాను. ఆ యేనుగులలో ఒకటి వయసు మీరి, బక్కచిక్కి వున్నది. అది మిగిలిన ఆరింటికీ తల్లి

అని అనుకునేటట్లున్నది. విల్లీ, వాటి నన్నిటినీ బాగా పరిశోధించి — ఒక్కొక్క దానిని గురించీ తన నోటుపుస్తకంలో ఏదో వ్రాసు కున్నాడు. అన్నిటినీ పరిశోధించడం అయాక, అతడు నావైపు తిరిగి "కుడివైపున ఉన్న నాలుగూ నీవి; వాటిని జాగ్రత్తగా చూచుకొనే బాధ్యత నీదీ" అన్నాడు.

నేను ఆ రాత్రి అవి వుండే చోటనే పరుండవలసి వుండునని ఊహించాను. కాని మర్నాడు సాయంకాలందాకా అవేవీ నాకంట పడలేదు. అప్పుడు విల్లీ, నా నాలుగు ఏనుగులూ సరిగా వున్నదీ, లేనిదీ - వాటి మీది సరంజామ సరిగాఉన్నదీ లేనిదీ పరీక్షించమన్నాడు: పరీక్షించే పద్ధతి నాకు తెలుసునని అతడు భావించి వుండాలి. నేను నాకు తోచినట్లు పరీక్షించాను.

మర్నాడు ఉదయం ఆరు గంటలకు ఆయనను చూచి నమస్క రించాను. "ఏమిటి, మీరింకా ఇక్కడే ఉన్నారా?" అని అతడు అన్నాడు. ఆ అడవివలెనే కఠినంగానూ, మొరటుగానూ, ప్రతికూలం గానూ ఆ మాట ఉన్నది. అయితేనేం? మరి కొద్ది సంవత్సరాల్లో అతడే నాకు ఆప్తమిత్రుడైనాడు. క్రమక్రమంగా అడవులూ, చెట్లూ వలె అతడూ నన్ను బాగా అర్థం చేసుకున్నాడు.

నాలుగున్నర సంవత్సరాలు సైన్యంలో పనిచేసిన నాకు ఇక మీద సాహస కార్యాలలో పాల్గొనగలననే నమ్మకం పోయింది. కాని, వనసంచారానికి ప్రారంభించడంతో నాలో నూతనోత్సాహం రేకెత్తి నది. నా సామాను పెట్టెనూ, వంట మనిషినీ, ఇద్దరు సహచరులనూ, ఇద్దరు వార్తాహరులనూ మోస్తూవున్న నాలుగు ఏనుగులతో నా నూతన జీవితం ప్రారంభమైనది. తొమ్మిది మైళ్లు ప్రయాణం చేశాక

ఏనుగులతో కలిసి మెలిసి ఉండే విధానం ప్రారంభమైనదని తెలుసుకున్నాను.

మ్యిత్తా కనుమల్లోని ఒకానొక గ్రామంలో ఉన్న యూ-తా-యాక్ (Yu-Tha-Yauk) అను బర్మాదేశీయుని నేనుకలుసుకోవలసి ఉన్నది. నేను నా సహచరులతోనూ, దూతలతోనూ అడ్డుదారిని ఒక చిన్న ప్రవాహ మార్గాన్ని అనుసరించి నడిచి ముందుగానే అక్కడికి చేరుకున్నాము. మా ఏనుగులు ఎన్నో మైళ్ళు వెనకపడినవి. యూ-తా-యాక్ నన్ను తీసుకు వెళ్ళడానికి, ఆ వూరినుంచి కొంత దూరం ఎదురుగా వచ్చాడు. మేం వస్తూవున్న దారికి ప్రక్కగా ఉన్న ఒక రాతి మీదఅతడు కూర్చున్నాడు. నన్ను చూడడానికి ముందే అతనికి నావిషయమై ఒక అభిప్రాయం ఏర్పడి వుండునని నా తలపు. నేను నా సహచరులతో కలసి, నవ్వుతూ వస్తూవుండడం చూచి, ఒక రాతి మీద నుంచి ఇంకొక రాతి మీదికి దుముకుతూ, ఆప్యాయంగా నన్ను చూశాడు. అతన్ని చూడగా ఎంతో ఉత్సాహం కలిగినది. స్నేహపూర్వకంగా అతడు నన్ను పలుకరించాడు. అతనికి నాయందు ఎంతో అభిమానం వుందని దీనివల్ల గ్రహించగలిగాను.

నాకు తెలిసిన మూడు బర్మా మాటలతో అతనిని అభినందించి - మరేమీ చెప్పలేక నవ్వాను. అతడూ నవ్వాడు. తర్వాత మేము ఒకరి వెనుక ఒకరుగా - సదును చెయ్యబడిన ఒక స్థలానికి వచ్చాము. దానికి చుట్టూ వెదుళ్ళతో కట్టిన పది పూరి గుడిసెలు ఉన్నాయి. మేము అక్కడికి వెళ్ళే సరికి చక్కగా అలంకరించుకొన్న ఒక బర్మా బాలిక నాకోసం ఒక పేము కుర్చీ తెచ్చి వేసినది. ఆ అమ్మాయి వేసుకొన్న తెల్లని కోటూ, జుత్తులో ఉంచుకున్న పువ్వూ ఎంతో ముచ్చటగా ఉన్నాయి. ముగ్గురు మనుష్యులు లేత కొబ్బరికాయలు తెచ్చి,

రంధ్రాలుచేసి, వాటిలోని మధురమైన జలాన్ని ఒక పాత్రలో పోసి, పూజారులు తీర్థాన్ని ఇచ్చే విధంగా అందించారు. నేను అధమం ఆరు గిన్నెల నీళ్లనయినా త్రాగి వుంటాను. ఈలోగా పది పన్నెండుగురు జనం వచ్చి చుట్టూ చేరి నన్ను వింతగా చూడసాగినారు.

ఇంతలో యూ-తా-యాక్, అతని అల్లుడూ వచ్చారు. వారిని చూచి అందరూ తప్పుకొన్నారు. యూ - తా - యాక్ అల్లునికి కొన్ని ఇంగ్లీషు మాటలు తెలుసును. ఏనుగులు కొంచెం సేపటిలో రాగలవనీ; అప్పటికే చాలా పొద్దు పోయినందున-కొంచెం విశ్రాంతి తీసుకోవడం మంచిదనీ వారు చెప్పారు. వర్షాకాలంలో నా బసకు ప్రత్యేకించబడిన ఒక కుటీరాన్ని చూపి, అక్కడికి వెళ్ళగోరారు.

స్నానాన్ని ముగించుకొని, నేను ఆ కుటీరంలో ప్రవేశించాను. అక్కడ ఒక టేబిలు మీద పరిశుభ్రమైన తెల్లని గుడ్డ పరవబడి ఉన్నది. పడకపైని ఉన్ని ఇజారూ, మేజోళ్ళూ, తెల్లని చొక్కా ఉంచబడినవి.

బల్లమీద నా భోజనం సిద్ధంగా ఉన్నది. నా కుర్చీకి వెనుకనే నా సేవకుడు నిల్చున్నాడు. నేను పళ్ళెములలోని మాంసం, కూరలు, తీపి, కారపు పదార్థాలూ ఖాళీ చేస్తున్న కొద్దీ - మరుగుగా వున్న వ్యక్తుల యొక్క చేతులు - నా సేవకుడికి కొత్త పళ్ళేలను అందిస్తూ వుండినవి; నేను కాఫీ పుచ్చుకోగానే - ఆ సేవకుడు నా పడక మీది దోమ తెరను విప్పి, నాకు వంగి నమస్కరించి "సెలవు తీసుకుని వెళ్లుతాను" అనే భావాన్ని వ్యక్తం చేస్తూ అపరిచిత భాషలో చెప్పి వెళ్లి పొయ్యాడు.

ఒంటరిగా ఉన్న నాకు ఇంటిమీద మనస్సు పోయినది. నా విషయములో బర్మాదేశీయులు చూపిన దయ అపారమైనదనీ, ఇంత దయ చూపడానికి కారణం కానరాదనీ నేను అనుకున్నాను. నేను

ఒంటరిని కావడంవల్లనూ, భాష తెలియనందువల్లనూ, మునుముందు కష్టాలు పడవలసి వున్నందు వల్లనూ అక్కడివారు నా మీద ఇలా దయ చూపి ఉంటారని నాకు స్ఫురించలేదు.

౨

మరునాడు ఉదయం - యూ-తా-యాక్ యొక్క శిష్యుడుగా నా నూతన జీవితం ప్రారంభమైనది. నేను ఉత్సాహవంతుడనని గ్రహించి, ఆయన ప్రతీ విషయాన్నీ బోధించడానికి, సంసిద్ధుడై వుండడం నా అదృష్టం! ఆటవిక విజ్ఞానం సంపాదించడమూ ప్రతీ విషయాన్నీ పూర్తిగా పరిశోధించడమూ, విశేషించి ఏనుగులనూ, వాటి పద్ధతులనూ గ్రహించడమూ నా ప్రధాన లక్ష్యాలు!

నేను అతనితో కలిసి, అక్కడినుంచి ఇండాంగ్, (Indaung) రిజర్వు అడవి ప్రాంతానికి వెళ్లవలసి ఉన్నది. చిన్న చిన్న నదులను దాటుతూ నదీమూల స్థానాలవైపు ఎక్కుతూ, దిగుతూ - తూర్పునుంచి పడమరకు ప్రవహించి మ్యిత్తానదిలో కలుస్తూఉన్న ఐదు ఉపనదులను దాటాలి. ఈ విషయాన్ని - ఒక మ్యాపు చూపుతూ, ఆయన చక్కగా వివరించాడు. ఆ నదీమూల స్థలాల ప్రక్కనే ఏనుగుల మకాములు పది ఉన్నవి. ఒక్కొక్క మకాములోనూ ఏడేసి వంతున డెబ్బయి-పనిచేసే ఏనుగులు ఉన్నవి.

మొదటి మకాములో రమారమి ఇరవైమంది బర్మీయులున్నారు. వారిలో ఒక వడ్రంగి - కుటీరనిర్మాణానికి ఉన్నాడు. రాబోయే వర్షాకాలానికి నా ప్రధాన నివాసం అక్కడేనట!

బర్మా టేకుపరిశ్రమకు ఏనుగులు వెన్నెముక వంటివి. టేకు చెట్లు ఈ దేశంలో సమృద్ధిగా పెరుగుతవి. అవి ఉన్న చోట్లకు ట్రాక్టర్లనూ, యంత్రాలనూ చేర్చడం సాధ్యంకాదు. వాటిని నరకడానికీ, నరికిన చోటునుంచి దుంగలను దగ్గరుండే చిన్న ప్రవాహాల వద్దకు చేర్చడానికీ ఏనుగులే కావలెను. అవి లేక, ఆ పని సాధ్యం కాదు. ప్రవాహంలో పడవేసిన ఆ దుంగలు తేలి ప్రయాణంచేస్తూ పెద్ద ప్రవాహాన్ని చేరుకుంటాయి. అక్కడ వాటిని చేర్చి తెప్పలుగా కడతారు. అవి ఆ ప్రవాహంలో ప్రయాణంచేసి, నదులమూలంగా మాండలే, రంగూను మొదలైన పట్నాలు చేరుకుంటాయి. అక్కడ వాటిని సదునుచేసి, పలకలు తీర్చి దూలాలుగా తయారుచేసి వైదేశాలకు ఎగుమతి చేస్తారు.

బొంబాయి-బర్మా కార్పొరేషనువారు ఈ ఏనుగుల యూథాలను భద్రపరచి ఉన్నారు. చాలావరకూ సయాములోనూ, కొన్నిటిని ఇండియాలోనూ కొన్నారు. ఉన్న ఏనుగులలో ఎక్కువ సంఖ్య బర్మాలోని అడవులలో పట్టుకొని, లొంగదీసి తర్బీతు చేసినవే! ఏనుగులను ఈ విధంగా పట్టుకొనడానికే 'ఖెడ్డా చెయ్యడం' అని పేరు. ఏనుగులను పట్టుకోవడంలో బర్మీయులూ, కారెనులూ, షానులూ వేర్వేరు పద్ధతులను అవలంబిస్తారు.

ఈ పెద్ద సంస్థకు ఏనుగుల ఆరోగ్యమూ, వాటిని నిభాయించడమూ, వాటివల్ల ఉపయోగం పొందడమూ ఎంతో ముఖ్యం. బర్మా అడవుల్లో పెంచి, పెద్దవయ్యాక నరికి, ఎంతో కష్టంతో పట్నాలకు పంపి, సరిచెయ్యబడిన టేకు కలపతోనే విలాసార్థమైన నౌకలు తయారగుతున్నవి! వాటి పైభాగంమీద వినోదంగా పచారుచేస్తున్న వ్యక్తుల్లో ఎంతమంది ఈ విషయం గ్రహించగలరో చెప్పలేము!

ఏనుగుమీది సరంజామును తనిఖీ చెయ్యడం, మావటివాళ్లను గురించి తెలుసుకోవడం, ఏనుగుల పరీక్ష, సరంజాము రాపిడివల్లగాని పాదాలకు వెదురు కొయ్యలు గుచ్చుకోవడం వల్లగాని, మరొక విధంగాగాని కలిగినగాయాలను మాన్పడం - ఇవిఏనుగుల మకాములో మామూలుగా జరిగే పనులు! వీటి అన్నిట్లోనూ యూ-తా-యాక్ నాకు మంచి తర్ఫీతు ఇచ్చాడు. నేను ఆయనకు ఎంతో కృతజ్ఞుడను.

నేను అక్కడ మూడు నెలలు ఉన్నాను. ఆ మూడు నెలలూ ఇట్టే గడచిపోయాయి. ఏనుగుల విషయంలో నేర్చుకోవలసిన దాని నంతా నేర్చుకుని, తిరిగి విల్లీ దగ్గరకు వెళ్ళాను. ఏనుగులను చక్కగా చూసుకునేవాడు తయారుకావాలని అతడు ఎంతో ఆశించాడు. నేను అన్ని విధాలా ఆ పనికి తగుదుననే నమ్మిక ఆతనికి కలిగినది. అతని దగ్గర రెండు, మూడు రోజులు ఉన్నాను. నేను అతన్ని విడిచి వెళ్లే టప్పుడు - ఏనుగులను గురించిన పనే ప్రధానంగా చేసుకోవాలనీ, జీవితానికి అదే పరమప్రయోజనమని గ్రహించాలనీ సలహా ఇచ్చాడు. ఇలా సలహా ఇచ్చినందుకు అతనికి ధన్యవాదాలు సమర్పించాను.

## 3

ఏనుగులలో మూడు రకాలు కానవస్తాయి. ఒకటి ఆసియా ఖండానిదీ, రెండు ఆఫ్రికా ఖండాని విన్నీ. ఆసియాజాతి ఏనుగులు సాధారణంగా జంతుశాలల్లోనూ, సర్కసులలోనూ కనబడతవి. వాటిని మచ్చికచెయ్యడం చాలా సులభం. ఆఫ్రికాజాతి ఏనుగులను పట్టుకోవడమూ కష్టమే, వాటిచేత పని చేయించుకోవడమూ కష్టమే! వాటిని ఛాయాచిత్రాల్లోనూ, ఫిలుములలోనూ చూడవచ్చును. ప్రత్యక్షంగా అవి కనబడడం మిక్కిలి అరుదు.

ఆసియా ఖండపు ఏనుగులలో నాలుగు జాతులు ఉన్నవి. ఆ జాతులు ఇండియా లేక బర్మా జాతి, సింహాళ జాతి, మలయా జాతి, సుమాత్రా జాతిన్నీ. ఇవన్నీ ఇంచుమించు ఒక్క మాదిరిగానే ఉంటవి. వీటి చెవులు చిన్నవి. తొండము మృదువుగానూ, చివర సూది గానూ ఉంటుంది. పిడి ఏనుగులకు (ఆడఏనుగులు) దంతములు ఉండవు.

సింహాళ జాతిలో - మగ ఏనుగుకూ, పిడి ఏనుగుకూ కూడా దంతములు ఉండవు. ఆ ద్వీపంలో వాటికి లభించే ఆహారమే దీనికి కారణమని అంటారు. వీటిమీద సరంజాము ఏర్పాటుచేయరు. దంతాలకు గట్టి తాడుకట్టి లాగుతారు.

ఆఫ్రికా ఏనుగు పొడుగ్గానూ, అసియా ఏనుగుల కంటె సన్నంగానూ ఉంటుంది. దాని చెవులు పెద్దవి. తొండం మొండిగా ఉంటుంది.

ఆఫ్రికా ఏనుగును మచ్చిక చెయ్యడం సాధ్యంకాదని సర్వ సాధారణంగా అనుకోవడం కద్దు. ఆ అభిప్రాయం సరికాదు. ఎక్కువ చంచల స్వభావంగల ఆ ఏనుగులను పట్టుకొన్న ఘట్టాలు ఉన్నవి. వాటిని మచ్చిక చెయ్యడం చాలా అరుదు కావడానికి కారణం ఉన్నది. అక్కడి నీగ్రోలకు ఏనుగులను మచ్చికచేసి పనిచేయించుకునే స్వభావంగాని, అట్టి సంప్రదాయంగాని లేవు. పూర్వం రోముపైకి దాడివెడలినప్పుడు కార్తేజియనులు ఈ యేనుగులను మచ్చికచేసి యుద్ధంలో ఉపయోగించుకొనేవారు.

యుద్ధాల్లో ఏనుగులు ఎంతో అవసరమైనట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. అనాదికాలంనుంచీ ఇండియాలో ఏనుగులను మచ్చిక చెయ్యడం కలదు. అలెగ్జాండరు ఇండియాపైకి ఎత్తివచ్చినపుడు,

అతని సేనలను ఎదిరించడానికి ఏనుగులు ఉపయోగించబడ్డవి. అవి ఎంత భయంకరంగా కనిపించినా, మంచి తర్ఫీతు పొందిన సైనికుల ఆయుధాల దెబ్బలను తట్టుకొనలేకపోయాయి.

ఏనుగు తొండమునకు దెబ్బ తగిలినదంటే - ఆ దెబ్బతిన్న ఏనుగును లొంగతీయడం సాధ్యంకాదు. అలాంటి ఏనుగులు శత్రు పక్షానికి నష్టం కలిగించడానికి బదులు తమ పక్షానికే ఎక్కువ నష్టాన్ని కలిగించుతవి. ఒక్కొక్కపుడు ఈ ఏనుగులు ముప్ఫయి ఇద్దరు విలుకాండ్రు పట్టగల పెద్దపెద్ద హౌదాలనుకూడా మొయ్యగలవు.

ఇండియాలో ఏనుగులు క్రమంగా క్షీణించి పోతున్నవి. కొందరు రాజులు గౌరవం కోసమూ, ఉత్సవాల కోసమూ, వేట కోసమూ వాటిని పోషిస్తారు. ఇండియాలోని జనానికి ఏనుగులపై ఆసక్తి ఎక్కువ. పిల్లలకు ఉత్సాహం కలిగించే పూర్వ వీరులకు సంబంధించిన కథల్లోనూ, గాథల్లోనూ ఏనుగులను గురించిన ప్రస్తావన వుండనే వుంటుంది.

మచ్చిక పడిన ఏనుగులను గురించి తెలుసు కోవాలంటే - ముందుగా అడవి ఏనుగులను గురించీ, వాటి అలవాట్లను గురించీ తెలుసుకోవలసి ఉన్నది. సాధారణంగా అడవి యేనుగులు ముప్ఫయి మొదలుకొని ఏభయి వరకూ కలిసి మందగా చేరి నివసిస్తూ ఉంటాయి. ఇవి ఆహారాన్ని వెతుక్కుంటూ ఏడాది పొడుగునా చాలా దూరం సంచరిస్తాయి. వర్షాకాలంలో - అంటే జూను నెల నుంచి అక్టోబరు వరకూ కొండల మీది అడవుల్లో ఉంటూ వెదురు తిని జీవిస్తాయి. ఒక్కొక్క నదీ మూలస్థానంలోనూ వారం, పది రోజులు ఉండి, ఆ తర్వాత అకస్మాత్తుగా పది మైళ్ళ దూరంలో వుండే మరొక చరియకు పోయి అక్కడ వారందినములు గడపుతవి. వర్షఋతువు

ముగిసిన తర్వాత క్రిందికి దిగి బురదగా ఉండే కనుమలు చేరి, అక్కడి పచ్చిగడ్డిని తింటాయి. అప్పట్లో ఎక్కువగా వెదురుపై ఆధారపడి ఉండవు.

ఈ సమయంలోనే బాగా పెరిగిన మగ ఏనుగులు మందలో చేరుతాయి. అవి మందలో చేరడం అరుదు. తరచుగా అవి మందకు అరమైలు దూరంలోగాని, మైలు దూరంలోగాని ఉంటాయి. ఈ సమయంలోనే అవి పిడియేనుగుల దగ్గర చేరడమూ, జత కట్టడమూ జరుగుతుంది. ఈ సందర్భంలో పెద్ద యేనుగు, తాను జత కట్టదలచిన ఏనుగును ఆసించే చిన్న యేనుగుతో పోట్లాడడం సంభవిస్తుంది.

సంవత్సరం పొడుగునా తమకు మేతకు పనికివచ్చే స్థలాలు ఎక్కడెక్కడ వుండేదీ ఏనుగుల మందకు తెలుసును. ఆయా స్థలాలకు వెళ్లుటకు - కొండల వరుసలో వుండే సరియైన మార్గాలనూ అవి ఎరుగును. ఉన్నత ప్రదేశాల నుంచి - క్రిందుగా వుండే నదీమూల ప్రదేశాలకు రావలసినపుడు - మార్గం చాలా ప్రమాదకరమైనది కాబట్టి, అవి తొందర పడకుండా నిదానంగా ఒకదాని వెంబడి వేరొకటి వస్తాయి; వచ్చేటప్పుడు అడుగులను చాలా జాగ్రత్తగా వేస్తూ ఉంటాయి.

తమ ఆహారప్రదేశాలకు ఎవరివల్లనైనా చిక్కు కలిగినదంటే ఇవి చాలా అసహ్యపడతవి. అలాంటప్పుడు అవి సాధారణంగా ఇతర జంతువులవలె బెదరి పారిపోవు. చక్కగా శిక్షణను పొందినట్లుగా అవన్నీ ఒక ఏనుగు చుట్టూ చేరుతవి. అప్పుడు వాటి మొనగాడైన గజరాజు అక్కడినుంచి ఎలా తప్పుకుని పోయేదీ నిశ్చయిస్తుంది. అది ముందు దారితియ్యగా, తక్కినవన్నీ దాన్ని అనుసరించుతవి. అలా వెళ్లేటప్పుడు వాటికాళ్లకింద పడినవన్నీ, రోడ్డు రోలరుక్రింద పడి నలిగిపోయినట్లు నలిగిపోతాయి.

భయకారణమైన ప్రమాదం సంభవించే స్థలం సరిగా తెలియనప్పుడు ఏనుగులు తాము మేతమేస్తూ వచ్చిన దారినే వెనకకు మళ్లుతాయి. అప్పుడు, అవి మూడేసిగాని, నాలుగేసిగాని ఒక జట్టుగాచేరి ఒకదాని వీపుమీద మరొకటి తొండం పెట్టుకొని బారుకట్టి వెళ్లుతవి.

అడవి ఏనుగులలో చాలామట్టుకు - మార్చి - మే నెలల మధ్యనే పిల్లలను కనడం ఉన్నది. పుట్టిన మొదటి నెలలో ఏదయినా ఆపద కలిగితే తల్లి యేనుగు దానికి తొండంచుట్టి జాగ్రత్తగా తీసుకుపోతుంది. ఇట్టి సంఘటనను నేను కళ్లారా చూచాను.

ఏనుగు ప్రసవిస్తే, దానిని తక్కిన ఏనుగులు తమ అన్నిటికీ సంబంధించినట్లు భావిస్తాయి. అవి ప్రసవించే స్థలాలకు సమీపంలోనే నేను బసచేస్తూ ఉండేవాడను. సాధారణంగా వేసవిలోనే ఏనుగులు ప్రసవిస్తూ వుంటాయి. ఆ రోజుల్లో రాత్రివేళ అడవి యేనుగులు గట్టిగా అరుస్తూ, చాలా గందరగోళం చేసేవి. ఇలా చెయ్యడానికి కారణ మేమిటో నాకు చాలా సంవత్సరాలవరకూ తెలియనేలేదు. పులులు మొదలైన వాటినుంచి తల్లికిగాని, పిల్లకుగాని అపాయం కలగకుండా వుండడంకోసం, అవి యిలాచేస్తాయని దరిమిలాను గ్రహించాను. ఆ అరవులు ఎంతో భయంకరమైనవి! ఆ పుట్టిన పిల్ల తల్లి వెనక తిరుగుతూ ఆహారం సంపాదించుకొనే వరకూ - కొన్ని వారాల పాటు ఆ ఏనుగులు ప్రసవించిన ప్రదేశానికి సమీపంలోనే ఉంటాయి. మచ్చిక పడిన ఏనుగులు మనుష్యులమీద ఎంతో నమ్మకం కలిగి, వారితో కలిసిమెలిసి వుండడం వింతగానే కానవస్తుంది. అవి మనుష్యులను చూచి భయపడతాయి కూడా. ఆ భయంవల్లనే - అవి లెక్కకు మిక్కిలిగా వున్నా, గ్రామాలలోని పంటలకు ఏమాత్రమూ చెరుపు చెయ్యవు.

అడవి యేనుగులు ఎల్లప్పుడూ ప్రమాదాన్ని కలిగిస్తాయని అనుమానించ నక్కరలేదు. నేను చాలాసార్లు నా ఏనుగుపై నెక్కి, ఏభయ్యేసి అడవి యేనుగుల మంద మధ్యనుంచి వెళ్లి వున్నాను. ఒకప్పుడు నా ఏనుగు ఒక అడవి యేనుగును రాచుకునే వెళ్ళినది. ఏవీ చూడకుండా, నేను మట్టిలో పొర్లాడుతూ వున్న ఏనుగు పిల్లలను పరిశీలించి, వాటి ఫోటోలుకూడా తీసుకున్నాను.

అడవి యేనుగులను గురించి ఉత్సాహకరమైన కల్పిత కథలు కొన్ని ఉన్నవి. మగ ఏనుగులుగాని, ఆడ ఏనుగులుగాని - తమ జీవిత కాలం సుఖంగా గడిపి ముసలివి అయిపోయినప్పుడు దుర్గమారణ్యం లోని సంప్రదాయ సిద్ధమైన శ్మశానభూమికి పోయి ప్రాణాలు విడుస్తాయట! ఇలా అనుకోవడానికి కారణం ఏమంటే - సాధారణంగా ముసలి ఏనుగులు కనబడవు! ఏనుగులు యీ విధంగా మరణించే స్థలం తెలుసుకోడానికి ప్రయత్నించినా సాధ్యపడలేదు. వాస్తవంగా - జరిగేది ఏమిటంటే—

చాలా ముసలిది ఐపోయాక - రమారమి డెబ్బయి అయిదేళ్ల వయస్సు వచ్చాక మగ ఏనుగు మందల వెనక తిరగడం మానుకుని ఒంటరిగా ఉండాలని కోరుకుంటుంది. అది దూరప్రదేశాలు తిరగడం మాని ఒక చిన్న ప్రవాహప్రాంతంలో ఉండిపోయి, మేత మెయ్యడం, విశ్రాంతి తీసుకోవడం, తన ఆరోగ్యం చూసుకోవడం - వీటికే తన సమయాన్ని వినియోగిస్తుంది. దానికి దినానికి ఆరువందల పౌనుల ఆహారం కావలసి వున్నది. దానిని సంపాదించుకునే శక్తి దానికి ఉండదు. దాని దవుడలు లోపలికి తోసుకుపోయి, దంతాలు పైకి వస్తాయి. బరువు తగ్గిపోతుంది. ముసలితనమూ, బలహీనతా దాని శరీరాన్నీ హృదయాన్నీ క్షీణింపజేస్తాయి. వర్షాకాలంలో మాత్రం

దానికి ఎక్కువ కష్టమని అనిపించదు. అప్పుడు వెదురు బాగా పెరుగుతుంది. ఆ కాలంలో ఏనుగు కొండలమీదనే ఉంటుంది. వర్షాలు ఆగిపోయాక ఆహారం దొరకడం చిక్కయినపుడు అది క్రిందికిదిగి పొడుగాటి గడ్డిమేసి జీవిస్తుంది. వేసవిలో కార్చిచ్చు వ్యాపించి అంతటినీ కాల్చివేసేటప్పుడు, ఈ యేనుగు ఆహారానికి మరీ కష్టపడుతుంది. ఆహారం కోసం తిరిగి తిరిగి అది చాలా అలసిపోతుంది. దాని జీర్ణశక్తి తగ్గుతుంది. ఏప్రిలు, మే నెలల్లో వర్షాలు పడగా, చలి ఎక్కువ అవుతుంది. జ్వరం వస్తుంది. చల్లని నీరు దొరికే నీటి పల్లములు ఎక్కడవుండేదీ దానికి తెలుసు. అక్కడ సమృద్ధిగా ఆహారము దొరుకుతుంది. అందువల్ల ఈ వృద్ధగజం, అక్కడికిపోయి కొంత కాలం హాయిగా వుంటుంది. కాని, క్రమంగా నీరు తగ్గిపోయినప్పుడు, అది తన తాపం చల్లార్చుకొనుటకై చల్లని బురదను, మట్టిని తొండంతో తీసి శరీరంపై చల్లుకొంటుంది. మే నెల చివర - విపరీతపు తాపం కలిగించే సాయం సమయంలో అది నీళ్లు తాగడానికి ఆ ఏకాంత స్థలానికి వస్తుంది. పదిమైళ్ల దూరంలో తుపాను బయలుదేరుతున్నదనీ, పెద్దవర్షాలు పడతాయనీ అది గ్రహిస్తుది. ఆంసన్నని ప్రవాహం బ్రహ్మాండమైన బురదనీటి ప్రవాహంగా మారి చెట్లనూ, దుంగలనూ, చెత్తచెదారములనూ వడిగా తోసుకుంటూ వచ్చే సమయం అది! ఈ యేనుగు, తన తలను వెనకకు త్రిప్పి, కడపటి సారిగా తొండంతో నీరు పీల్చి మీద పోసుకుని-మైకం పొందుతుంది. ఉరుముల ధ్వనుల్లో దాని మూలుగు లీనమైపోతుంది. ఆ మూలుగుతోనే అది కూలిపోయి, ఎట్టి శ్రమా లేకుండా ప్రాణం విడుస్తుంది.



అడవుల్లోకి రోడ్డులూ, రైలు మార్గాలూపడి, అక్కడి ఏనుగుల మందలను క్షీణింపజేస్తాయి. ఇండియాలోని ఏనుగులు చాలా వరకూ తగ్గిపోవడానికి ఇదే కారణం! బర్మాకుకూడా ఇదేగతి పడుతుందేమో అని భయంగా ఉన్నది. అదృష్టవశాత్తూ బర్మాలోని ఉత్తర భాగంలో విస్తారమైన అడవులు ఉండడంవల్ల, అన్ని స్థలాలనుంచీ వచ్చే ఏనుగు లన్నీ అక్కడే చేరుకోగలవు. కాని, ఇలా జరగడానికి చాలా కాలం పట్టవచ్చు.

క్రిందుగా ఎగురుతూపోయే విమానాలంటే ఏనుగులకు చాలా భయం! విమానాలు వాటి శాంతిని పాడుచేసి బెదురును కలిగిస్తాయి. ఆ బెదురు వాటి సంతతికి కూడా కొన్ని తరాలవరకూ సంక్రమిస్తుంది.

మోల్మేను, మాండలే, రంగూను పట్టణాల్లోని రంపపుకోత మిల్లులలో ఱేకు దూలాలను దొంతులు పెట్టేపనిని ఏనుగులు చేస్తూ వుంటాయి. వాటికి తగు మాత్రపు ఆహారం ఇస్తుంటారు. ఇండియాలో రాజులు పోషించే ఏనుగుల పద్ధతీ యిట్టిదే! గుర్రాలను సాలల్లో కట్టిపెట్టినట్లు వీటిని గజశాలల్లో ఉంచుతారు, లండనులోని జంతు శాలలో ఉంచిన విధంగా. మిల్లులలో పనిచేస్తూవున్న ఏనుగులను చూడడానికి ఎవరైనా రాదలిస్తే - అట్టివారు పగలు పన్నెండున్నరకు రావాలని యజమానులు కోరుతారు. ఎందుచేతనంటే - ఒంటిగంటకు మధ్యాహ్న భోజనపుగంట కొట్టగా, మనుష్యులలాగే ఏనుగులు కూడా తమ పనిముట్లను క్రింద పడవేస్తాయి. గంట వినీ వినబడగానే, అవి తమ దంతాలకూ, తొండమునకూ నడుమ ఉండే దూలాన్ని దొంతరమీద ఉంచకుండా నేలమీదనే పడవేస్తాయి.

ఏనుగుల యొక్కయూ, వాటి పిల్లల యొక్కయూ పరిస్థితులను బాగు చెయ్యవలెననే సంకల్పంతో నేను బర్మాదేశానికి వచ్చాను. అది జరగవలెనంటే - మొదట (ఊజీల) మావటి వారి పరిస్థితులు బాగుపడవలెను. బర్మాలో కలప పనికి ఉపయోగించే ఏనుగులనూ, మావటీలనూ వేరుచెయ్యడం సాధ్యం కాదు. పుట్టుకతోనే వాళ్లకు గజవిషయమైన పరిజ్ఞానం కలుగుతుంది. అడవుల్లో, వాళ్ల కుటీరాలు చాలా దూరంగా వుంటాయి. ఆరేళ్లవయస్సు వచ్చిన దగ్గరనుంచీ వాళ్లు ఏనుగు మీదనే వుండి, ఏనుగులను గూర్చిన అన్ని అంశాలనూ, కథలనూ, గాథలనూ కూడా గ్రహిస్తారు. పధ్నాలుగేళ్ల వయస్సు వచ్చిన దగ్గర్నుంచీ సంపాదన ప్రారంభిస్తారు. వీరి ఉద్యోగం, పయ్‌జాయ్‌క్ (Paijaik = దుంగలకు, గొలుసులు తగిలించే పనివాడు)గా - మావటీనికి సహాయుడుగా - ప్రారంభం అవుతుంది. కొన్నాళ్లు పోయాక, ఆ బాలునికి మావటివాని పదవి లభిస్తుంది. ఏనుగు యొక్క బాధ్యతను సంపూర్ణంగా సంక్రమింపజేసే ఆ పదవి లభించినరోజు అతనికి ఒక గొప్ప పర్వదినం! పధ్నాలుగేండ్ల బాలుడు ఆరేండ్లగున్న ఏనుగుపై స్వారి చెయ్యడం ఎంతో ముచ్చటగా కానవస్తుంది. చిన్న పిల్లవాళ్లు కుక్క పిల్లలను స్వాధీనం చేసుకొన్నట్లు, వారు ఏనుగు పిల్లలను స్వాధీనం చేసుకుంటారు. కాని కుక్క పిల్లలను బాధపెట్టినట్లు బర్మాపిల్లలు ఏనుగులను బాధించరు. అది చికాకుపెట్టి కోపం తెప్పించినప్పుడు మాత్రం మావటీడు ఏనుగును కొంచెం బాధపెడతాడు. సాధారణంగా అతడు శాంతాన్ని వహించే వుంటాడు.

'ఊజీ'ల జీవితం కొంతవరకూ కష్టతరమైనదే! మొట్టమొదటిది - వారు ప్రతి నిత్యమూ ఉదయం తమ ఏనుగు ఎక్కడుంటుందో వెతికి మకాముకు తీసుకుని రావలసి వుంటుంది. ఆ మకాము

వాళ్ల స్వగ్రామానికి నూరు మైళ్ల దూరంలో వుంటుంది. ఆ మకాములో చాలా స్వల్పంగా గుడిసెలు ఉంటాయి. దట్టమైన అడవుల్లో బసచెయ్యవలసివచ్చినపుడు ఏదైనా ప్రవాహతీరంలో కిత్తలినార గుడ్డలు కప్పిన తాత్కాలికకుటీరంలో తలదాచుకోవలసి వస్తుంది! ఊజీ ఏనుగును పట్టుకుని ఎనిమిదిమైళ్ల దూరం నడిపించి, మకాముకు తీసుకుని రావాలి. ఆ ఏనుగును తీసుకుని ఎన్నో ఉపద్రవాలకు నిలయమైన గాఢారణ్యంలో నుంచి బసకు ప్రయాణం చెయ్యవలసి ఉంటుంది. ఈ పని చేసేటప్పుడు అతడు, తాను కూడా ఒక అడవి మృగాన్నసే భావనతో - అడవి మృగాలవలె - ఎంతో హెచ్చరిక కలిగి, ఏమరుపాటు లేక ఉండాలి.

తన ఏనుగు ఎక్కడ వున్నదీ కనుక్కోడానికి ఏనుగుల అడుగు జాడలు ఊజీకి ఎంతో ఉపయోగిస్తాయి. వాటిని బట్టి ఏనుగు ఆకారమూ, ఎత్తూ, దానిని గురించిన విషయాలూ అతడు గ్రహిస్తాడు. అతడు తన ఏనుగు అడుగు జాడలను కనిపెట్టి, వాటిని అనుసరించే వెళుతూ, అనేక కొత్తవిషయాలను కనిపెడతాడు. గతరాత్రి ఆఏనుగు ఎక్కడ ఉండినదీ తెలుసుకుంటాడు. దాని లద్దెలను పరిశీలిస్తాడు. లద్దెను కాలితో తన్ని ఆ ఏనుగు ఎక్కువ వెదురు తిన్నదనీ, తర్వాత - బహుశా క్రింది భాగంలో వుండే ప్రవాహతీరాల్లో మొలిచిన కాయింగ్ (**Kaing**) గడ్డిని తినడానికి వెళ్లివుంటుందనీ ఊహిస్తాడు.

ఆ ప్రవాహపు గట్టుపై కెక్కి, పదినిమిషాలపాటు నిలిచి ఏదైనా శబ్దం వినబడుతుందేమో అని పరిశీలిస్తాడు. ఎందుకంటే - ఏనుగుల మెడకు గంట కట్టడం అలవాటు. ఏనుగులకు వేర్వేరు రకాల గంటలు ఉంటాయి. గంట యొక్క ధ్వనినిబట్టి అది తన యేనుగు అయినదీ, కానిదీ ఊజీ నిశ్చయిస్తాడు. తాను వినినది తన ఏనుగుకు

కట్టిన గంట యొక్క ధ్వని కాదని తెలిశాక, అతడు ముందుకు సాగి గట్టుదిగి పోయి, కాయింగ్ గడ్డి ఉండేచోటికి అరమైలు దూరంలో నిలచి మళ్ళీవింటాడు. అప్పుడు తాను గట్టిన గంట చప్పుడే వినబడ తుంది. ఆ చప్పుడు చేసినది తన ఏనుగే అని ఊజీ అప్పుడు తెలుస కుంటాడు.

తన యేనుగు అక్కడవున్న సంగతి తెలుసుకుని అతడు ఆ వైపు వస్తూ పాడడానికి ప్రారంభిస్తాడు. ఆ పాట విని, ఆ యేనుగు తన యజమాని వస్తున్నాడని తెలుసుకుంటుంది. అట్టి అడవిలో ఒక నౌకరు బెదిరించడం ఉభయులకూ శ్రేయోదాయకం కాదని ఏను గుకూ తెలుసు; మావటీనికీ తెలుసును. అందువల్ల తొమ్మిదడుగుల ఎత్తు పెరిగిన గడ్డిలో చొరబడక, ఊజీ ప్రవాహం ప్రక్కను ఉండే బండరాతిమీద కూర్చుని, వేణువును ఊదుతూ, నడుమ నడుమ 'లా, లా, లా' (రా - రా - రా) అని తన ఏనుగును పిలుస్తాడు. ఆ పొడుగాటి గడ్డిమధ్య - ఆ యేనుగు ఎక్కడ మేస్తున్నదీ - చడీ, చప్పుడూ కొంచెమైనా ఉండక పోగా, అతడు పిలుపును మార్చి వేసి "డిగోలా, డిగోలా" (ఇక్కడికిరా, ఇక్కడికిరా)అని ఆహ్వానిస్తాడు అప్పటికీ కదలిక ఉండదు. అయినా, అతడు శాంతం వహించి, బాగ పిలుస్తూ, ఆ రాతి మీదనే పావుగంటసేపు కూర్చుని, కష్టపడి పనిచెయ్య వలసిన మరొక దినం వచ్చిందని ఆ ఏనుగు తెలుసుకొనేటట్లు చేస్తాడు. ఊజీ ఏనుగును తొందర పెడితే, అది ఎదురు తిరగవచ్చును !

వెంటనే ఆ యేనుగు ఆ గడ్డిలోంచి బయటకు వస్తుంది. ఊజీ దానితో ముచ్చట లాడుతూ "నీ కోసం ఎదురుచూస్తూ ఉండడం తప్ప నాకు మరొకపని లేదనుకున్నావా ? చూడూ! నిన్నటి మధ్యాహ్నం నుంచీ నీవు హాయిగా మేస్తున్నావు. నేనో చలిది భోజనంలో ఒక ముద్దయినా నోటపెట్ట లేదు" అని అంటాడు.

దాన్ని ఆదేశిస్తున్నట్లుగా 'హ్మిట్' (Hmit = కూర్చో) అని అతడంటాడు.

అది తన కటిప్రదేశాన్ని వంచి, కాళ్లు నిడుపుగా ఉంచి, తన యజమాని తన్ను సమీపించడానికి సమ్మతిని తెలుపుతుంది.

'టా' (Tah = నిలువుము)అని మళ్లీ ఆజ్ఞ యివ్వగానే, అది అలాగే చేస్తుంది. ముందు కాళ్లు దగ్గరగా చేర్చి, అప్పుడు మావటీడు వంగి, దాని కాళ్లకు కట్టిన బందాన్ని విప్పి దాని మూపుమీద పడ వేస్తాడు. ఈ బందాలు గొలుసులై వుండవచ్చు; లేదా పేముతో తయారైనవైనా కావచ్చును! బందం వేసినప్పుడు, అది ఇటూ అటూ జోగిపోతూవుండి క్రమంగా దాట్లువేస్తూ నడుస్తుంది. బందం వేసినా సరే, అది వేగంగా నడవగలదు. కొంచెం దూరం వరకూ మనిషి పరుగెత్తినట్లుగా అది వేగంగా నడవడం కద్దు.

కాళ్లబందం తీసివేశాక ఊజీ "కూర్చో" అని ఆజ్ఞ యిస్తాడు. ఏనుగు కూర్చుంటుంది. అప్పుడు అతడు దాని వీపుపైకి ఎక్కి కూర్చుం టాడు. ఏనుగు, వెనకటిదినం మేత మేస్తూ ఏదారిని వచ్చిందో, ఆ దారినే వెనుకకు ప్రయాణంచేసి మకాము చేరుతుంది.

మకామునకు వచ్చాక ఊజీ భోజనంచేసి, ప్రవాహపు నీటిలో ఏనుగును బాగా తోమి కడిగి, పనిచెయ్యడానికి దానిని సిద్ధపరుస్తాడు. ఆరోజున చెయ్యవలసినపని - మకామునకు రెండువేల అడుగుల ఎత్తులో ఉన్న కొండను ఎక్కడమూ, చెట్టు నరికి సిద్ధంగా ఉంచ బడిన దుంగను క్రింది ప్రవాహం దగ్గరకు తీసుకురావడమున్నూ.

నాలుగు టన్నుల బరువైన దుంగను సన్నని కొండపైభాగం నుంచి ఈడ్చుకొని రావడం ఎంతో ప్రమాదకరమైన పని. ఆ దుంగ

పక్షుణమైనా దొర్లిపోవచ్చును. కాని, దానిని లాగుకొని వచ్చే ఏనుగు ప్రతి అడుగు - కాదు కాదు - ప్రతి అంగుళమూ ఎంతో జాగ్రత్తతో గమనించి పనిచేస్తుంది. అప్పుడు దానికి ఉండేశాంతం ఎవ్వరికీ ఉండదు.

ప్రమాదకరమైన ఘట్టం తప్పిన తర్వాత - అంటే - సన్నని కొండ పైభాగంనుండి ప్రవాహానికి అరమైలు దూరం వరకూ దుంగను తెచ్చాక - అక్కడినుంచి దాన్ని ప్రవాహం ప్రక్కకు తెచ్చివుంచడం అంత కష్టమైన పని కాదు. అక్కడికి దుంగ చేరేసరికి మధ్యాహ్నం మూడు గంటలయి ఉంటుంది. అప్పుడు మావటీడు దాని సరంజామ తీసివేసి, కాళ్లకు బందాన్ని తగిలించి, వీపు చరుస్తూ "ఇక నీవు పోయి హాయిగా మేయవచ్చును"అని ఆ ఏనుగుతో చెప్తాడు. చెప్తాడే - కాని, ఆ ఏనుగు మేతకు కొంతశ్రమ పడవలసే ఉన్నది. చెట్టు కొమ్మలను విరవడం, తీగలను తెంపడం, గడ్డిపై భాగాన్ని తుంచడం మొదలైనవి చేస్తేనేగాని, దానికి నమలడానికీ, మింగ డానికీ దొరకదు. ఊజీకి కూడా అంతటితో విశ్రాంతి లభించదు. సరంజామును బాగుచెయ్యడం, దుంగను సరిగా ఉంచడం, ఏనుగు నడుముకు కట్టే తాళ్లను నారతో తయారు చెయ్యడం మొదలైన పనులు అతనికి వుండనే వుంటాయి. ఇలాగు సరంజామ చేసివేసి నప్పుడే ఏనుగు దుక్కలనూ, దుంగలనూ లాగేటప్పుడు కొంతశ్రమ తగ్గుతుంది.

మావటీని నిత్యకృత్యం యిది. ఇంత పనిచేసినా, అతడు చాలా హాయిగానే ఉంటాడు.

ఊజీలకు జూదం విశ్రాంతి స్థానం! వాళ్లు సాధారణంగా జూదంలో తమ చొక్కాలను కూడా ఓడిపోతారు. ఒక సంవత్సరంలో ఒక్క చొక్కానే మార్చి మార్చి ఆరుగురు ధరించడం నేను చూశాను.

పనిచేసేటప్పుడు వాళ్లు చొక్కాలు ధరించరు. పని అంతా తీరి పోయాక సాయంకాలంలోనూ, ఏనుగులను తనిఖీకి తీసుకుని వెళ్లే టప్పుడు మాత్రం ధరిస్తారు.

జూను నుంచి మార్చి వరకూ మాత్రం వాళ్ళు ఈ విధంగా కష్టపడి పని చెయ్యవలసి ఉంటుంది. తర్వాత మూడు నెలలు విశ్రాంతి. అప్పుడు కూడా దుంగలను ప్రవాహం ఒడ్డుకు చేర్చేపని లేకపోయినా ఏనుగులను చూచుకునే బాధ్యత వుండనే వుంటుంది.

మావటివాళ్ళు ప్రాచీన పద్ధతులలో ఉండడంవల్ల, వారికే కాక వారి కుటుంబంలోని యావన్మందికీ వైద్యసహాయం ఎంతో అవసరం ! సమీపంలో నివసించే ఐరోపీయుడు తప్ప చికిత్సచేసే మరొకరు ఉండరు. మలేరియా, న్యూమోనియా తరచుగా సంభవిస్తాయి. గ్రహణి, కలరా, మసూచికము ఆ అడవి ప్రదేశంలో సంభవిస్తూ వుంటవి. ఏనుగులను పనిచేసేటట్లు చేయడమనే ఆకర్షణ అనేదే లేక పోతే, ఐరోపియనులు ఇట్టి క్లిష్టపరిస్థితులకు గురియైన అడవులలో ఉండడం అసాధ్యమే. ఏనుగులవలెనే అడవిలో నివసించే బర్మీయుడు కూడా ఒక విచిత్రమైన రోగి ! ఏనుగుగాని, ఊజీగాని జబ్బు పడినప్పుడు చికిత్సలో ఎక్కువ అనుభవం లేని వైద్యులను కూడా దృఢంగా విశ్వసించడం వింతగానే వుంటుంది. అట్టి వైద్యుని దగ్గర ప్రథమ చికిత్సకు ఉపయోగించే మందులు ఉండే చిన్న పెట్టె - బిస్కత్తుల డబ్బావంటిది - మాత్రం ఉంటుంది. అయితే నేం? ఆ వైదు మీద గల గట్టిన్యి నమ్మకమే మందులు లేని కొరతను తీరుస్తుంది.

౫

మనుష్యులు ఎంత కాలం జీవిస్తారో ఏనుగులున్నూ అంత కాలం జీవిస్తాయి. మనుష్యులకు ఎప్పుడు యుక్తవయస్సు వస్తుందో వాటికిన్నీ అదే సమయంలో యుక్తవయస్సు వస్తుంది. జీవితాంతము వరకూ గజములూ, మనుష్యులూ కలిసిమెలిసి ఉండగలరు. ఒకరి నింకొకరు బాగా తెలుసుకొని, పరస్పర స్వభావాలను గ్రహింపగలరు. మరి ఏ పెంపుడు జంతువునకూ ఇలా వుండడం సాధ్యంకాదు.

మకాములో ఒక బాలుడు పుట్టవచ్చు; అదే సమయములో ఒక ఏనుగు పిల్ల అక్కడికి ఒకటి, రెండు మైళ్ళ దూరంలో - అడవిలో పుట్టవచ్చును. అయినా - ఆ బాలుడూ, ఈ ఏనుగు పిల్లా కలిసిమెలిసి పెరిగి, కలిసి మెలిసి ఆడుకొని, పెద్ద అయాక కలిసి మెలిసి పనిచేసి - చివరకు వయస్సుముదిరి అరవైయేళ్లు ఒంటికి వచ్చినా ఎంతో పరిచితులైన మిత్రులవలెనే ప్రవర్తిస్తారు.

ఏనుగులు కట్టులో వున్నప్పుడు జతకట్టవు. అవి స్వేచ్ఛగా పరిసర ప్రదేశాలలో తిరుగుతూ వున్నప్పుడే జతకడతాయి. యుద్ధం జరుగుతూవున్న కాలంలో నేను ఒకప్పుడు ఇద్దరు యుద్ధవార్తా విలేఖరులతో ఏనుగులను గురించి ముచ్చటిస్తూ వుంటిని. వారిలో ఒకడు అమెరికా దేశస్థుడు; ఇంకొకడు ఆఫ్రికా దేశస్థుడు. "వాటి ప్రణయ ప్రవృత్తులను గురించి ఏనుగులు సిగ్గుపడతాయట, నిజమేనా?" అని ఆస్ట్రేలియా దేశస్థుడు ప్రశ్నించాడు. నేను సమాధానం చెప్పడానికి ముందుగానే అమెరికా దేశస్థుడు అందుకుని చిరునవ్వు నవ్వుతూ "అవి సిగ్గుపడుతూ వుండవచ్చు. నీవు సిగ్గుపడవా?" అని అన్నాడు. మేము నవ్వుకున్నాము.

ఏనుగులు రహస్యంగా జతకడతాయి. తన ఏనుగు ఎప్పుడు జతకట్టినదీ ఆడ మగ ఏనుగుల "ఊజీ"లకు కూడా తెలియక పోవచ్చును. సాధారణంగా, తెలిసినా, దాన్ని గురించి ఎవ్వరూ పాటించరు; ఆవిషయాన్ని గురించి ప్రసంగించరు.

సాధారణమైన పిడియేనుగు పదిహేడు, ఇరవై యేండ్ల వయస్సు మధ్యలో జతకడుతుంది. దానికి నియమితమైన ఋతువు అనేది లేదు. స్వాభావికమైన ప్రోద్బలం కలిగినపుడు జతకడుతుంది. సర్కసులలో ఉండే ఆడ ఏనుగులు ఇరవై రెండు నెలలు గర్భం ధరిస్తున్నట్లు - యీ నడుమ జరిపిన పరిశీలనల వలన తెలుస్తున్నది. దీన్నిబట్టి ఏనుగులు ఇరవై రెండు నెలలు గర్భం ధరిస్తాయని నిశ్చయింప బడినది. కాని, పది నెలలు అయేదాకా, తాను గర్భం ధరించినట్లు ఆ యేనుగుకే తెలియదు. తెలిసిన తర్వాత అది ఆ మీద మగ ఏనుగును దూరంగా ఉంచుతుంది, కాని ఒక పిడి ఏనుగుతో స్నేహంచేసి, దానిని చెలికత్తెగా గ్రహించి, దానితోనే ఉంటుంది. ఒకప్పుడయినా దానిని విడిచిపెట్టదు. ఎప్పుడూ ఆ రెండూ కలిసే మేస్తూఉంటాయి. వాటిని వేరుచెయ్యడం సాధ్యంకాదు. వేరు చెయ్యడానికి యత్నించడం పాపం కూడాను. ఇటువంటి సందర్భాలలో అవి ఒకదానికి ఇంకొకటి సహాయపడుతూ ఉంటాయి. ఏనుగు పిల్లను కనిన యెడల, ఆ పిల్లను కాపాడడానికి ఇద్దరు తల్లులు కావాలి. లేకపోతే పులులు ఆ పిల్లలను తినివేస్తాయి. ఏనుగులు ఇంత జాగ్రతగా ఉన్నాకూడా, పుట్టిన పిల్లలలో నూటికి ఇరవై అయిదింటిని పులులు తినివేస్తూనే వుంటాయి.

బిడ్డ పుట్టిన తర్వాత తల్లియేనుగూ, దాని చెలికత్తె అయిన ఏనుగూ ఆ పిల్లను తమ రెండిటి మధ్యా ఉంచుకొని కాపాడుతాయి. అవి మేత మేసేటప్పుడు కూడా ఆ పిల్లను విడవవు.

ఏనుగు పిల్లను చంపదలచిన పెద్దపులి పెద్ద ఏనుగులను రెండిం టినీ దూరంగా తరుమగొట్ట వలసి వుంటుంది. అందుకోసం అది మొదట వెనుక పాటున తల్లి ఏనుగు మీద పడి, దానిని బెదరగొట్టి తరిమివేస్తుంది. తర్వాత వెనకకు వచ్చి పెంపుడు తల్లిగా వ్యవహ రిస్తున్న ఏనుగును బెదరగొట్టి తరిమివెయ్యడానికి యత్నిస్తుంది. తల్లి యేనుగు కొద్ది సేపటిలో తిరిగి రాగలదనే ధైర్యంతో దాది ఏనుగు బెదరక ఆ పిల్లయేనుగును విడవకుండా ఉంటుంది. ఇంతలో తల్లి యేనుగున్నూ వస్తుంది. అప్పుడు పులి నిరాశతో వెళ్లిపోతుంది. తల్లి యేనుగుకూ, దాని చెలికత్తెకూ పెద్ద పులి దెబ్బలవల్ల కలిగిన గాయా లకు నేను చాలా సార్లు చికిత్స చెయ్యడం జరిగింది.

నిర్బంధంలో ఉన్న తల్లియేనుగు, మనుష్యులవల్ల తన పిల్లకు అపాయం కలుగుతుందేమో అని కొంచెమైనా సందేహించదు. ఒక్క సారి మాత్రం ఒక తల్లియేనుగు నన్ను ఎదిరించడం సంభవించినది. బిడ్డను కన్న తర్వాత తల్లిని అభినందిస్తూ దాని తొండాన్ని మెల్లగా తట్టినాను. నేను ఆ పిల్లయేనుగును కూడా మెల్లగా తట్టినాను. అది తన చిన్న కళ్ళతో నన్ను చూడనన్నా చూడలేక దబ్బున నా మోకా ళ్లపై గట్టిగా కొట్టి ఏదో అపాయం జరుగుతున్నట్లు గట్టిగా అరచింది. ఆ అరపుతో - నేను వెనుకకు దుముకువేసి, తల్లియేనుగు తొండం దెబ్బను తప్పించుకున్నాను. కొన్ని అంగుళాలలో తప్పిపోయినది కాని, లేకపోతే నేను ఆ దెబ్బకు చచ్చిపోయి వుందును. ఆ యేనుగు నన్ను ఇరువై గజాల దూరం వెంట తరిమి తర్వాత తన పిల్లవద్దకు వెనక్కు వెళ్లిపోయింది.

కొత్తగా పుట్టిన పిల్ల ఏనుగు తల్లి పొదుగు అందకపోతే నేను ఒకప్పుడు దాన్ని పట్టుకొని ఎత్తైనచోట ఉంచి పొదుగుకు అందించాను. నేను తమాషాకు ఇలా చేశాననే భావం ఆ తల్లి సూచించినది.

మూడు నాలుగేళ్ళ వయస్సు వచ్చేదాకా పిల్లయేనుగు తల్లి కాలి మడమల దగ్గరే తిరుగుతూ ఉంటుంది. అంత కాలమూ అది తల్లి పాలు తాగుతూ జీవిస్తుంది. ఇది ఎప్పుడూ తల్లి కాళ్ల సందుల్లోనే తిరుగుతూ వుండడంవల్ల దానికి పై ప్రాణులవల్ల ఎట్టి అపాయమూ కలగడానికి అవకాశము ఉండదు.

పుట్టినప్పుడు ఏనుగుపిల్ల తొండం ఉపయోగరహితమైన అంగంగానే వుంటుంది. అది ఒక ప్రక్కగా పెరుగుతూ, పిల్లయేనుగు తల్లి పాలు సులభంగా నోటితో తాగ్రిగటానికి అవకాశం కలుగజేస్తుంది. మూడు నాలుగు నెలల ప్రాయం వచ్చేవరకూ దాని తొండం వంచడానికి వీలులేకుండా కొయ్యబారి వుంటుంది. ఆ తర్వాతనే దాని ఉపయోగం ప్రారంభమవుతుంది. దానిని వంచడానికి వీలుపడుతుంది.

ఐదారేండ్ల వయస్సు వచ్చేసరికి ఏనుగుపిల్లకు తన ఆహారాన్ని తాను సంపాదించుకోవడం తెలుస్తుంది. అప్పుడు అది తల్లి పాలు విడిచిపెడుతుంది.

పిడి యేనుగు తన జీవితకాలంలో సామాన్యంగా నాలుగు పిల్లలను పెడుతుంది. ఒక్కొక్కపుడు కవల పిల్లలు కలగడమూ ఉంటుంది. ఎడపిల్ల, కడపిల్ల-రెండూ తల్లిని వెంబడించి తిరగడం సాధారణంగా కానవస్తుంది. నాల్గిటికంటె ఎక్కువ పిల్లలుకూడా ఉండవచ్చు.

తల్లి పాలు విడిచాక ఏనుగు పిల్లకు మొరటుతనం కలుగుతుంది. మన బాలబాలికల్లు స్వాతంత్ర్యాన్ని కోరేరీతిని అవి కూడా కొంత స్వేచ్ఛను అభిలషించినందువల్ల కొంత క్రూరస్వభావమూ ఏర్పడుతుంది.

బలవంతులు తమ సాహసపరాక్రమాలను వెల్లడించుతూ బుజాలు చరచుకొనే స్థితి, ఏనుగు పిల్లలకు పదిహేను, పదహారేండ్ల వయస్సులో కలుగుతుంది. ఆ నవయౌవనదశలో తమకు ఏమి కావలసి వున్నదీ తెలిసికొనే శక్తి వాటికి వుండదు. కొన్ని శీఘ్రంగానే ఆ విషయాన్ని గ్రహిస్తాయి. కొన్ని గ్రహించలేవు. వాటి స్వభావం వేర్వేరు విధాలుగా ఉంటుంది.

పదహారునుంచి ఇరవై యేళ్ళ వయస్సువరకూ వున్న మగ ఏనుగు ఆడ ఏనుగుతో సరసమాడుతూ వుంటుంది; ఒకప్పుడు ఎక్కువ సాహసాన్ని ప్రదర్శిస్తుంది. కాని, సాధారణమైన ఏనుగు ఇరవై యేండ్ల ప్రాయం వచ్చేవరకూ ఎట్టి మదోద్రేకాన్నీ వ్యక్తం చెయ్యదు. ఆ ఉద్రేకంలో లేనపుడే అది జతకడుతుంది. మదించి వున్నపుడు అనాగరకమైన కామోద్రేకమూ, కలహప్రకృతీ వెల్లడి అవుతూఉంటవి.

ఇరవై నుంచి ముప్ఫయి అయిదేళ్ళవయస్సు వరకూ ఏనుగుకు-కన్నుల సమీపంలో ఉండే ఒక రకమైన మాంస గ్రంథుల నుంచి మదజలం స్రవిస్తూవుంటుంది. ప్రతి సంవత్సరమూ ఎండాకాలంలో రెండు వారాలపాటు—ఏనుగులు జతకట్టే సమయంలో మగ ఏనుగుకు ఆ మాంసగ్రంథుల నుంచి మదజలం కారుతూ వుంటుంది. ఆ సమయంలో ఏనుగు మిక్కిలి ఉద్రేకాన్ని పొందుతుంది.

ముప్ఫయి అయిదేండ్లనుంచి నలభై అయిదేళ్ళ వరకూ మదజలస్రావం వృద్ధి పొందుతూ వుంటుంది. అది బొట్లు బొట్లుగా ఏనుగునోట్లో పడుతుంది. దాని యొక్కరుచి ఏనుగుకు ఉద్రేకాన్ని కలిగించడమే కాకుండా, దాని స్వభావాన్ని మిక్కిలి క్రూరంగా మారుస్తుంది. ఆ వయస్సులో అది గొప్ప బలం కలిగి ఉంటుంది. అది

మదోద్రిక్తమై ఉన్న సమయంలో దానిని ఏ మహావృక్షానికయినా దృఢంగా కట్టివెయ్యవలెను. లేకపోతే అది తన మావటివానికే కాకుండా మిగిలిన ఏనుగులకు కూడా అపాయాన్ని కలిగించగలదు. అప్పుడు దానికి ఏదీ సంతృప్తిని కలిగించలేదు. అది పిచ్చియెత్తిన దానివలె కానవస్తుంది.

నలభై అయిదేండ్ల నుంచి ఏభయి ఏళ్లవయస్సులో ఏనుగు మదం క్రమ క్రమంగా తగ్గుతూ - చివరకు నశిస్తుంది. ముప్ఫయి అయిదు, నలభై అయిదు ఏండ్ల మధ్య, మంచి వయస్సులో - మదోద్రేకంతో ఉన్నప్పుడు తొమ్మండుగురు మనుష్యులను చంపిన ఏనుగులు కూడా కలవు. అయినా, తర్వాతి వయస్సులో కొంత మదం ఉన్నప్పటికీ అవి విధేయంగా ఉంటాయి. కాని, ఏనుగుకు అరవైయేళ్ల వయస్సు వచ్చేదాకా - దానివల్ల అపాయం కలగదని నమ్మలేము.

పూజాన్ ఒక గొప్ప యేనుగు. సామాన్యంగా అది స్నేహ పాత్రమైనదే; నేను దాని దంతములక్రిందనుంచీ, తల క్రిందనుంచీ నిర్భయంగా నడిచి వెళ్లేవాడను. అది టాంగ్ డ్విన్ అటవీప్రాంతంలో వున్నపుడు మదించి, గొప్పఉద్రేకం పొందినది. అది ఆ ఉద్రేకంలో తన మావటివానినే కాకుండా మరొక మనిషినీ, రెండు ఆడు ఏనుగులనూ చంపివేసినది. ఎవరైనా మనుష్యులు దాని దృష్టిపథంలో పడితే, వారిపైని అది తిరగబడేది. అది గ్రామాల్లో ప్రవేశించి ధాన్యపు కొట్లను ధ్వంసం చేసేది. దానిపేరు చెప్పితే ఆప్రాంతంలోని వారంతా గడగడ లాడేవారు. దాన్ని పట్టుకొని తీసుకువచ్చిన వారికి మూడు వందల రూపాయల బహుమానం యిస్తానని ప్రకటించాను. దాన్ని పట్టుకోవడం సాధ్యం కాకపోతే చంపివెయ్యాలని కూడా చివరకు నిశ్చయించాను.

అది పది గ్రామాలకు నిలయమైన సైయావా కనుమలోని దట్టమైన వెదురు అడవిలో తిరుగసాగినది. నేను కొద్దిసామానులు మోస్తున్న నాలుగు ఏనుగులతోనూ, నా తుపాకులు పట్టుకునే 'క్యా - సైన్' అనే పిల్లవానితోనూ అక్కడికి బయలు దేరాను. పూబాన్‌ను పట్టుకోడానికి వెళ్లేముందు, సాయంకాలమే నేను నాబోడు గుళ్ల బారును పరీక్షించి చూచుకొన్నాను. అందులో తుపాకి మందును పూర్తిగా కాకుండా సగం వరకే ధట్టించాను. ఎక్కువ కఠినంకాని అగ్రభాగం గల తూటాను ఎడమవైపు గొట్టంలో బిగించి, కుడి నాళంలో మామూలుగా కఠినాగ్రం గల తూటానే బిగించాను, ఆ ఏనుగును చంపాలనే అభిప్రాయం నాకు లేదు. దాని ముందు కాళ్లలో ఒక దానికి గాయంకలిగించి, పూబాన్‌ను స్వాధీనం చేసుకుని దానిని కుదట పరచి, తర్వాత ఆ గాయాన్ని మాన్పాలని నా ఆశయం. నూరు గజాల దూరంలో వున్నా గురిచేసి, లక్ష్యాన్ని కొట్ట గలననే ధైర్యం నాకు ఉన్నది.

నేనీవిధంగా అనుకున్నాను కాని క్యాసైన్ నన్ను బ్రతిమాలుకు న్నాడు-ఆ ఏనుగును గుండుతో కొట్టిస్వాధీనం చేసుకోవద్దని. తాను స్వయంగా వెళ్లి దానిని లొంగదీసుకుని తీసుకువచ్చి, మూడువందల రూపాయల బహుమతీ పొందాలనే ఆశ అతనికి ఎంతో ఉన్నది. దాని అలవాట్లను గూర్చి, వినయ విధేయతలను గూర్చి తనకు బాగా తెలుసుననీ, ధైర్యంతో దాని ఎదటికి పోయి, లొంగదీసి, తీసుకు రాగలననీ, అందుకు అనుమతి ఇవ్వవలసినదనీ వేడుకొన్నాడు. దుర దృష్టవశాత్తూ అతనికి అనుమతిని ఇవ్వడం జరిగింది. తెల్లవారకుండానే క్యా - సైన్ వెళ్లిపోయినాడు. నేను మరునాడు పగలు మూడు గంటల వేళకు అక్కడికి వచ్చాను. పూబాన్, ఆ కుర్రవానిని చంపి వేసినదనే ఘోరవార్త తెలిసింది!

ఆరాత్రి నాకు నిద్రలేదు. ఇది వరకు వరిపొలంగా వుండిన సమ తలంలో పడక వేసుకున్నాను. వెన్నెల బాగా కాస్తున్నది. నేను పడుకోవడానికి ముందే - ఫూబాన్‌ను పట్టుకోవడానికి మరునాడు ఏమి చేయవలసినదీ నిశ్చయించుకున్నాను. ఏ విధంగా అయినా దానిని తిరిగి పట్టుకోవాలనే నాసంకల్పం! నాప్రీతిపాత్రుడైన క్యా - సైన్‌ను చంపినందున, దానిమీద పగతీర్చుకోవాలనే అభిప్రాయంలేదు. ఆ అడవిలో వుండే సమస్తమును గురించీ తెలిసినవాడిని - వేరొకనిని నేనెరుగను. అతడు అన్నిటినీ ప్రేమించేవాడు. ఈ యేనుగుపై నేను కసి తీర్చుకుంటే, అతని మనస్సు క్షోభపడుతుంది! నాకు కొంచెం నిద్ర పట్టింది. ఇంతలో 'క్లాంక్, క్లాంక్, క్లాంక్' అనే ధ్వని వినబడి తెలివి వచ్చింది. అదృష్టవశాత్తూ, ఫూబాన్ ముందు కాలికి కట్టబడిన గొలుసు సగం తెగి దాని కాలినే ఉన్నది. కలలోంచి మెలకువ వచ్చినట్లు ఆ విషయం అప్పుడు నాకు స్ఫురణకు వచ్చినది! ఒక్క గంతువేసి నేను లేచి నిదానించి ఆ వైపుచూచాను. రెండు వందల గజాల దూరంలో ఫూబాన్ కానవచ్చింది. అది, తన్ను ఎదిరించేవారు ఎవ్వరూ లేరనే ధీమాతో ప్రపంచాన్నంతటినీ తృణీకరిస్తున్నట్లు నిలిచివున్నది. నేను రెప్పవెయ్యకుండా దాన్ని చూడసాగాను. అది 'క్లాంక్, క్లాంక్ క్లాంక్'అని కాలి గొలుసును చప్పుడు చేస్తూ మళ్లీ ఎక్కడికో వెళ్లిపోయింది. ఆ చప్పుడు మరి వినబడలేదు.

మర్నాడు ఉదయాన్నే నేను నిర్ణయించిన పద్ధతి ప్రకారం చెయ్యదలచుకున్నాను. మొదట అది ఎక్కడ వున్నదీ తెలుసుకుని, నేను ఒక సురక్షితస్థలంలో ఉన్నాను. నాలుగు తుపాకులతో కూడా ఇరవైమంది బర్మీయులను, ఫూబాన్‌ను నేను ఉండేవైపు తరుముకొని రావడానికి పంపాను.

పూబాన్ వాళ్లను నాలుగుసార్లు ఎదిరించింది. నాకు తుపాకీ ధ్వనులు వినబడ్డాయి. చివరకు అది మనస్సు మార్చుకుని నేను ఉన్న వైపు రాసాగింది. నేను ఆరడుగుల ఎత్తుగా ఉండి, పాడుపడిన ఒక దేవాలయం మీద కూర్చున్నాను. నా వెనుక పటోలోన్ (Patolone) నది యొక్క గట్టు - నూరడుగుల ఎత్తయినది ఉన్నది. నా ముందు భాగంలో వరిచేను కోసిన ఖాళీపొలాలు ఉన్నవి. వాటిమీదుగా ఆ ఏనుగు వస్తుందని నాభావన. దాని కాలికి తుపాకి దెబ్బతో గాయం కలిగించి, దాన్ని లొంగతీసుకుని, తర్వాత ఆ గాయం మాన్పాలని ఇప్పటికీ నా సంకల్పం !

పూబాన్ తల పైకి ఎత్తుకుని ఆ అడవిలోంచి వచ్చినది; అది ఒక్కసారి నిలిచి, తర్వాత అడ్డుదారిని పొలాలలోంచి రాసాగినది. నేను మోకాలిపై కూర్చుండి గురిచూచి దాని కాళ్లకు దెబ్బతగిలేటట్లు తుపాకి ప్రేల్చాను. కాని గురి తప్పింది. దాని ముందు కాలి పాదమునకు దట్టముగా అంటుకొన్న దుమ్ముకు మాత్రం గుండు తగిలింది. ఆ యేనుగు దూరంగా అంగలు వేస్తూ ఆ గుండును విదల్చుకొన్నది.

పూబాన్ నిలిచి, నన్ను ఎదుర్కొడానికో, నా తుపాకీని ఎదుర్కొడానికో గిర్రున తిరిగింది. తన తొండాన్ని మడిచి నోటిలో ఉంచుకుని ఎదిరించడానికి సిద్ధమైనది. అప్పటి దాని వైఖరి ఎప్పుడూ మరపునకు రాదు. అప్పుడు నాకు తుపాకిలో తూటా బిగించడానికైనా అవకాశం లేదు. అందువల్ల కుడినాళం మీదనే నేను ఆధారపడ వలసి వచ్చినది. ఆ గుండు దెబ్బతో అది చచ్చిపోతుందని తెలుసు. కాని నాకు మార్గాంతరం లేకపోయింది; ఇరవైఅయిదు గజాల దూరంలో అది వుండగా నేను తుపాకి ప్రేల్చాను. పూబాన్ అయిదు గజాల ముందుకు వచ్చి పడిపోయింది. దాని తల నేలపై వాలిపోయింది.

దంతాలు నేలలోకి తొమ్మిది అంగుళాల వరకూ చొచ్చుకుపోయాయి! కొన్ని సెకెండుల కాలం అది సంబాళించు కొన్నది. కాని వెంటనే పొర్లి పడి ప్రాణం విడిచింది.

నాకు ఎంతో దిగులు కలిగింది. తుపాకీని క్రింద పడవేసి మిక్కిలి విచారించాను. నేను, పూబాన్ బ్రతికి ఉండగా పట్టుకోలేక పోయాను: నన్ను విచారించే అధికారి లేడు! జరిగిన దానిని పై అధికారులకు తెలుపగా, వారు ఆ ఏనుగుయొక్క రెండు దంతాలనూ నాకు జ్ఞాపకార్థంగా బహూకరించారు. కాని, అవి రెండు విధాలుగా నా అసమర్థతకు చిహ్నాలని నా భావన. మొదటిది - దానిని నేను బ్రతికివుండగా పట్టుకోలేక పోయాను. రెండవది - ఉత్తమమై, గొప్ప సాహసం గల ఆ జంతువును బ్రతుకనియ్యక, దాని ప్రాణం తీశాను!

౬

ఖెడ్డాచేసి ఏనుగులను పట్టుకొన్న తర్వాత వాటి శక్తిని క్రుంగదీసి, తర్ఫీతు చెయ్యడానికి ఎంతో కాఠిన్యం వహించవలసి ఉన్నది. సాధారణంగా పదిహేను, ఇరవై యేళ్ల వయస్సు మధ్యనే అడవి యేనుగును పట్టుకోవాలి. అప్పుడే అది బాగుగా పని చెయ్యడానికి తగి ఉంటుంది; పని చేసి, దానికి పెట్టిన డబ్బును అది సంపాదించుకో గలదు కూడా. కాని, అట్టి వయస్సులోవున్న మగ యేనుగునుగానీ, ఆడు ఏనుగునుగానీ లొంగదీసి తర్ఫీతు చెయ్యడం శ్రమ సాధ్యమైన పని. అలా చెయ్యడానికి సాధారణంగా కొన్ని వారములు తీసుకుంటుంది. దానిని గొలుసులతో ఒక చెట్టుకు కట్టివేస్తారు. అది ఆ గొలుసును తెంపుకొని పారిపోవడానికి ఎడతెగకుండా యత్నిస్తుంది. ఆ విషయంలో దాని మెడ, చీల మండలు ఎంతో పని చేస్తాయి.

నిర్బంధంలో వున్న ఆ ఏనుగకు ఆహారాన్ని దూరంనుంచే విసిరి వేస్తారు. ఆ ఆహారం దానికి తగినదీ కాదు; సరిపోనూ సరిపోదు. అందువల్ల అది బాగా చిక్కిపోతుంది. దానికి ఆహారాన్నీ, నీటినీ అందించే బాధ్యతను దాని ఊజీగాని, అతని సహాయుడుగాని వహిస్తారు. అది వాళ్ల మీదకి తొండాన్ని త్రిప్పినపుడు వాళ్లు ఈటెలతో దాని చెంపలమీద పొడిచి, ప్రతీకారం చేస్తారు. అప్పుడు ఆ గాయాలను మాన్చడం సాధ్యంకాదు. అవి ఈగలు ముసురుతూ వ్రణాలుగా మారిపోతాయి!

చివరకు ఆ యేనుగు హృదయవిదారకంగా దుఃఖించి చాలా కృశిస్తుంది. అప్పుడది తాను నిర్బంధంలో వున్నట్లూ, ఇకమీద తన జీవితం నిర్బంధంలోనే గడవ వలసినట్లూ గ్రహిస్తుంది. అంతతో శాంతం వహించి, తన నెత్తిపై ఒక వ్యక్తి కూర్చోడానికి సమ్మతిస్తుంది. తర్వాత దాని గాయాలన్నీ మాన్పబడతాయి. ఈ రీతిగా ఏనుగును పట్టి తెచ్చి మచ్చిక చెయ్యడం కష్టమే! కాని మచ్చిక పడిన ఏనుగుకు బిడ్డ పుట్టినదంటే, ఆ పిల్ల యేనుగును తర్బీతు చెయ్యడం ఎంతో సులభం! అది పుట్టినరోజు మొదలు, ఐదేండ్లు వయస్సు వచ్చి తల్లిని విడిచి పెట్టేవరకూ - తల్లియొక్క ఊజీతో ఎంతో చనువు కలిగి ఉంటుంది. పిల్లవానివలె అది వానితో తమాషాగా ఆటలాడుతుంది. అతన్ని వెంట తరిమినట్లు నటించి తానే దూరంగా పారిపోతుంది. ఇలా ఉన్నా అది మావటివానిని నమ్మడం మాత్రం అరుదు. అతని చేతిలోంచి ఏదైనా పండుముక్కనుగాని, బియ్యాన్ని గాని తీసుకునేటప్పుడు ఎంతో బెదురుతుంది.

తన అయిదవయేట - నవంబరు నెలలో పిల్ల ఏనుగు తల్లిపాలు విడిచి పెడుతుంది. అప్పటినుంచీ అది స్వయంగా సంచరిస్తుంది. అప్పటి

నుంచే దానిని మచ్చిక చెయ్యడం జరుగుతుంది. ఒక్కొక్క మకాముల్లో ఐదారు పిల్ల ఏనుగులకు తర్బీతు చెయ్యడానికి సమర్థుడైన బర్మీయు డొకడు ఉంటాడు. ఒక్కొక్క దానికి ఇద్దరు వంతున సహాయులూ, మిగతా పనులకు మరి ఎనమండుగురూ కూడా ఉంటారు. తర్బీతు చేసే మకాము ఒక నదికి సమీపంలోని సమ ప్రదేశంలో ఉంటుంది. నూరు గజాల చదరపు నేలలో కొన్ని చెట్లనూ, తగు మాత్రం పచ్చిక నేలనూ మాత్రం ఉంచివేసి, తక్కిన దానిని సదునుచేస్తారు. దాని మధ్య 'క్రష్' లేక ముక్కోణపు ఆకారంగల ఒక సాలను కడతారు. అది అయిదేండ్ల ఏనుగు పిల్లలు పట్టడానికి తగి ఉంటుంది. మకాములో పిల్లలతోపాటు తల్లులే కాకుండా ఒక ఏనుగు 'కూంకీ' (Koonkie - ఉపాధ్యాయుడు)గా ఉంటుంది. అది సాధారణంగా దంతరహితమైన మగ ఏనుగై వుంటుంది. అది నలభై ఐదు-ఏభై యేండ్ల వయస్సు కలిగి శాంతమునకూ, విధేయతకూ పేరు పడివుంటుంది.

పిల్ల ఏనుగుల తర్బీతు ప్రారంభించడానికి కొన్ని సంప్రదాయాలున్నవి. మొదట 'నాట్'ల [Nat-వనదేవత] పూజ జరుగుతుంది. అప్పుడు ఆ ఏనుగుల సాలకు సమీపంలో ఒక పీఠం ఏర్పరచి దీపాలు వెలిగిస్తారు. తర్బీతు చెయ్యడం కోసం బర్రెతోలు సన్నగా కోసి, త్రాళ్లుగా అల్లి, అది మృదువుగానూ, వంచడానికి వీలుగానూ వుండేటట్లు క్రొవ్వు పూస్తారు. అరటి పండ్ల గెలలుంచుతారు. ఏనుగు పిల్ల సాలలో వున్నపుడు దానికి బెదురుగాని, చెరలోవున్నామనే భావం గాని కలగకుండా వుండడానికి పళ్లు యిచ్చి మనస్సుకు నెమ్మదిని కలిగిస్తారు.

ఏనుగు పిల్ల తల్లిపాలు విడిచిన దినం ఉదయాన్నే దాన్ని తల్లితోకూడా ఆ ప్రదేశానికి తీసుకువచ్చి ఆ సాలతోటి, పరిసర ప్రదే

శాలతోటీ పరిచయం కలిగిస్తారు. ఎవరైనా చేతితో అరటిపండు పట్టుకొని ముందు దారి తీస్తే, ఏ మాత్రమూ అనుమానించక కొన్ని గున్న ఏనుగులు అతని వెంట తమకై ఏర్పరచబడిన సాలలోకి పోతాయి. అవి లోపలికి రాగానే సహాయకుడు రెండు బలమైన అడ్డు కట్టెలను = అవి బయటికి రాకుండునట్లు జార విడుస్తాడు. కాని, సాధారణంగా ఈ విధంగా జరుగదు. పిల్ల యేనుగు తరచు సందేహిస్తూనే ఉంటుంది. అది బయట ఉన్నప్పుడు ఒక కాలిని స్వాధీనం చేసుకోవలెను. అందుకై పిల్లయేనుగు తిరిగే తావులలో జారుముడి వేసిన తోలు తాళ్ళను అక్కడక్కడ ఉంచుతారు. అది, తిరుగుతూ, ఆ ఉరిలో అడుగు వెయ్యగానే - ఆ సంగతి గమనించిన మనుష్యులు ఆ ముడిని బిగించి వేస్తారు. అది కొంచెం సేపు పెనుగులాడి, గట్టిగా అరిచినా - దాని తల్లి దగ్గరగా ఉన్న యెడల మెత్తపడి లొంగుతుంది. తర్వాత దాన్ని మెల్లమెల్లగా సాలలోకి నెట్టుకొని వస్తారు. మొండి పట్టు పట్టిన పిల్ల యేనుగులను స్వాధీనం చేసుకోడానికి కూంకీ (గురువుగా వ్యవహరించే ఏనుగు) సాయపడుతుంది. అది తన తలతో పిల్ల యేనుగు వెనుక భాగాన్ని తోస్తూ, దాన్ని బంధనస్థానానికి తీసుకు వస్తుంది. ఇంత రభసా జరుగుతూ ఉన్నా, ప్రక్కనేవున్న దాని తల్లి ఏమీ చెయ్యక చూస్తూనే ఉంటుంది. తల్లి యేనుగును బంధించకుండా ఉన్నప్పుడే అది ఊరక ఉంటుంది; అలాకాక, దాన్ని బంధిస్తేమాత్రం అది తన గొలుసులు తెంచుకొని, తన బిడ్డను కాపాడడానికి ప్రయత్నించి తీరుతుంది.

పిల్లయేనుగు సాలలో ప్రవేశించగా, కాలిత్రాడు విప్పకుండానే దానిని గొలుసులతో త్రిభుజకార బంధానికి కట్టివేస్తారు. వెంటనే దానికి పళ్లూ అవీ లంచం ఇవ్వడానికి ప్రారంభిస్తారు. కాని, అది అక్కడినుంచి తప్పించుకోవడానికీ, కట్లు తెంపడానికి రెండు గంటల

సేపు బాధపడుతుంది. చివరకు ఎంతో చికాకు పడి, విధిలేక మావటి వాడిచ్చిన అరటిపండు తీసుకుంటుంది.

పిల్ల యేనుగును యీ విధంగా మోసగించి, స్వాధీనం చేసుకున్న తర్వాత, దాని తలపైని కొన్ని అడుగుల ఎత్తున - దానికి కాబోయే మావటి వాడు కప్పీని ఆధారం చేసుకుని ఉంటాడు. ఆ సాలకు చెరియొక ప్రక్కనూ ఇద్దరు మనుష్యులు ఆ కప్పీని స్వాధీనంలో ఉంచుకుంటారు. ఆ ఊజీ చేసిన సైగ చూచుకుని, వారు మెల్లగా అతనిని ఏనుగు తలమీదికి దింపుతారు.

పిల్ల యేనుగు "ఛీ, లేచిపో" అనే అర్థం ఇచ్చేటట్టు గట్టిగా అరుస్తుంది. వెంటనే ప్రక్కనున్న వారు ఊజీని మీదికి లేవనెత్తుతారు. తర్వాత దానికి ఒక అరటిపండు ఇచ్చి, శాంత పరిచి, మళ్లీ ఊజీని కిందికి దించుతారు. ఏనుగు చికాకు పడగా వానిని లేవనెత్తి మరొక అరటి పండిచ్చి దానిని శాంత పరిచి, మళ్లీ ఊజీని కిందికి దింపుతారు. ఇలాగున చాలాసార్లు జరిగిన తర్వాత విసుగెత్తి ఏనుగు 'సరేలే; ఏంజేస్తాము? నా నెత్తిపైకి ఎక్కి కూర్చోవాలని వుంటే కూర్చో' అనే అభిప్రాయం వ్యక్తం చేస్తుంది.

తర్వాత, కప్పీకి కట్టి ఏనుగు నడుముపైకి సమంగా ఉండేటట్లు చూచి ఒక దుక్కను దింపుతారు. అప్పుడు కూడా అది తప్పించుకోవడానికి విశ్వప్రయత్నం చేసి, చాలా చికాకు పడుతుంది. కొంత సేపు దానికి ఆహారం ఇచ్చి బుజ్జగించిన తర్వాత విధిలేక ఆ పిల్ల యేనుగు దానిని మొయ్యడానికి సమ్మతిస్తుంది.

అది ముందుకాళ్లమీద నించుని వెనకకాళ్ళు ముడుచుకొనగా, అక్కడివారు 'టా' (లే) అని దాన్ని లేచేటట్లుచేసి, బరువైన దుక్కను

దాని వీపుమీద మోపి, 'హ్మిట్' (కూచో) అని కూర్చోపెడతారు. ఇలా కొంత సేపు జరుగుతుంది.

తర్వాత కొంత సేపటికి - కప్పీని విడవకుండానే ఊజీసుఖంగా దాని తలపైని కూర్చుంటాడు! ఆ యేనుగు మొండిది కాకపోతే - ఆ సాయంకాలానికి ఉజీ దానిమీద కుదురుగా కూర్చోగలడు.

ఈ విధంగా జరగడం సాధ్యమైనప్పుడు అది లొంగినదని చెప్ప వచ్చును. ఇలాగున పిల్ల యేనుగు లొంగడానికి రమారమి పన్నెండు గంటల కాలం పడుతుంది. మొండి ఏనుగులను లొంగదీసుకోవడానికి వెదురు కాగడాలు పట్టుకొని రాత్రికూడా ప్రయత్నించవలసి వుంటుంది. ఒక్కొక్కపుడు తెల్లవారే వరకూ యత్నిస్తేనేగాని అది లొంగడం సంభవించదు. ఏమైతేనేం? బర్మావారు అట్టి ఏనుగులకన్నా ఎక్కువ మొండివారు. తమ ప్రయత్నం ఫలించే దాకా పట్టిన పట్టు విడవరు. దీని వల్ల మానవశక్తి గజశక్తికంటే కూడా బలీయమైనదనీ, మానవుడు ఎంతకాలం పట్టినా సరే, తన పూనికను నెగ్గించుకుంటాడనీ వ్యక్తమవుతున్నది.

మరునాడు ఉదయం పిల్ల యేనుగును బయటికి తీసుకువెళ్తారు. అది, దాని కాలికి బిగింపబడిన తోలు త్రాళ్ళతోనే కుంటుకుంటూ పోతుంది. దాన్ని అక్కడ ఇరవై నాలుగు గంటల సేపు ఒక చెట్టుకు కట్టి ఉంచి వేస్తారు. అక్కడ ఉన్నంత సేపూ దానికి కాబోయే మావటీడు దాన్ని లాలించడమో, హింసించడమో చేస్తూ లొంగ దీసుకోవడానికి యత్నిస్తాడు. అతడు దానిని కూర్చునేటట్లుచేసి, దాని తలపైకి ఎక్కి, పది నిమిషాలపాటు కూర్చుని, మళ్ళీ దిగిపోతాడు. ఒక్కొక్కప్పుడు ఐదు నుంచి పది నిమిషాల వరకూ దాన్ని కూర్చో పెట్టే ఉంచుతాడు. దాన్ని లొంగదీసుకోవడానికి ఎంతో నిదానమూ,

శాంతమూ అవసరం. ఊజీ, కొంచెమైనా దానిఆటలను సాగనియ్యడు. ఈ లోపున తల్లి యేనుగును దూరంగా తీసుకుని పోతారు. పిల్లను విడిచిపెట్టి పోయిన ఆ తల్లి రెండు రాత్రులు ఆ బిడ్డకోసం అరుస్తుంది. ఇలా అరవడం మామూలు! అంతేకాని, పిల్లయేనుగు తనతోచే వుండాలనే కోరిక తల్లికి వుండదు. పిల్లకు ఆరేళ్ళు వచ్చేసరికి తల్లికి ఆ అభిలాష క్షీణిస్తుంది. తన పిల్ల ఎలావుందో అనే ఆతురత మాత్రం వుంటుంది.

తర్వాత పిల్ల యేనుగును షికారుకు తీసుకు వెళ్ళడం జరుగుతుంది. అప్పుడు అది కూంకీ ప్రక్కనే నడిచి వెళుతుంది. తోలు త్రాళ్లు వీటి మూపులనుంచి కడుపును చుట్టి వచ్చేటట్టు బిగించి, ఆ రెండిటి తాళ్ళకూ ముడి వేస్తారు. అందువల్ల పిల్ల యేనుగు తప్పించుకొని పారిపోలేదు. అది నిలిచి పోయినా, కూలబడినా, యీడిగిలబడినా, కూంకీ గట్టిగా ఒక పోటు పొడిచి దాన్ని దారికి తెస్తుంది. ఒక్కొక్కప్పుడు తొండముతో కొట్టడమున్నూ జరుగుతుంది.

ఒకానొకప్పుడు నా మకాములో పందొమ్మిది పిల్ల ఏనుగులు ఉండేవి. వాటిని చూడడానికి ఎంతో ముచ్చటగా ఉండేది. వాటి స్వభావం విభిన్నంగా వుండేది. దాన్ని బట్టే వాటికి వేర్వేరు పేర్లూ వుండినవి. వాటికి పేర్లు పెట్టే హక్కు తర్బీతు చేసేవాడిదే! పేర్లు పెట్టడానికి ముందు రాత్రి సమయాల్లో అతడూ, వాటి వాటి మావటీలూ ఆ విషయమై చర్చించుకుంటారు! తరుచుగా - తర్బీతు చేసేటప్పుడు జరిగే సంఘటనను బట్టి పేరు సూచించబడుతుంది. అలాటి సంఘటన ఒకటి నాకు బాగా జ్ఞాపకం ఉంది.

పిల్ల యేనుగును సాలనుంచి బయటికి తెచ్చిన మూడవ రాత్రి జరిగిన సంఘటన అది! పిల్ల యేనుగు మావటివాని బసకు కొంత

దూరంగా చెట్టుకు కట్టబడి ఉన్నది. అప్పుడొక పెద్దపులి వెనకనుంచి దాని మీదికి ఉరికినది. పిల్ల యేనుగు ఆ పులిని వెనక్కు తోసివేసి దానిని ఎదిరిస్తూ ఇరవై నిమిషాల సేపు ఆత్మరక్షణ చేసుకుంది. ఇంతలో వెదురు కర్రల దీపాలతో మకాం నుంచి మనుష్యులు వచ్చి పులిని తరిమి వేశారు. ప్రతాపశాలి అయిన ఆ పిల్ల యేనుగుకు మర్నాడు 'చ్యార్మనైన్' (Kyam Nine) అనే పేరు పెట్టబడింది. 'పులికి జయింప శక్యం కానిది' అని దాని అర్థం. ఈ పేరు ఎంతో చక్కగా అమరింది. అది గుర్రానికి పెట్టిన 'బ్లాక్ బ్యూటీ' అనే పేరు వంటిది.

పిల్ల ఏనుగుకు పెట్టిన పేరు దాని జీవితం ఉన్నంత వరకూ ఉండవలసినదే! కుక్కకు దాని పేరు తెలిసినట్లు, పిల్ల యేనుగుకు దాని పేరు తెలియదు. ఏమంటే - ఊజీలు ఏనుగులను వాటి పేర్లు పెట్టి పిలవరు. వాటిని గురించి యితరులు మాటలాడుకోవడానికి మాత్రమే ఏనుగుల పేర్లు ఉపయోగపడతవి.

పిల్ల యేనుగు పెద్దదై పందొమ్మిదేళ్ళ వయస్సుది అయ్యే వరకూ తర్బీతులో వుంటుంది.

ఎనిమిదేళ్ళ వయస్సు వచ్చేసరికి అవి, ఐరోపీయుడైన అధికారి చేసే అడవి ప్రయాణాల్లో అతని వెంట సామానులు మోస్తూ తిరుగుతాయి. ఆ విధంగానే అవి వంట పాత్రలూ, పడక వస్తువులూ మొదలైన సామానులు మోస్తూ కొండలు ఎక్కడానికీ, నదుల్లో దిగి ప్రయాణం చెయ్యడానికీ అలవాటు పడతాయి. బసలలో ఉన్నప్పుడు అవి ఊరికే ఉండక ఉపయోగకరాలైన కొత్త పనులను కొన్నిటిని నేర్చుకుంటాయి. వంట చెరకుగా ఉపయోగించడానికి చెట్టుకొమ్మలను తొండాలతో పట్టుకుని మకాము చేరుస్తాయి. తమ గొలుసు వెదురు

పొదలో చిక్కుపడితే నేర్పుతో విడిపించు కొంటాయి. ఈ విధంగా చిల్లర పనులు చేస్తూ, తిరుగుతూ పందొమ్మిదేళ్ళ వయస్సు వచ్చాక పనిచేసే ఏనుగులతో కలిసి కలపను ఈడ్చుకొని పోయే పనిని ప్రారంభిస్తాయి.

తర్ఫీతు ప్రారంభమైన తొలి సంవత్సరాలలో పిల్ల యేనుగు తన కయ్యే ఖర్చునూ, తన మావటివాని జీతం సొమ్మునూ సంపాదించ లేదు. కాని, ఆ సమయంలో నేర్చుకోవలసిన వన్నీ నేర్చుకుంటుంది. పందొమ్మిదేళ్ళు నిండేటప్పటికి బరువైన పనులు చెయ్యడానికి తగిన శక్తి సామర్థ్యాలు దానికి కలుగుతాయి.

పందొమ్మిది, ఇరవై యేళ్ళు వచ్చే సరికి దానికి అయిన మొత్తం వెయ్యి పౌనులు. దాని పోషణకైన ఖర్చు, తర్ఫీతు ఖర్చు, ఊజీకిచ్చే జీతము - కలపగా ఇంత మొత్తం అవ్వుతుంది. ఒక వేళ పిల్ల యేనుగు బియ్యపు వర్తకానికి ఉపయోగించినా - ఎక్కువ సంపాదించ లేదు. చిన్న వయస్సులో - దాని సంపాదనను ఎక్కువ చెయ్యాలని భావించడం - ప్రయత్నించడం మంచి పద్ధతి కాదు. చిన్న వయస్సులో ఎక్కువ బరువులు దానిపైని వేసి బాధపెడితే దాని భవిష్యత్తు యావత్తునకూ హాని కలగక మానదు.

మొత్తంపైని యేనుగు, దాని ఇరవై య్యోయేడు మొదలు కొని, పభై అయిదేళ్ళ వయస్సు వరకూ బాగుగా పని చెయ్యగలదు. ఈ ముప్పయి అయిదేళ్ళకూ - అన్ని ఖర్చులూ కలిపి ఏనుగుకు మరి పదిహేను వందల పౌనులు ఖర్చు అవుతుంది.

ఏనుగులు సంవత్సరంలో తొమ్మిది నెలలు పనిచేసి మూడు నెలలు విశ్రాంతి తీసుకొంటాయి. దేహపరిస్థితిని బట్టీ, కాలపరిస్థితిని బట్టీ కూడా

దానికి విశ్రాంతి అవసరమే! జూను మొదలుకొని ఫిబ్రవరి చివరివరకూ పనిచేసే నెలలు. మార్చి, ఏప్రిల్, మే నెలలు మూడూ ఎండాకాలం కావడం వల్ల ఏనుగులు అప్పుడు పని చెయ్యలేవు. ఆ కాలంలో వాటికి తినడానికి తిండీ, తాగడానికి నీరూ దొరకడమే కష్టం!

నెలలో పద్దెనిమిదిరోజులే అవి పనిచేస్తాయి. తక్కిన పన్నెండూ సెలవు రోజులు. రోజుకు ఎనిమిది గంటల విధంగా మూడు రోజులు పని చేసి, తర్వాత రెండు రోజులు విశ్రాంతి స్వీకరిస్తాయి. ఈ విధంగా ఏడాదికి 162 రోజులు - ఇంచు మించు 1,300 గంటలు అవి పని చేస్తాయి. నూరు టన్నుల కలపను కొండలనుంచి ప్రవాహ తీరానికి చేరుస్తాయి. అవి యిలా కష్టపడితేనే తప్ప టేకు కలప మిల్లులకు చేరడం సాధ్యం కాదు.

## 3

ఇరవై అయిదేండ్ల వయస్సు వచ్చేటప్పటికి బాగుగా తర్ఫీతు పొందిన ఏనుగు— ఆజ్ఞలకు సంబంధించిన— ఇరవై నాలుగు పదాలను అర్థం చేసుకుంటుంది. మావటీని సంజ్ఞలను గ్రహిస్తుంది; అడిగినప్పుడు ఐదు వస్తువులను నేలమీదనుంచి తీసి అందిస్తుంది. అంటే— 'డా' ను (కత్తిని), 'కూన్'ను (గొడ్డలిని), కాలిలంకెను, గొలుసును, కర్రను - తొండంతో తీసి ఊజీకి అందిస్తుంది. ఒకసారి, ఒక యేనుగు కిందపడిన వేణువునూ, కాలుతున్నపొడుగాటి చుట్టనూకూడా అందించడం చూచాను.

అది ఏదైనా దుక్కకు కట్టిన గొలుసును గట్టిగా బిగించనూ గలదు; వదులు చెయ్యనూ గలదు. మనం చేతులతో చేసినట్లే అది

తొండంతో ఆ పనులను చేస్తుంది. అది తక్కిన జంతువులవలె యంత్రం మాదిరిగా కాకుండా గ్రహించి పనిచేస్తుంది. ఎప్పుడూ ఏదో నేర్చుకుంటూ - ఆలోచిస్తూ వుంటుంది; అది గొల్లవాని కుక్కకంటెనూ కూడా ఎంతో తెలివితేటలు గలది.

'ఏనుగుకు మరుపు ఉండదు' అని అంటారు. ఆ విషయంలో నాకు నమ్మకంలేదు. ఏదైనా విషయం జ్ఞాపకం వుండాలని అది కోరితే, తొండంతో ముడివేసుకున్నదేమో నన్నట్లు అనిపిస్తుంది మనుష్యులు బట్టకొంగు ముడివేసుకున్నట్లు! ఇది ఆశ్చర్యకరం! అది చేసే చిన్నచిన్న పనులు, కష్టాలు కలిగినప్పుడు అకస్మాత్తుగా ఆ చిక్కులను సరిచేసే తెలివితేటలను వ్యక్తం చేస్తాయి. దానికి శరీరంమీద ఎక్కడైనా దురద కలిగినదనుకోండి. ఆ భాగం దాని తొండానికి అందనప్పుడు ఒక పొడుగాటి కర్రను తొండంతో తీసుకుని దానితో ఆ భాగాన్ని గోకుకొంటుంది. కాని, ఆ భాగంతో చెట్టును రాయదు. ఆ కర్రకు ఆ భాగం అందకపోతే, దాన్ని పడవేసి పొడుగాటి మరొక కర్రను తీసుకుంటుంది. ఏదైనా తీగ చెట్టును గట్టిగా అంటిపెట్టుకునివుంటే - ఎంతో నేర్పుతో దాన్ని విప్పివేస్తుంది. మనుష్యుడు తన రెండు చేతులనూ ఉపయోగించినా అంత సులభంగానూ, నేర్పుగానూ విప్పలేడు.

అది సాయంకాలం! ఎగువ టాన్‌గ్‌డ్విన్ నదికి వెల్లువ వచ్చింది. ఎగువనుంచి, ఒక దానిని ఒకటి రాసుకుంటూ కొట్టుకొని వస్తున్న దుంగల చప్పుడు బాగా వినబడుతున్నది. నా బసకు కొంత దిగువగా ఉన్న ఏటిగట్టు రాతిది; నిట్రంగా - పన్నెండునుంచి పదిహేను అడుగుల ఎత్తు ఉంటుంది. రమారమీ ఏభై గజాల దూరంగా అవతలివైపున వుండే గట్టు మట్టిపొరల పేర్పుతో నిర్మితమైనది. ప్రవాహం అంత

కంతకు అధికమౌతున్నది. అప్పుడే సందె చీకటి ప్రారంభమైంది. ప్రవాహంయొక్క వడిని పరిశీలించడానికి నేను ఏటివైపు వెళ్లాను.

హఠాత్తుగా నాకు గొప్ప భయాన్ని సూచించే ఏనుగు ఘీంకారం వినబడినది. పోయి చూచాను. ఎదుటివైపు గట్టుమీద ముగ్గురు నలుగురు మనుష్యులు చాలా ఆందోళనతో ఇటూ అటూ తిరుగుతున్నారు. ఏదో ప్రమాదం జరిగిందని గ్రహించి గట్టుఅంచుకు పరుగెత్తి వెళ్లాను. 'మా ష్వే' Ma Shwe - బంగారు) ఏనుగు తన మూడు నెలల బిడ్డతోకూడా ప్రవాహంలో చిక్కుకొని ప్రమాద స్థితిలో ఉన్నది. నీరు ఆరడుగులకు పైగా ఉన్నందున ఆ యేనుగు మునిగిపోవడానికి సిద్ధంగా ఉన్నది. చాలా అపాయకరమైన స్థితి అది! పిల్లయేనుగు భయంతో అరుస్తూ బెండువలె తేలిపోతూ ఉన్నది. తల్లియేనుగు స్వశక్తిని పూర్తిగా ఉపయోగించి అధికమవుతూ వున్న ప్రవాహాన్ని ఎదిరిస్తూ, తన బిడ్డను శరీరానికి బాగా అదుముకుని ఒడ్డు చేరాలని యత్నిస్తూ వున్నది. ఏ క్షణంలోనైనా ప్రవాహపు వడికి పిల్లయేనుగు కొట్టుకొనిపోవచ్చు! కాని, తల్లియేనుగు బిడ్డను తొండంతో పట్టుకొని, యావచ్ఛక్తినీ ఉపయోగించి అపాయం కలగకుండా చేసింది.

ప్రవాహం అంతకంతకు హెచ్చవుతూ వున్నది. రెండడుగుల ప్రవాహం హఠాత్తుగా రాగా, దాని వడికి పిల్లయేనుగు కొట్టుకుపోయింది. కాని తల్లియేనుగు దాని వెనకనేపోయి, యాభై గజాల దూరాన దానిని పట్టుకొని నేనున్నవైపు ఒడ్డుకు వచ్చింది. తన బిడ్డను పట్టుకోవడానికి ముందు ఒకప్పుడు మునుగుతూ, మరొకప్పుడు తేలుతూ నానావస్థలూ పడింది. ఎంత శ్రమపడినా, బిడ్డను విడవలేదు. అది దాని బిడ్డను తలతోటీ, తొండంతోటీ పట్టుకొని రాతిమయమైన ఒడ్డుకు

అంటిపెట్టుకున్నట్లు అనించింది. కాని, ఆ పిల్లయేనుగును అక్కడ వుంచడానికి అవకాశంలేదు. అక్కడి అయిదడుగుల ఎత్తున, ఆ పిల్ల యేనుగు ముడుచుకొని నిలవడానికి మాత్రం వీలుగా చిన్నచోటు ఉన్నది. తల్లియేనుగు తన శక్తినంతా వినియోగించి, తొండంతో తన బిడ్డను మీదికిఎత్తి, ఆ స్థలంలో ఉంచింది. ఈ విధంగా తన యత్నాన్ని సఫలం చేసుకుని వెనక్కు వచ్చి మళ్లీ ప్రవాహంలో పడింది. తానుకూడా ఆ వెల్లువలో బెండువలె తేలిపోయింది. ఇప్పుడు తన ప్రాణాన్ని కాపాడుకొనుటకు యత్నించాలని దానికి తెలుసును. అది, తన బిడ్డను ఉంచిన స్థలంనుంచి రమారమి మూడువందల గజాల దూరం కొట్టుకుపోయింది. తర్వాత కొంచెం దూరంలోనే ఇరుకైన మార్గంనుంచి నది ప్రవహిస్తుంది. ఆ యిరుకులో పడితే, మరి బ్రతికే ఆశలేదు. ఈ సంగతి తల్లియేనుగుకున్నూ తెలుసును ! ఒక్క అనుకూల మార్గం మాత్రం లేకపోలేదు. 'మా ష్వే' కూ, ఆ సందుకు మధ్యలో-సులభంగా అవతలి ఒడ్డు చేరే స్థలం ఒకటి ఉన్నది. ఆ స్థలం దానికి తెలుసును. అది ఆవిధంగా అవతలి ఒడ్డు చేరుతుందని నా నిశ్చయం ! నేను అనుకున్నట్లే జరిగింది.

పిల్లయేనుగు ఏమి అవుతుందో అనే విచారమే నన్ను బాధించి నది. అక్కడ, అది పాదాలు ఉంచుకోడానికి మాత్రం సరిపోయేచోట, వణికిపోతూ, భయపడుతూ, కాళ్లు ముడుచుకొని నిలిచి ఉన్నది. ఆ గట్టుకు అంటిపెట్టుకొని వుండకపోతే అక్కడ ఉండడం సాధ్యపడదు.

నేను అది వున్నచోటుకు ఎనిమిదడగుల ఎత్తున వున్నాను. 'దానికి ఏం చెయ్యాలా ?' అని నేను ఆలోచిస్తూ వుండగానే, సమంగా ఎదటివైపు గట్టుమీద ఉన్న 'మాష్వే' ప్రేమతో అరచిన అరపు విని పించింది. ఆ తల్లియేనుగు నదిని దాటి, గట్టెక్కి, ఎంతో వేగంగా

అక్కడికి వచ్చింది! ఆ అరపువిన్న పిల్లయేనుగుకు ప్రాణాలు లేచి వచ్చాయి! అది యెంతో ఆనందంతో తిరిగి అరచి, తల్లికి సమాధానం ఇచ్చింది.

మోకులనూ, వాటినీ ఉపయోగించి, ఆ పిల్లయేనుగును అక్కడినుంచి సురక్షితస్థలానికి చేర్చడం ఎలాగా? అని పరిపరివిధాల ఆలోచిస్తున్న నాకు పిల్లకు ఎదురుగా అవతలి గట్టుమీద తల్లి కాన రాగానే - ఆ ఆలోచనలన్నీ మాయమయ్యాయి. బిడ్డను చూచిన వెంటనే, తల్లి పిలిచిన పిలుపు, అపరిమితానందాన్ని వెల్లడించింది. బిడ్డ చెక్కుచెదరకుండా తాను వుంచిన చోటనే అదేస్థితిలో కనబడడం ఎంతో సంతృప్తిని కలిగించి వుండాలి.

చీకటి ఎక్కువైనది. ప్రవాహంలో కొట్టుకొని వస్తున్న దుంగలు ఒకదాని నొకటి రాసుకొని, చేస్తున్న ధ్వనిమాత్రం వినబడు తున్నది. సంతతధారగా వర్షం పడుతూనే ఉన్నది. వరద అంతకంతకు హెచ్చుతునే వున్నది. తల్లీ, పిల్లా ఒకరినొకరు చూస్తూ అలాగే ఉన్నారు. ముందు ఏమి జరుగుతుందో అని. ఎదురు చూడడం తప్ప మనం ఇప్పట్లో ఏమీ చెయ్యలేమని నిశ్చయించుకున్నాను. రాత్రి పరుండడానికి ముందు రెండుసార్లు ఒడ్డుకువచ్చి టార్చిలైటు వేసి పిల్ల యేనుగు అదేవిధంగా వుండడం చూచాను. తరచుగా వచ్చి చూస్తే కలిగే ప్రయోజనం చికాకు కలిగించడం తప్ప మరేమీ వుండదని తలచి, వెళ్లిపొయ్యాను. తెల్లవారుజామున వచ్చి చూడగా, తల్లీ, పిల్లా - రెండు ఏనుగులూ అవతలి ఒడ్డున కానవచ్చాయి. నదిని చూస్తే అడుగులోతుకంటె ఎక్కువ నీరులేదు. అదిన్నీ బురదనీరు! తల్లి, తన బిడ్డను ఎలా తీసుకున్నదీ మకాములో ఎవ్వరూ చూడలేదు. ప్రవాహం తగ్గాక, అది ఏటిలోంచి అక్కడికి వచ్చి జాగ్రత్తగా బిడ్డను దింపి అవతలిగట్టుకు తీసుకొనివెళ్లి వుండాలి!

ఐదేళ్లతర్వాత - పేరుపెట్టేటప్పుడు పిల్లయేనుగుకు 'నా-యే-యీ' (**Na-ye-yee = Laughing water** - 'జలహాసిని') అనే నామ కరణం చెయ్యబడింది.

జపానీయులు బర్మాపై పడగా, వాళ్లనుంచి తిరిగి స్వాధీనం చేసుకునేవరకూ బర్మాలో ఏనుగుల శస్త్రచికిత్స పాతపద్ధతులలోనూ-అనాదికాలపు పద్ధతులలోనూ జరిగేది. యుద్ధానికి కొంచెం ముందున-నొప్పి తెలియకుండా చేసే మందులను ఉపయోగించే చికిత్స ప్రారంభ మైనది.

ఏనుగు గుండెలమీది వ్రణానికి చికిత్స చేసేటప్పుడు దాని దవుడల క్రిందనూ, దంతాలక్రిందనూ దూరి పనిచెయ్యాలి. ఇందుకు ఎంతో ధైర్యమూ, నమ్మకమూ ఉండాలి. అప్పుడు ఎడమచేతితో పది అంగుళాల పొడుగూ, నాలుగు అంగుళాల వెడల్పాగల కత్తినీ, కుడిచేతో ఆరుపౌనులు బరువుకల కొయ్యగూటాన్నీ ధరించి వుండాలి. కత్తితో పుండును కోసేటప్పుడు ఏనుగును తల ఎత్తాలని అడగాలి. కత్తిని పిడివరకూ వ్రణంమీద సరిగావుంచి కర్ర గూటాంతో ఒక్క దెబ్బకు అది దిగిపోయేటట్లు చూడాలి. రెండోసారి ప్రయత్నించకూడదు. ప్రయత్నిస్తే అది బ్రహ్మాండంగా ఘీంకరిస్తుంది. అలా యత్నించడం దానికి ఇష్టంగా ఉండదు. పుండుకోత సక్రమంగానూ, శీఘ్రంగానూ జరిపి, దానిప్రక్కకు తప్పుకొన్నయెడల - పదినిమిషాలకు తర్వాత మళ్లీ దగ్గరకు రానిస్తుంది. అప్పుడు వ్రణాన్ని చేతులతో శుభ్రపరచి, మందునీటిని పిచికారుకొట్టవచ్చు. వీపుమీది వ్రణాలకుకూడా యీ మాదిరిగానే చికిత్స చెయ్యాలి. దాన్ని కూర్చోపెట్టే అప్పుడు చికిత్స చెయ్యవలసి వుంటుంది. ఇలాటి వైద్యాలు తమ మంచికే చెయ్యబడుతున్నవని ఏనుగులకు బాగా తెలుసును. అందుచేత అవి చికిత్సాసమ

యంలో ఎంత బాధనయినా శాంతంగా సహిస్తాయి. చికిత్సకుడు, తాను చక్కగా వైద్యం చెయ్యగలననే నమ్మకంతోవుండి, స్వధర్మాన్ని నిర్వర్తించినప్పుడే అవి ఓర్పు వహించి వుంటాయి. తక్కిన జంతువులకంటె ఏనుగులు సులభంగా ఇతరుల సంగతులను గ్రహిస్తాయి. వాటికి ఏమాత్రం సందేహం కలిగినా - చికిత్సకుడు తన సాధన సామగ్రిని మరొకనికి అప్పగించి తప్పుకోవడమే మేలైన పని.

తమ పిల్లలను పులులనుంచి కాపాడుకొనేటప్పుడు తల్లి యేనుగులు పెద్ద దెబ్బలను తినడం పరిపాటి. అట్టి గాయాలను మాన్పడం చాలా కష్టం ! ఎంత గొప్పమందులైనా, ఆ గాయాలమీద పని చెయ్యవు.

ఏనుగులకు వచ్చే జబ్బులను కుదర్చడానికి బర్మీయులు రకరకాల చికిత్సలు చేస్తారు. వాటిలో కొన్ని మూలికావైద్యాలు; కొన్ని మంత్రతంత్రాలు. వాటిలో కొన్ని ప్రమాదకరాలు ఉన్నందున, ఆ పద్ధతులు కొన్ని నిషేధించబడినవి. ఇంకా నిషేధించవలసి ఉన్నది. పులులవల్ల కలిగే గాయాలలో చక్కెరను కూరే పద్ధతి బర్మీయులలో సంప్రదాయసిద్ధంగా వస్తున్నది. ఈ పద్ధతి మరెక్కడా ఉన్నట్లు నే నెరగను. బాగా కుళ్లిపోయిన కురుపులను మాన్చడానికి వారు కొన్ని పురుగులను ఉపయోగించే పద్ధతి చాలా శతాబ్దాలుగా ఉన్నది. ఈ కాలపు శస్త్ర చికిత్సలో ఈ పద్ధతి అంతటా అవలంబింపబడుతూ ఉన్నది.

శస్త్ర చికిత్సతోపాటు ఏనుగులకు మందుమాకు లియ్యడమూ అవసరమే. కాని మందుల అవసరం లేకుండా వాటిని మంచి ఆరోగ్య స్థితిలో వుంచడం మేలయిన పని. దానికి ఒక్కొక్కదాని అవసరాలనూ బాగుగా తెలుసుకోవలసి ఉన్నది. ఏనుగు నెమరు వెయ్యదు.

దానికి ఒకచే జీర్ణకోశం ఉన్నది. దానికి దినమునకు ఆరువందల పౌనుల తాజాతిండి కావాలి. అజీర్ణరోగం దానికి సులభంగా రావచ్చు. ఆరోగ్యంగా వుండడానికి, ఆహారంలో కొంత మార్పు కావాలి. దాని కోసం ఎంతో శ్రమపడవలసి వుంటుంది. ఒక ఉదాహరణం చూడండి. ఒక యేనుగు పనిచేస్తున్న స్థలంలో వెదురు తప్ప మరేమీ దొరకదని అనుకుందాం. దానికి మరోరకం తిండికావాలంటే అధమం ఎనిమిది మైళ్లు వెళ్లాలి. ఇది ఒకనాటి శ్రమ కాదు. ప్రతిదినమూ పగలల్లా చచ్చీ, చెడీ పనిచేసి రాత్రి యింతదూరమూ పోయి, మేసి, తిరిగి ఉదయానికి వచ్చి పనిచెయ్యడం సామాన్యంకాదు. ఇలా చేస్తూవుంటే, మూడువారాల్లో అది క్షీణిస్తుంది. అది సరియైన స్థితికి రావడానికి మూడు నెలలు పడుతుంది. ఎంతో అనుభవం ఉన్నవాడుతప్ప మరొకడు ఈ స్థితిని కనిపెట్టలేడు. గజపరీక్షాసమయంలో "నీకు ఏనుగులన్నింటి పేర్లూ తెలుసునా?" అనే ప్రశ్న వేస్తే, బుద్ధిమంతుడు "వాటన్నిటిపేర్లు మాత్రమేకాదు; వాటి జీర్ణశక్తిని గురించిన్నీ తెలుసును" అని సమాధాన మిస్తాడు.

ఏనుగుల మందను విభజించి, ఏడేసింటిని ఒక్కొక్క జట్టుగా చేసి, వేర్వేరు మకాములకు పంపడంకూడా వాటి అనారోగ్యానికి దారితీస్తుంది. ఆ యా స్థలాలకూ, వాటివాటికి ఇష్టమైన తిండికీ తగిన విధంగా ఏనుగుల మందను జట్లుగా విడతియ్యాలి. వాటి అవసరాలను గమనించాలి. స్థలం రాతినేల అయినదీ, మరొక విధంగా వున్నదీ, బురదనేలగా ఉన్నదీ, పొరపొరలుగా ఉన్నదీ చూచి, తగిన విధంగానే జట్టును నిర్ణయించాలి. కొన్ని యేనుగులు పెద్దపెద్ద దూలాలను పట్టుకోగలవు. కొన్ని చిన్న దుంగలనే మొయ్యగలవు. అందువల్ల - వాటివాటి శక్తిని గమనించి పనులను నిర్ణయించాలి.

మన పాదాలవలెనే ఏనుగుల పాదాలుకూడా వేర్వేరు ఆకృతుల లోనూ, వివిధ పరిమాణాలలోనూ వుండును. వాటి ముందుకాళ్లకు అయిదేసి వేలిగోళ్లూ, వెనకకాళ్లకు నాలుగేసి వేలిగోళ్లూ ఉంటవి. ఈ పాదాలనుబట్టి కూడా వాటికి తగిన ప్రదేశాన్ని నిర్ణయించాలి. చక్కని ఆకారంగల పాదాలున్నవీ, దళంగా చీలమండలున్నవీ మాత్రమే బురదలో పని చెయ్యగలవు.

అవి చేసే పనివిషయమై స్త్రీ, పురుష భేదాన్నికూడా పాటించడం ఎంతో ముఖ్యం. బురద నేలలు ఎక్కువగా ఉన్న ప్రదేశం లోనూ, కలప ఎక్కువగా లభించే అడవులలోనూ ఆడఏనుగులకంటె మగయేనుగులే బాగా పని చెయ్యగలవు. 'హ్టోక్' చేసే ఏనుగులు (Htoking elephants) ప్రత్యేకమైనవి. దూలాలను చెట్టుకొట్టిన స్థలంనుంచి యీడ్చడానికి తగిన మార్గానికి అవి మాత్రమే తీసుకుని రాగలవు, నరికిన చెట్టు ఒకప్పుడు మూడు, నాలుగు వందల అడుగుల అడుగున కొండల సందులో పడిపోవచ్చును. గొప్ప శక్తిగల ఆయేను గులే తమ దంతాలతో దాన్ని 'హ్టోక్' చేసి అంటే పైకెత్తి (ఆచెట్లు దుంగలుగా కొట్టబడిన తర్వాతనే) సరియైన దారికి తీసుకు వస్తాయి. అట్టి పనిని అవి మాత్రమే చెయ్యగలవు.

౮

ఉత్తర - అండమాన్ ద్వీపములలో వుండే అడవులను పరి శోధించడానికి 1931 లో ఒక పరిశోధకుల జట్టు పంపబడింది. అదృష్ట వశాత్తు నేనుకూడా ఆ జట్టులో ఒకడనై ఉంటిని. నేనుకాక, మరి ముగ్గురు ఉద్యోగులు ఆ జట్టులో వున్నారు. మాకు పనిపాటులు చేసేందుకు, అక్కడ శిక్ష అనుభవిస్తున్న నలభై ఎనమండుగురు అప



పిడి ఏనుగు, $2\frac{1}{2}$ సం. ల వయస్సుగల గున్న ఏనుగు.
చెవి ముడతలను బట్టి 45 సం.ల వయస్సు ఉంటుందని చెప్పవచ్చును.



ఏనుగు గొలుసుల సహాయంతో దుంగలు లాగుట.



18 సంవత్సరముల వయస్సుగల మగ ఏనుగు.





లాగలేక లాగలేక లాగుతూన్న దృశ్యం.



సహాయంగా మరికొన్ని ఏనుగులు.



రెండు ఏనుగులు నెట్టుటకు, మరొకటి లాగుటకు.



మగ ఏనుగు దుంగను నెట్టుట.



ఇసుకలో యిరుకుకున్న దుంగలను బయటకు లాగుట.



సహాయముగా మరొక ఏనుగు.



ఐరావతీ నదిలో రవాణా అగుచున్న దుంగలు.

రాధులు నియమింపబడ్డారు. అక్కడవుండే తరుగుల్మాదులూ, గడ్డీ - ఏనుగులు - మరొకదానిపైని ఆధారపడకుండా - మేసి పనిపాటులు చెయ్యగలవో లేవో పరిశీలించడం నేను చెయ్యవలసిన పనులలో ఒకటి. బర్మా అడవులలో ఏనుగుల పోషణకు తగిన ఆహారం ఉన్నది. ఈ అడవులుకూడా అలాంటివగునో, కాదో తెలుసుకోవాలి. ఈ పరిశీలన ఘనకార్యమనే చెప్పాలి. ఈ పరిశోధనలో దిగడానికి ముందు బర్మాలో ఏనుగులు ఎలాటి మొక్కలను మేస్తాయో తెలుసుకోవాలి. దానికోసం నేను మూడు రాత్రులూ, మూడు పగళ్లూ ఒక ఏనుగు వెనకనే వుంటూ, అది మేస్తున్నపుడు గమనిస్తూ, అది మేసే మొక్కల మచ్చులను సంపాదించాను. నేను ఈ రీతిగా నలభై ఎనిమిది సాధారణమైన మొక్కల మచ్చులు సంగ్రహించాను. అరుదుగావుండే వాటిని విడిచిపెట్టాను.

నేనీవిధంగా పరిశోధన చేస్తున్నప్పుడు బర్మా బందిపోటు దొంగలను గురించి చాలా విషయాలు తెలుసుకున్నాను. వారిని గురించిన నా వూహలూ, బర్మాలోని నా అనుభవాలూ సరియైనవే అని బాగా బోధపడింది. మా వెంట వుండే నలభై ఎనమండుగురూ ద్వీపాంతర శిక్ష విధించబడినవారే! మేమక్కడ తిరిగిన నాలుగు నెలలూ వాళ్లే మాకు కావలసిన పనిపాటులు చేసేవారు!

నేను బ్లేర్ రేవుపట్టణంలో వారినందరినీ కూడదీసుకుని వారితో ఉత్తర ద్వీపాలకు బయలుదేరాను. వాళ్లనాయకుడు 'న్గామో' (**Nga Moh**) అనే బర్మీయుడు! అతని మీసాలు బాగా నెరిసి 'మండరిన్ (**Mandarin** - ఒక చీనా అధికారి) మీసాలవలె గడ్డంక్రిందదాకా వేలాడుతూ ఉన్నవి.

'న్గామో' తన్నుగురించి నాకు వివరంగా తెలిపాడు - 'అతడు ఇరవై యేళ్ల యువకుడుగా వున్నప్పుడే ఒక బందిపోటు దొంగల

ముఠాలో చేరాడు. వాళ్ళజట్టులో ఎనమండుగురుండేవారు.' బర్మా-సయాం సరిహద్దులో, వాళ్లొక కంచరగాడిదల బిడారును అడ్డగించారు. జట్టుదారులదగ్గర ఒక్కటే ఒక్క తుపాకీ ఉండినది. తుపాకితో ఎవరినీ కాల్చి చంపాలనే అభిప్రాయం జట్టులో ఎవరికీలేదు. ఆ గాడిదలను బెదరకొట్టడానికి రెండుసార్లు దాన్ని పేల్చాలని ముందే అనుకున్నారు వాళ్లు. అయితేనేం? అనుకున్నట్లు జరుగలేదు. కంచరగాడిదలను తోలేవాడు కొట్టిన కత్తిదెబ్బను తప్పించుకోడానికి, వాళ్ల జట్టునాయకుడు తుపాకిని పేల్చి వానిని చంపివేశాడు.

బిడారులోని జనం ఊరుకోలేదు. ఒకని కత్తిదెబ్బ గట్టిగా 'న్గాహో' కాలికితగిలి, అతడు పట్టుబడ్డాడు. కాల్చడానికి పనికివచ్చే తుపాకిగుళ్లు అతనిదగ్గరే వుండడంవల్ల, అతడే హత్య చేసినట్లు రుజువైనది.' అతడు యీ విషయాన్ని - జనసంచార శూన్యమై-హిందూ మహాసముద్రంలోనున్న ఒక ద్వీపంమధ్యను మకాంచేసి, రాత్రి చలి కాచుకుంటూ వున్నప్పుడు చెప్పాడు. అతనికి ఇరవై అయిదేళ్ల శిక్ష పడ్డది. ఆయేడే పూర్తవుతుంది. విడుదల పొందాక అతడు నాతో బర్మాలోని ఎగువ చిండ్విన్ ప్రాంతానికి వచ్చాడు. కాని, తాను శిక్ష అనుభవించిన ద్వీపాలమీదా, సముద్రంమీదా మోజుపడి, తిరిగి అక్కడికే వెళ్లిపోయాడు.

అండమానులకు వెళ్ళడానికి పూర్వమే నాకు చాలా మంది బందిపోటు దొంగలను గురించి తెలుసును. ఒక్కొక్కపుడు నిజంగా వాళ్ళు అట్టి వాళ్ళే అని అనుకున్నా, ఒక్కొక్కప్పుడు ఆ సంగతిని గమనించకుండా, వాళ్లమీద నమ్మకం వుంచి, పనులను అప్పగించేవాడను! కాని, మొత్తం మీద - న్యాయరక్షణకు బాహ్యులైన వారిలో బర్మా దేశపు బందిపోటు దొంగ - రాబిన్‌హుడ్డు వలెనే -

తగు మనుష్యుడుగా పేరు ప్రతిష్ఠలు సంపాదించాడు. అతనికి నేర్పు ఎక్కువ. తమాషాగా - నిర్ణీతమైన పద్ధతిలో తన పనిని సాగిస్తాడు. వీలయినంత వరకూ తన పని వల్ల ఇతరులకు ప్రాణహాని కలుగకుండా చూస్తాడు.

ఒకప్పుడు నేను ఎగువ చింద్విన్ ప్రాంతంలోని పాంగ్‌బ్యిన్ నుంచి కాంతి అడవులకు బయలుదేరాను. నాతో పది ఏనుగు లున్నాయి. అవి లక్ష - వెండి రూపాయలుగల పెట్టెలను మోస్తున్నవి. ఒక్కొక్క పెట్టె మున్నూరు పౌనుల బరువు కలది. నేను పద్దెనిమిది రోజులు ప్రయాణం చెయ్యవలసి వున్నది. ప్రతిదినమూ ఆ రొక్కపు పెట్టెలను ఏనుగుల మీదికి ఎక్కించడం, దింపడం చాలా కష్టమైన పనులు. వాటికి ఎంతో బలం కావాలి. నేను పాంగ్‌బ్యిన్ నుంచి బయలు దేరిన మూడవ నాడు, నా సిబ్బందిలోని పెద్ద నా దగ్గరకు వచ్చి ఒక సలహా యిచ్చాడు - నేను బస చేసిన గ్రామం లోనే - ఏనుగు మాదిరిగా బలవంతుడని పేరు పడిన మనిషి వున్నాడనీ, అతనికి కొంత కూలి నిర్ణయించి తీసుకువస్తే పెట్టెల విషయంలో చాలా సాయపడతాడనీ అతడు చెప్పాడు. అలాంటి వాడు ఎంతో అవసరమని నాకున్నా తోచి, వెంటనే రప్పించాను. అతని పేరు 'మాంగ్‌న్గాప్యా' (Maung Ngapyaw = అరటి చెట్టు). అతడు మంచి కండర పుష్టి కల్గి, ఎంతో ఉత్సాహవంతుడుగా కనబడ్డాడు. మూడేసి వందల పౌనులు బరువు గల పెట్టెలనూ, అతడు ఏభై పౌనుల బరువున్న వాటివలె సుళువుగా ఎత్తి, దించేవాడు. ఈ విధంగా ఏనుగుల మీదికి పెట్టెలను ఎక్కించే పని శ్రమలేకుండా జరిగేది. అతడు అరవై రూపాయలు తీసుకుని, మాతో గమ్యస్థానం వరకూ రావడానికి సమ్మతించాడు. అతని మీద అందరికీ మంచి నమ్మకం కలిగింది. అందరినీ హాస్యమాడుతూ, వినోదాన్ని కలిగించేవాడు. మాకు మంచి మనిషి దొరికాడని మేము ఎంతో సంతోషించాము.

అప్పటికే వర్షాలు ప్రారంభమయాయి. అందువల్ల ఆ ప్రయాణంలో ఎంతో కష్టపడవలసి వచ్చింది. చివరకు సురక్షితంగా, నా అడవి మకామైన 'కాంతి'ని చేరగలిగాము. అక్కడ డబ్బు దాచే ఇనుపపెట్టె ఉన్నది. అక్కడ చేరగానే నేను - నూరేసి రూపాయలు ఒక్కొక్క పొట్లంగా - పొట్లాలు కట్టించి ఆ పెట్టెలో భద్రంగా ఉంచాను ఆ పొట్లాలు కట్టడంలో 'స్గాప్యా' నాకెంతో సాయపడ్డాడు. పొట్లాలు. సరిగా లెక్కించి, పరీక్షచేసి, ఆ యినుప పెట్టెలో పెట్టి తాళాలు వేసే వరకూ నా మనస్సు కుదట పడలేదు.

అప్పుడు సాయంకాలం ఆరు గంటలయి వుంటుంది. నేను మకాము విడిచి పెట్టిన దగ్గర్నుంచీ అప్పటి వరకూ వచ్చిన తపాలును వార్తాహరులు తెచ్చారు. నేను స్నానంచేసి వాటిని చూడదలచాను. స్నానానంతరం నా కుటీరం యొక్క వరండాలో కూర్చుని తపాలు విప్పి ఆఫీసు జాబులను వేరుగానూ, స్వంత ఉత్తరాలను వేరుగానూ ఏర్చి, మొదట ఆఫీసుకు సంబంధించిన వాటిని చూడసాగాను. అవి చూస్తేనే - ముఖ్యంగా చెయ్యవలసిన పనులను మొదట తెలుసుకో వచ్చును. ఆ జాబులను మొదట చూడడమే నాకు అలవాటుకూడాను. అందులో ఒక కవరు మీద "త్వరగా చూడవలసినదీ, ముఖ్యమైన దీన్నీ" అని ఉన్నది. నేను సైన్యంలో పని చేస్తూ వుంటే యీ మాటలను లెక్కచేసే వాడను కాను. ఏమంటే - అప్పుడు వచ్చే ప్రతీ కవరుపైనీ యిలాగే వ్రాయబడి వుండేది. ఇప్పుడీ కవరు 'కార్వొరేషను' నుంచి రావడం చేత, దీనిలో ముఖ్యమైనదీ, శీఘ్రంగా గమనింప దగినదీ - ఏదైనా తప్పక వుంటుందని భావించి వెంటనే దానిని విప్పినాను. అందులోని విషయం యిదీ - "స్గాప్యా - అనే ప్రసిద్ధుడైన బందిపోటు దొంగ మీ బసవైపు వస్తున్నట్లు పోలీసులు కని పెట్టారు. మీరు చాలా జాగ్రత్తగా ఉండాలి. వాడు శాన్ష్వే, శాన్

ఊ అనే మారు పేర్లతో కూడా తిరుగుతున్నాడు" అని ఫారెస్టు మానేజరు వ్రాసిన మరొక జాబులో రెండే రెండు మాటలున్నవి. "ముందే జాగ్రత్త పడడం, ఆయుధాలతో సిద్ధంగా వుండడం వంటిది (Fore-warned is fo:e-armed)" అని.

అలా హెచ్చరికలు రావడం మంచిదే. కాని యీ వార్త వల్ల నే నేమీ కలత పడలేదు. భోజనానంతరం నేను నాలోనే తర్జన భర్జనలు చేసుకున్నాను - ఆ రాత్రి న్గాప్యాను నిర్బంధించడమా? ఉదయం అతని కియ్యవలసిన సొమ్ము ఇచ్చే వరకూ నిరీక్షించడమా? అని. చివరకు ఉదయం వరకూ వేచి ఉండడమే మంచిదని నిశ్చయించుకున్నాను.

ఆ అడవిలో నా బస ఒక్కటే కావడం వల్ల సాయుధులైన బందిపోటు దొంగలు సులభంగా పైని పడవచ్చును. అందువల్ల రాత్రులందు నా మనస్సులో బెదురు వుండనే వుంటుంది. నాటి రాత్రి ఒక కన్నుతో చూస్తూ, ఒక చెవితో వింటూ నేను పడుకున్నాను. కాని నా మనస్సులో మాత్రం ఎలాటి కలతపాటున్నూ లేదు.

ఉదయం వేగంగానే లేచాను. న్గాప్యాకు కబురు పంపాలని అనుకున్నాను. ఇంతలో నా ప్రధాన సేవకుడు వచ్చి "న్గాప్యా, తపాలు తెచ్చిన ఒక వార్తాహరునితో కూడా రాత్రికిరాత్రి మకాము విడిచి వెళ్ళి పోయాడు" అని చెప్పాడు. న్గాప్యా ముందు జాగ్రత్త పడ్డాడు! పోలీసులూ, అడవి మానేజరూ లేఖల మూలంగా నాకు హెచ్చరిక యిచ్చారు. తపాలు తెచ్చిన వార్తాహరుడు న్గాప్యాను హెచ్చరించాడు. తర్వాత నేనే ఆ అడవిలోని వేర్వేరు చోట్లకు హెచ్చరిస్తూ వార్తలను పంపవలసి వచ్చింది. అయినా, మరొక సంవత్సరం వరకూ న్గాప్యా పేరు ఎక్కడా వినబడలేదు. తర్వాత ప్రసిద్ధమైన ష్వేబో

(Shwebo) బందిపోటు దొంగతనం ప్రాంతంలో అతనిని పోలీసులు కాల్చి చంపివేశారు. కాని, అతడు నా మకాము వివరాలనూ, ఇనుప పెట్టె ఉన్న స్థితిని తోడి వారికి వివరంగా చెప్పేవుండవచ్చును. ఎంచేతంటే - రెండేళ్ళ తర్వాత నా తర్వాత వచ్చిన అధికారి ఆ మకాములో వున్నప్పుడు ఆ ఇనుప పెట్టెలో వున్న పాతిక వేల సొమ్మును బందిపోటు దొంగలు దోచుకోవడం జరిగింది. వాళ్ళు వెళ్ళిపోయేటప్పుడు, ఆ కుటీరానికి చుట్టూ వుండే దడిలోని ఒక్కొక్క రాటకూ ఒక్కొక్క పదిరూపాయల నోటును గుచ్చి మరీ వెళ్ళి పొయ్యారు. మొత్తం మీద ఆ దడికి నూట ఇరవై రాటలు ఉన్నాయి. అందువల్ల రు. 1,200 లభించాయి. వాళ్లు చేసిన యీ పని అసూయతో జరిగినా తమాషాగా ఉండినది.

ఈ నా అనుభవాలూ, ఏనుగులను పర్యవేక్షిస్తున్న మనుష్యులు బందిపోటు దొంగలను గురించి నమ్మకంతో చెప్పిన కథలూ - ఈ 48 గురు శిక్షితులనూ గమనిస్తూ, వాళ్ళవల్ల పని రాబట్టడంలో ఎంతో సహాయపడ్డవి. మావటి వాళ్ళు ఈ దొంగలను గురించి చిత్రవిచిత్రంగా చెప్తారు. తుపాకిగుండు దెబ్బలవల్ల బాధ కలగకుండా వాళ్ళు పచ్చబొట్లు పొడిపించుకుంటారట! ఆ పద్ధతి వాళ్ళకే గాని ఇతరులకు తెలియదు. ఆ విధంగానే కోతివంటి ఒకానొక మృగం యొక్క వేడి వేడి రక్తం తాగి వాళ్ళు నిశ్శబ్దంగా తమ చోరకర్మను సాగించుకోగలరట!



ఏనుగులు బాగుగా ఈదగలవు. అవి నీటిలో చక్కగా తేల గలవు. ఐరావతి, చిన్‌డ్విన్ మొదలైన పెద్ద పెద్ద నదులను దాట వలసి వచ్చినప్పుడు మావటివాడు కడుపును చుట్టి వచ్చేటట్టు మెడ మీద నుంచి దృఢమైన త్రాళ్ళు కట్టి, ఏనుగు మీద కూర్చుని తన ముందు ఉన్న ఆ త్రాళ్ళను గట్టిగా పట్టుకుంటాడు. అవసరాలను బట్టి ఏవైనా సంకేతాలు తెలపడానికి, దాని చెవుల ప్రక్క చిన్న కర్రను ఉంచుకుంటాడు. లోతు నీళ్ళలో పోయేటప్పుడు ఏనుగులను చూడడం వినోదంగా ఉంటుంది. కొంతసేపు వేడుకగా పోతూ ఏనుగు తటాలున మునిగిపోతుంది. ఊజీ ఉక్కిరి బిక్కిరై పోతాడు. అది జలాంతర్గామి మాదిరిగా పదిహేనడుగుల లోతు నీటిలో మునిగి, మావటీనిని కూడా ముంచి వేస్తుంది. ఇది దానికి వేడుక!

మనుష్యుడు ఉండగలిగినంత సేపు మాత్రమే ఏనుగున్నూ నీటిలో వుండగలదని ఊజీ ఎరుగును. అంచేత అతను ధైర్యం చిక్క బట్టి ఉంటాడు. ఈలోగా ఏనుగు బాగా అడుగుకు మునిగిపోయి, హఠాత్తుగా పైకి తేలుతుంది. ఊజీతోపాటు అదిన్నీ దీర్ఘంగా ఊపిరి తీస్తుంది. ఊజీ 'బ్రతుకు జీవుడా' అని అనుకుంటాడు.

వెడల్పుగా వుండే నదులను దాటడానికి వెయ్యి గజాల మేర ఈదవలసి వచ్చినప్పుడు, ఏనుగు నాలుగు వందల గజాలవరకూ దిగు వకు కొట్టుకొని పోతుంది. నది కొంత సన్నంగా ప్రవహిస్తున్న చోటనే దాటాలనే పట్టుదల దానికి లేదు; అవలి ఒడ్డున ఫలానా చోటు చేరాలనే నిశ్చయమూ లేదు.

చాలా దూరస్థలాలకు నీటిలో ప్రయాణం చెయ్యవలసి వచ్చినప్పుడు, ఏనుగులను తరుచుగా తెప్పల మీద గాని, ఏటిలో ప్రయాణం చేసే పడవల మీదగాని ఎక్కించి, ఆ యానాలను స్టీమర్లకు కడతారు. కాని, ఏనుగులను పడవల మీద ప్రయాణం చేయించడానికి ఎంతో ఓరిమి వుండాలి. మొదట ఒక ఏనుగు ఎక్కితేనేగాని తక్కినవి దారి తియ్యవు. మొదటి దానిని ఎక్కించడమే కష్టం. పడవకు పోయే మార్గానికి రెండు వైపులా పది, పన్నెండు అడుగుల యెత్తునకు గడ్డిగాని, తాటిచెట్లు మున్నగు చెట్లుగాని వున్నట్లు చూపాలి.

ఏనుగులు ప్రయాణం చేస్తున్న జలయానాల పై భాగం ఉక్కుతో నిర్మించబడి వుండడం వల్ల ఎండకు మిక్కిలి కాలుతూ వుంటుంది. దాని మీద ఏనుగులు ఇరవై నాలుగు గంటల దాకా నిలబడితే, వాటి కాళ్ళు రోళ్ళవలె వాచిపోయి, వదులుగా వుండే గొలుసులను తీసివెయ్యవలసిన అవసరం ఏర్పడుతుంది.

ఏనుగులు ఎప్పుడు నిద్రిస్తాయో, ఎంతసేపు నిద్రిస్తాయో తెలుసుకోవడానికి నేను రాత్రి పూర్తిగా చాలా ఏనుగుల దగ్గర కూర్చుండే వాడిని. వాటి నిద్రకు నియమితమైన సమయం కానరాదు. కాని, పురుగులు కూడా నిశ్శబ్దంగా వుండే నిసిరాత్రి సమయంలో అవి నిద్రపోతాయని చెప్పవచ్చు. అవి అరగంట సేపు మాత్రమే నిద్రపోతాయి. కాని ఆ నిద్ర గాఢమైన నిద్ర! నిద్రించడానికి మునుపు, గంటసేపు, ఏనుగు ఏమీ తినకుండా, చలించకుండా నించుంటుంది. అప్పుడు చెవులను కదపడం గాని, తోకను ఆడించడం గాని చెయ్యదు. అప్పుడది ఏదో ధ్వనిని నిదానించి వింటున్నట్లుగా కనబడుతుంది. ఇక నిర్భయంగా నిద్రపోవచ్చుననే నిశ్చయం తోచగా, అది మెల్ల మెల్లగా నేలమీద కూలబడి, ఏదో వనదేవత ఆవేశించినట్లుగా

పరవశమై నిద్రిస్తుంది. పండు వెన్నెలలో ఏనుగు నిద్రించడం ఎంతో అందంగానూ, వింతగానూ కానవస్తుంది.

బాగుగా ఎదిగిన ఏనుగుకు అడవిలో ఎలాటిభయమూ వుండదు. అయినా వింత ధ్వనులు వినవచ్చినపుడూ, ప్రమాదం కలిగే సూచన ఉన్నపుడూ తన బిడ్డను కాపాడడం కోసం అది కొంత జాగ్రత్త వహిస్తుంది. తనకు అపూర్వాలుగా తోచిన వాటి విషయంలోనే అది బెదురుతుంది. ఆహారం కోసం తిరిగే పులికి మగ ఏనుగు బెదరదు. అది తన్ను ఏమీ చెయ్యలేదని మగ ఏనుగుకు బాగా తెలుసును.

గుర్రాలంటే ఏనుగులకు సరిపడదు. ఏనుగులను చూస్తే గుర్రాలకు భయం. ఆ విధంగానే గుర్రాలనుచూచి ఒకప్పుడు ఏనుగులున్నూ భయపడతాయి. గుర్రాన్ని చూచి ఒక ఏనుగు బెదిరితే తక్కిన, జట్టులోని ఏనుగులన్నీ బెదిరి పారిపోవడమూ, ఆ సమయంలో ఊజీలు గాయపడి, సరంజామా ఛిన్నాభిన్నమై, పాత్రిలూ అవీ పగిలి పోవడమూ సంభవిస్తుంది.

ఏనుగులకూ, గుర్రాలకూ పడక పోవడం మాట అటుంచి అడవుల్లో గుర్రాలు వుండవలసిన ప్రమేయం తక్కువ. చలికాలంలో గుర్రాలపై స్వారి చెయ్యడం ఆనందంగా వుంటుంది. కాని పులుల భయం వల్ల అది సులభ సాధ్యం కాదు. గుర్రాలకు పులులవల్ల అపాయం కలుగుతుంది. ఆ అపాయం కలగకుండా - రాత్రులు గుర్రాలచుట్టూ సైసులు (గుర్రపు వాళ్లు) లాంతర్లు పెట్టుకొని, నెగడులు వేసుకొని కాపలా కాస్తారు.

కుక్కలను చూచినా ఏనుగులు అసహ్యపడి, వాటి మీదికి తొండం విసురుతవి; కుక్కలను చూస్తే వాటికి భయం కూడాను. ఇలా ఉన్నప్పటికీ ప్రతీ అడవి మకాములోనూ రెండో, మూడో

కుక్కలు వుండే తీరుతాయి. అవి, కావలి కాచడానికీ, పరిసరాలను పరిశుభ్రంగా ఉంచడానికీ ఉపయోగిస్తాయి. అడవుల్లో వీటిని వేటకు ఉపయోగించడం అరుదు. మకాముల నుంచి కొంచెం దూరం వెళ్లా యంటే వీటిని చిరుతపులులు తినివేస్తాయి. సాధారణంగా క్యాంపుల లోని కుక్కలను చిరుతపులులు తినివేసిన వార్తలు వినబడుతూనే ఉంటవి.

ఏనుగులూ, కుక్కలూ స్నేహంతో వుండడం నే నెరుగను. కాని, మకాములలో వుండే ఏనుగులు కొన్ని కుక్కలజోలికి పోకుండా వుంటవి. అక్కడి కుక్కలూ ఏనుగులను చూచి మొరగవు. కాని, అవి ఏనుగుల తొండాలకూ, కాళ్ళకూ అందుబాటులో లేకుండా దూరంగానే వుంటాయి. ఏనుగులకూ, కుక్కలకూ పరస్పర ద్వేషం కలగడానికి కారణం ఫలానా అని తెలియడం లేదు. కుక్కలు తమ తొండాలను కరచి వేస్తాయనే భయం ఏనుగులకు ఉండవచ్చునేమో! కాని, ఆ విధంగా జరగడం ఎప్పుడూ సంభవించదు.

పాము కాటువల్ల పిల్లయేనుగులు చచ్చిపోతూ ఉంటాయన్ని మావటివాళ్ళ నమ్మకం. నాకు తెలిసినంతవరకూ పామును చూచి ఏనుగు భయపడలేదని చెప్పగలను. పాము కాటువల్ల అవి చచ్చిపోయి నట్లు తగిన ఆధారాలు కానరాలేదు. పాము కరిస్తే ఏనుగు దేహం మీది వెంట్రుకలు రాలిపోతాయని బర్మీయుల నమ్మకం! దీనిని నమ్మ డానికి కూడా తగిన ఆధారం కనబడలేదు.

ఎలుకలను చూస్తే ఏనుగులు భయపడతాయనే నమ్మకం గాఢంగా వున్నది. ఇది నమ్మడానికి వీలులేని సంగతి. ఒకవేళ ఏనుగు ఎలుకను చూచి భయపడితే – ఆ చిన్న ప్రాణి తన తొండంలో ప్రవే శించి, బిరడా పెట్టినట్లుండిపోతుందనే కారణంవల్ల ఏనుగు భయపడి

వుండవచ్చు. కారణం లేకుండానే భయపడడం ప్రాణులలో వున్నది. స్త్రీలు చాలామంది ఎలుకలను చూచి భయపడడం కద్దు. దానికి తగిన హేతువూ వుండదు.

అసాధారణములైన సంఘటనలవల్ల ఏనుగులు భయపడవు. ఉరుములు ఉరుముతూ వర్షం పడుతూవుంటే కుక్కలు భయపడినట్లు ఇవి భయపడవు. అడవుల్లో కార్చిచ్చు వ్యాపించినా ఏనుగులు ఆందోళన చెందక నెమ్మదిగానే ఉంటవి.

ఇతర దేశాల్లో కార్చిచ్చులు భయంకరంగా వుంటాయి; కాని బర్మాదేశంలో అలా వుండవు. బర్మాలోని ప్రతి అడవిలోనూ వసంత కాలంలో ఏప్రిలు చివరగాని, మే నెల ప్రారంభంలోగాని సాధారణంగా నిప్పంటుకుని నేల పరిశుభ్రం అవుతుంది. గడచిన ఆకు రాల్పు కాలంలో రాలిన ఆకులు ఎండి, వాటంతట అవి అంటుకోవడంవల్ల మంటలు ఏర్పడుతాయి. వాటి ఫలితంగా ఆకులూ, అలమలూ, ఎండి పడిన రెమ్మలూ, కొమ్మలూ కాలిపోతాయి. ఇట్టి అగ్ని వలన పచ్చగా వుండే చెట్లకు అపాయం ఏమీ కలగదు. గాలి వున్నా, ఈ మంటలు నేలపైనే మెల్లగా ప్రాకుతూ, గంటకు రెండు మైళ్లకంటె ఎక్కువ దూరం వ్యాపించవు. ఆకులు అంటుకొన్న ఆ మంటలు మెల్లమెల్లగా నేలపై వ్యాపించి, ఎండిపోయి తమకు అందుబాటులో వుండే కొమ్మలను కాల్చి వేస్తాయి.

ఎండిపోయిన కయాంగ్ (Kaing) గడ్డి వున్నచోట్లలో కార్చిచ్చు భయంకరంగా వ్యాపిస్తుంది. కాని, యీ గడ్డి సామాన్యంగా నీటి వనరుల తీరాన్నే పెరగడంవల్ల, మంటలు ఆ గడ్డిని కాల్చడంతో చల్లారి పోతాయి. ఆయాప్రవాహాల హద్దులను దాటి అవతలివైపు వ్యాపించవు.

ఎండుటాకులు కాలి నేల మీదనే వ్యాపించు అగ్నివల్ల ఏనుగులకు భయం లేదు. పెంపుడు ఏనుగులు నిర్భయంగా వాటి ప్రక్కనుంచీ, మధ్యనుంచీ నడిచి వెళ్లిపోతాయి. బరువైన ఏనుగు పాదం పడడంతోటే ఆ మంటలు ఆరిపోతాయి. ఆకుల కింద నిప్పులున్నందున-ఆ ఏనుగులు నడుస్తూ వున్నంతసేపూ అవి అణగారిపోతూ వుంటాయి. అందువల్ల ఏనుగుల పాదాలు కమలిపోవడంగాని, పొక్కడంగాని జరగదు.

'కయాంగ్' గడ్డి అంటుకొని మంటలు శీఘ్రంగా వ్యాపిస్తాయి. ఆ మంటలు వ్యాపించేముందు ఏనుగులకూ, మిగిలిన అడవిమృగాలకూ ఆ సంగతి తెలుస్తుంది. అవి మంటల ధ్వనినిబట్టీ, వాసననుబట్టీ మంటలు ఏవైపు వ్యాపిస్తున్నదీ గ్రహించి, వెంటనే అవి సమీపానవున్న నదిని దాటి ఆవలివైపు వెళ్లిపోతాయి. గాలి ఏ దిక్కుకు విసురుతున్నదీ, మంటలు ఏ విధంగా ప్రయాణం చేసేదీ ఏనుగులు మనుష్యులకన్న కూడా సులభంగా గ్రహించగలవు.

కొత్త గడ్డి మొలవడంకోసం నేను చాలాసార్లు నేలను ఖాళీ చెయ్యడానికి 'కయాంగ్' గడ్డి వుండే ప్రాంతాలకు నిప్పు అంటించేవాడను. నిప్పు అంటించడానికి ముందు ఆ దగ్గరవుండే ఏనుగులను మరొక చోటికి పంపవలసిన అవసరం కనబడలేదు. నిప్పు యొక్క ధ్వని విని, వాసనను పసిపట్టి అవి వెంటనే ఏలాటి హంగామా పడకుండా అక్కడినుంచి వెళ్లిపోయాయి. ఏ ప్రదేశాలు ముందుగా కాలిపోయి, తిరిగి ముందు చేరడానికి అనుకూలంగా వుంటాయో వాటికి బాగుగా తెలుసును. బాగుగా వానలు పడిన తర్వాత కొద్ది కాలానికే-కాలిపోయి నల్లగా వుండే ఆ ప్రదేశాలు లేతగడ్డి చిగుళ్ళతో పచ్చలు పరిచినట్లు కలకలలాడుతూ వుంటాయి.

స్వాభావికమైన ఉపద్రవంవల్ల ఏనుగులు భయపడడం నేను ఒకే ఒకసారి గమనించాను. అదిన్నీ, అవి సన్నపు ప్రవాహామార్గంలో ప్రయాణం చేస్తూవుండగా హఠాత్తుగా పొంగి పొర్లి మీద పడుతూ వున్న వరదవల్లనే! దీనికి తోడు ఎడతెరిపిలేక వర్షం కురుస్తూవుండడం, భయంకరంగా ఉరుములుఉరమడం ఆ భయానికి మరీకారణమైనాయి.

నేను ఒకమారు కాంతి ప్రాంతంలో ఒక ప్రవాహ మూల స్థానంనుంచి మరొక స్థానానికి దగ్గర దారిని ప్రయాణం చెయ్యదలచి నాను. ఎనిమిది చిన్న ఏనుగులతో కూడా, ఆ మార్గాన వెళ్ళితే మాకు రెండు వేల అడుగుల ఎక్కుడు తగ్గుతుంది. ప్రక్కనుండే పెద్ద ప్రవాహం చేరుకోవచ్చును కూడా. అది సెప్టెంబరు నెల. కడచిన మే నెల నుంచీ నేను ప్రతిదినమూ జ్వరంతో బాధపడుతూనేవున్నాను. ఇప్పుడు ఆ అడవిలోని నా ప్రధాన నివాసానికి, అక్కడ అధమం వారం రోజులపాటు విశ్రాంతి తీసుకోదలచాను. ఈ ప్రయాణంలో నేనెంతో ఉత్సాహంగా వున్నాను. ఊజీలు పాడుతూ, ఈలలు వేస్తూ వినోదంగా వున్నారు. ఏనుగులతోపాటు మేము ఒకరి వెనుక ఒక రముగా వెళ్ళసాగాము.

ఆ చిన్న ప్రవాహ మార్గానికి ఇరువైపులా రాతిమయంగా ఉన్న గట్లు ముప్ఫయి అడుగుల ఎత్తున ఉన్నవి. వాటిమీద వెదురు పొదలున్నవి. ఆ మార్గం రమారమి మూడు మైళ్ళున్నది. ప్రవాహం చాలా స్వల్పంగా కాలి చీలమండ మునిగే మాత్రంగా ఉన్నది. కాని, మేము మైలుదూరం వెళ్ళేసరికి ఉరుములతోను, మెరుపులతోను భయంకరంగా వర్షం వచ్చితీరే సూచనలు కనబడ్డవి. ఏనుగులు తమ శరీరాలను కొంత వరకూ వెనుకకు తిప్పి, ధైర్యహీనతను వెల్ల డించాయి. అవి వెనుకవైపుకు తలనుత్రిప్పి చూడడానికి వీలులేదు.

శరీరాన్ని సగం తిప్పితేనేగాని వెనక ఏమున్నదీ చూడలేవు! అను కున్నట్టుగానే వర్షం పడి మేము నడుస్తున్న దారిలో ప్రవాహం అధికమై మోకాలులోతు వరద వచ్చింది. నీరు ఏనుగు పిల్లల పార్శ్వ భాగాల వరకూ వ్యాపించినది.

అంతకంటె ఎక్కువ ప్రవాహం రాదని కొంచెం సేపటి వరకూ మేము అనుకున్నాము. తొందరగానే నడక సాగిస్తున్నాము. కాని, మానవులు గ్రహించలేని విషయాలను ఏనుగులు గ్రహిస్తాయి. ఎక్కువ ప్రవాహం వస్తున్నట్లు అవి గ్రహించాయి. మావటీలు కొంతవరకూ అదుపులో పెట్టకపోతే, అవి చాలా బెదరిపోయి వుండేవి. అప్పుడు చాలా క్లిష్టపరిస్థితి ఏర్పడింది. వెనక్కు పోవడానికి గాని, ప్రక్కలకు తప్పుకోవడానికిగాని కొంచెమైనా అవకాశంలేదు. ఇంకా మేము ఒక మైలు వెళ్ళవలసివుంది. సంతతధారగా వర్షం పడుతూ వుంది. ప్రవాహం బురదనీటితో అంతకంతకూ వృద్ధి అవు తున్నది. ఏనుగులు భయంవల్ల ఘీంకరించ సాగినవి. ఒక పిల్ల యేనుగు ఏ క్షణంలోనైనా కొట్టుకుపోయేటట్టు కనబడింది. నా చంకలవరకూ నీరు వచ్చింది. నేను నా పిస్తోలును రెండు చేతులతోనూ పైకెత్తి పట్టుకొని వున్నాను.

ఆ మైలుదూరమూ ఎన్నో మైళ్లున్నట్లు తోచింది. మలుపు తిరిగాక మలుపు రావడంతప్ప అంతం కానరాలేదు. ఆ మైలు దూరమూ ప్రయాణం సాగితే, ఆ ప్రవాహం ఒక చిన్న ఏటిలో కలుస్తూవుండడంవల్ల మేము ప్రక్కకు తప్పుకోవడానికి సాధ్యమవు తుంది. చీకటి కోణంలో కొట్టుమిట్టాడుతున్న మాకు రక్షణమార్గం లభిస్తుంది. ఇంతలో ప్రవాహంనుంచి దూలాలు కొట్టుకొని వస్తూ ఏనుగుల కాళ్లను డీకొనే ప్రమాదం సంభవించింది. ఏనుగులు వెనక

కాళ్ళతో ఒక్కతోపు తోసి, ప్రక్కకు వాటిని నెట్టి ఆ అపాయం తప్పించుకొనేవి.

అదృష్టవశాత్తూ మేము చివరిమలుపు తిరిగి, యీ ఇరుకు ప్రవాహంనుంచి ప్రక్కనున్న నదిని చేరుకున్నాం. పిల్లయేనుగులు నీటిపై తేలుతూ వచ్చినవి. విశేషం ఏమిటంటే - మేము బయలు దేరినతర్వాత మరి ఒక అరగంటకు ఆ నదికి - కొంత ఆలస్యంగా ప్రవాహం వచ్చింది. అలాగునకాక ముందుగానే వచ్చివున్నట్లయితే- రెండు ప్రవాహాలూ ఏకమై మా వస్తువాహనాలు సర్వమూ నాశనమై వుండేవి.

తర్వాత ఏనుగులు మెల్లగా, అ నదిగట్టు ఎక్కి, ఇక భయం లేదనే ధైర్యంతో ఠీవిగా నిలిచాయి. వాటి చూపునుబట్టి అవి నన్ను అసమర్థుడనని ఆక్షేపిస్తున్నట్లు తోచినది !

## ౧౦

దుష్టస్వభావం గల మానవులనలెనే దుష్టస్వభావంగల ఏనుగు లున్నా అరుదుగానే ఉంటాయి. అయినా సాధుస్వభావం కలవాటికి కూడా ఒకప్పుడు చెడ్డబుద్ధి పుట్టవచ్చును. మిక్కిలి బరువైన వస్తువు లను లాగేటప్పుడు చికాకువల్ల ఏనుగులకు విపరీతబుద్ధి పుట్టుట కలదు. ఆ సమయంలో అవి కఱ్ఱనుగాని, రాతినిగాని తొండంతో తీసి దగ్గ రున్నవాళ్ళమీద - ముఖ్యంగా తమకు పనిని కల్పించినవాళ్ళమీద విసరివేస్తాయి. ఆ అపాయాన్ని తప్పించుకోవడానికి వేగంగా అక్కడి నుంచి పారిపోవలసి వుంటుంది.

నాకు పరిచితుడూ, సహోద్యోగీ అయిన ఒక ఐరోపీయుడు సెలవుమీద ఇంటికిపోయి, తల్లితోనూ, సోదరితోనూ లండనులోని జంతుశాలకు వెళ్లాడు. వాళ్లు ఏనుగులను ఉంచినవైపు వెళ్లారు. అక్కడ ఒక ఆడేనుగు ఉన్నది. దాన్నిగురించిన భోగట్టాను ఆ యువకుడు వివరిస్తూ "ఈ యేనుగును కూర్చోపెట్టేదా ?" అని అడిగాడు. వాళ్లు 'సరే' అన్నారు. ఈ వేడుక చూడడానికి మరికొందరు అక్కడికి చేరారు.

బర్మీయుడైన ఊజీ స్వరంలో అతడు 'హ్మిట్' (కూర్చో) అని అన్నాడు. ఏనుగు తోకమాత్రం ఆడించి, అరటిపళ్ళకోసం నోరు తెరుచుకుంది. అతడు మళ్లీ 'హ్మిట్' అన్నాడు. ఏనుగు దాన్ని లక్ష్యం చెయ్యలేదు. దానికి ఎక్కువ కోపమూ కలిగింది. ఐరోపీయుడు పదేపదే 'హ్మిట్, హ్మిట్, హ్మిట్' అని అంటూ దాన్ని రెచ్చకొట్టాడు.

అతనిని గమనించడానికి ఇష్టం లేకపోయినా, ఆ ఏనుగు తలను తిప్పి, చెవులను ఆడించి, అతనివైపు నిదానించి చూచింది. ఆ చూపులో "ఏమి నీవున్నూ బర్మానుంచి వచ్చినవాడవేనా ?" అనే ప్రశ్న వ్యక్తమవుతూ ఉన్నది. అది వెంటనే తన తొండంతో తన లద్దెను తీసి అతని మీదికి విసిరికొట్టింది అతడు అది తనమీద పడకుండా తప్పించుకున్నాడు గాని, ఆ లద్దె అతని తల్లి టోపీని రాసుకొని, వెనకవున్న గోడమీద పడింది. ఈ పనికి ఎవ్వరికీ నవ్వురాలేదు. మరుక్షణంలో అక్కడ ఒక్కరూ నిలవకుండా పారిపోయారు. ఏనుగుల కోపమూ, స్వాభిమానమూ అట్టివి !

దుష్ట స్వభావంగల ఏనుగులలో మగవీ, ఆడువీకూడా వుండవచ్చును. కొన్నిటికి పుట్టుకతోడనే దుష్టస్వభావం కలగవచ్చును.

మదించివున్న మగయేనుగుల మనస్సు చాలా అస్థిరంగా వుంటుంది. జత కట్టడానికి పూర్వం మరొక మగయేనుగుతో పోట్లాడి, దానిని చంపడమే, మగయేనుగు మదించిన దనడానికి లక్షణమని నా అభిప్రాయం! జతకట్టినంత మాత్రాన దాని ఉద్రేకం తగ్గదు. తాను ప్రేమించి జత కట్ట దలచిన పిడిఏనుగుకోసం - దానిని ప్రేమిస్తున్న మరొక ఏనుగును తరిమి, చంపినపుడే దానికి తృప్తి కలుగుతుంది.

ఏనుగులు మదించివున్న సమయంలోనే వాటి ఊజీలను చంపడం అధికంగా కనబడుతుంది. అప్పుడు, అవి కారణం లేకుండానే - తొండంతో కొట్టియో, దంతాలతో పొడిచియో అతన్ని పడగొట్టి మోకాలితో చంపుతవి. మదమెక్కిన గజము తన మావటీనిని క్రింద పడదోసి, మీదపడుతుంది. ఈ విధంగా ప్రవర్తించిన ఏనుగు అపాయకరమైనదని తెలియజెయ్యడానికి దాని మెడకు ఒక లోహపు గంటను కడతారు. ఆ ధ్వనిని విని అందరూ జాగ్రత్తపడతారు. మరి మూడేళ్ళ దాకా ఆ ఏనుగు దుర్మార్గంగా ప్రవర్తించకపోవచ్చును. తర్వాత అది హఠాత్తుగా తన క్రొత్త మావటివానిమీద పడి, వానిని చంపడమూ జరగవచ్చును.

విచిత్రం ఏమిటంటే - ఇలాటి దుష్టగజాలకైనా మావటివాళ్ళు సులభంగా దొరుకుతారు. అపాయకరమైన ఏనుగులను అధిరోహించడం చాలామంది మావటివాళ్ళు ఘనంగా భావించి, ఎంతో ధైర్యంతో ఆ పనికి అంగీకరిస్తారు. వాళ్ళు తమ జీవితాన్నిగాని, ఏ వస్తువునూ, ఎవ్వరినీగాని లెక్కచెయ్యరు. తరచుగా వాళ్ళు నల్లమందు సేవిస్తూ వుంటారు. అయినా తమ పనిని శ్రద్ధతో చేస్తారు. వాళ్ళను గురించి పల్లెపడుచులందరికీ బాగా తెలుసును. వాళ్ళు ప్రాధాన్యాన్నీ, ప్రఖ్యాతినీ సంపాదించినా, చెడిపోవడానికి అవకాశం తక్కువ.

మామూలు మావటివాళ్ళకంటె ఇట్టి ధైర్యసాహసాలు కలవాళ్ళకు అంత ఎక్కువ జీతం వుండదు.

ప్రమాదకరమైన ఏనుగును గమనించడానికి ఇట్టి మావటి వానితోపాటు సహాయుడుగా గొప్ప పోటరి ఒకడు ఉంటాడు. ఏనుగు దయాదాక్షిణ్యాలపైని ఆధారపడి వున్న మావటీనిని ప్రతి నిమిషమూ భద్రంగా చూడడమే ఇతని పని. ఇతడు చేతితో బల్లెమును పట్టుకొని వున్నా, ఇతని దృష్టికే ప్రాధాన్యం వుంటుంది. పోటరి తన దృష్టిని ఏనుగుమీదే ఉంచును. వీరిద్దరూ కలిసి, దుష్టగజాన్ని అదుపాజ్ఞలలో వుంచడం సాధారణంగా సాధ్యమవుతుంది.

దుష్టస్వభావంగల ఏనుగులు బర్మీయులవంటివి. బర్మీయుడు జూదంలో బాకీపడిన స్వల్పమొత్తంకోసం ఉద్రిక్తుడై తన మిత్రుణ్ణే బాకుతో పొడిచి, ఆ వెంటనే ఎంతో పశ్చాత్తాపపడతాడు. ఆ విధంగానే దుష్టగజం ఉద్రేకంతో మావటీనిని చంపి తర్వాత విచారిస్తుంది.

ఆనో (Ah Noh - ఇది సయాందేశపు పేరు) అనే ఏనుగు పదిహేనేళ్ళలో తొమ్మండుగురు మావటివాళ్ళను చంపింది. అయినప్పటికీ దానికి కొత్త ఊజీలు దొరకడంలో శ్రమలేకపోయింది. అది యెప్పుడూ తన మనిషిని దంతాలతో పొడిచి చంపేది. దాని తలపైన మావటివాడూ, ఇరువైపులా బల్లెములతో సిద్ధంగా ఇద్దరు సహాయులూ ఉంటేనేగాని, దానిని ఎప్పుడూ సరంజాముతో ప్రయాణం చేయించడం జరిగేదికాదు.

దంతాలవల్లనే చాలా ప్రమాదాలు కలగడంవల్ల 'ఆనో' దంతాలను మొదలంటగాని, సాధ్యమైనంత పొట్టిగాగాని కోసివెయ్యడానికి తీర్మానించాము. అది క్రూరకార్యం. అందువల్ల వర్ణించడంకూడా

కష్టం. ఏనుగును పూర్తిగా లోబరచుకుని యీ పని చేయ్యడం చాలా శ్రమ. ఈ పని నా పర్యవేక్షణలోనే జరిగింది. దంతాలకోత సక్రమంగానే జరిగింది. కాని రెండు పెద్దనరాలు బయటికి వచ్చాయి. మేము తగిన చికిత్సచేసి, వాటిని సరిచేశాము. కోసిన దంతాలు మరి మొలవ లేదు. కాని, వాటిచివర అందమైన గుబుర్లు తయారయ్యాయి. అది ఒక అసాధారణమైన ఏనుగు! అడవి యేనుగుల్లోగాని, పెంపుడు ఏనుగుల్లోగాని అటువంటిది కానరాదు. మామూలు స్థితిలో అందరూ దానిదగ్గరగా పోయి నోటికి అరటిపండు అందించవచ్చును. అప్పుడు దానిప్రవర్తన చాలా ఉత్తమంగా తోస్తుంది. అడవిలో అది మేస్తూ వున్నప్పుడు నేను అనేక పర్యాయాలు దానిదగ్గరగా పోయివున్నాను. అది ఎన్నడూ నాపై పడడానికి స్వల్ప ప్రయత్నంకూడా చెయ్యలేదు.

నే నెరిగినంతవరకూ టా-సిన్ మా (Taw Sin Ma - అడవి యేనుగు) అనేదే మిక్కిలి దుష్టమైన ఏనుగు. అది పిల్లగా ఉన్నపుడు నే నెరగను. దాని నెవ్వరూ ప్రేమించలేరు. అందువల్లనే దానికట్టి పేరు కలిగింది. దాన్ని స్వాధీనం చేసుకొనేటప్పుడు చాలా క్రూరంగా ప్రవర్తించి వుండాలి. అది ఇరవై అయిదేళ్ళ వయస్సులో వుండగా తొలిసారి నేను చూచాను. ఐరోపీయులంటే దానికి చెప్పరాని అసహ్యం. ఇలాంటిభావం ఏర్పడడానికి కారణం కానరాదు. ఎవరూ వివరించనన్నా లేదు. ఐరోపీయు లెవ్వరూ దానికి శస్త్ర చికిత్స చెయ్యలేదు: దానికి కోపం కలిగేటట్లు ప్రవర్తించలేదు. దాన్ని పరిశీలనకు తీసుకుని వచ్చినప్పుడుకూడా ఒక చెట్టుకు గొలుసులతో కట్టివేస్తారు. మనిషి నూరు గజాల దూరంలో వుండగా చూచి, అది అతనిమీద పడ డానికి ప్రయత్నిస్తుంది, తన్ను కట్టిన స్థలం చుట్టూ తిరుగుతూ, గొలుసులు తెంచడానికి యత్నిస్తున్నా.

స్వరూప వేషాలనుబట్టి అది ఐరోపీయనులను గ్రహిస్తుంది. కాకీరంగు చొక్కా తొడిగి తేసరి, బర్మా ఊజీనయినా అది అనుమా నించి పైనపడుతుంది. ఈ విషయంలో నాకు మంచి అనుభవం ఉన్నది. అది నన్ను దూరంనుంచి చూచి, పై బడడానికి వెంటతరిమినది. నేను పరుగెత్తిపోయిన మార్గం పసిపట్టి నాలుగు మైళ్ళదూరం నేను ఒక జలమూల స్థానంనుంచి మరొకచోటికి పోతూవున్నా - వెంబడించింది. ఆ సంఘటన ఎంతో భయంకరమైనది !

నాకు దాన్ని చూడాలనే సంకల్పంలేదు. కాని, ఒక మకాము నుంచి మరొక మకామునకు వెళుతూ మేము హఠాత్తుగా దానికంట బడ్డాము. ఆ ఏనుగు మా మీదికి వచ్చింది. నా వెంటనున్న బర్మీయుడు బెదరి ఒకవైపు పారిపోయాడు. నేను మరొకవైపు రెండు మైళ్ళు పరుగెత్తాను. నేను సరియైన దారిలో వెళ్లానో లేదో, తిరిగి నా వెను కటి మకాముకు రాగలనో లేదో నాకు తెలియదు. దాని కట్లు తెగి పోవడమో, లేక విడిపోవడమో జరిగితే - చెట్టుఎక్కి కూర్చోవడం తప్ప నాకు మరొక రక్షణమార్గంలేదు. ఒకవేళ చెట్టు ఎక్కవలసివస్తే, నేను దానిపైని ఇరవైనాలుగు గంటలకు ఎక్కువకాలమే వుండవలసి వుంటుంది. అది కాలికట్లతోవుంటే - నేను దానికంటె వేగంగా ముందుపోగలను. దానికి కట్లుండడం నా అదృష్టమే ! అదీకాక దాని మెడలో ప్రమాదాన్ని సూచించే ఇత్తడిగంట వున్నది. (మామూలు ఏనుగులకు కర్రగంటలే వుంటాయి లెండి.) ఒకప్పుడు ఆ యేనుగు నాకు సమీపంలో వున్నట్లూ, మరొకప్పుడు దూరంగా వున్నట్లూ ఆ గంటయొక్క ధ్వనివల్ల తెలిసేది. అడవుల్లోని ధ్వనులు మోసగించేవనీ, తమాషాలు కల్పిస్తాయనీ నాకు తెలుసును. ఆ సమయంలో నాకూ తమాషా అయిన యుక్తి తోచింది. పోతూ, పోతూ మన దుస్తులలో దేనినైనా పడవేస్తే వెంట తరిమే ఏనుగు దాన్ని పట్టుకుని, దానిపై

కోపంచూపి, కొంతసేపు ఆగవచ్చును. ఇంతలో పరుగెత్తేవారు చాలా దూరం వెళ్లిపోవచ్చు.

ఇలా ఆలోచించి, ఆహారపదార్థా లుంచుకునే నా సంచిని నేను పడవేసిపోయాను. తర్వాత నన్ను వెంట తరుముకుని వస్తున్న ఏనుగు యొక్క గంటచప్పుడు వినబడలేదు. పిదప నేను ఎత్తయిన ఒక గట్టు పై భాగంమీదకు ఎక్కి కొన్ని క్షణాలు నిలిచి, అది ఎలావస్తున్నదీ తెలుసుకోదలచాను. తర్వాత ఆ గట్టుమీదనుంచే అతివేగంగాపోయి, మిక్కిలి నిట్రమై దిగసాధ్యంకాని స్థలంనుంచి కిందికి దిగదలచాను. ఏమంటే - అలాంటి స్థలంనుంచి దిగడానికి ఏనుగు జంకుతుంది. నేను అక్కడ నా కాకీరంగు చొక్కాను విప్పి పడవేసినాను. ఆ యేనుగు తన కసినంతా ఆ చొక్కామీద తీర్చుకుంటుందని నా తలంపు. దానితో అది తృప్తిపడవచ్చు. కాని, నేనాగట్టునుంచి కిందికి దిగి ఒక ప్రవాహ మార్గాన్ని చేరుకునేసరికి చెట్లయొక్కయు, వెదుళ్ళయొక్కయు పెద్ద ధ్వని వినబడినది. మీదికి చూడగా టూసిన్-మా తన పిరుదులమీద కూర్చుని కిందికి జారసాగినది. అది నాకంటే వడిగా వస్తున్నట్లు కన బడింది. నేను విడిచిన చొక్కా దాన్ని కొంచెంసేపైనా ఆపినట్లు కానరాలేదు. అది దానిని నోటితో పట్టుకునే వస్తున్నది. నన్ను పట్టు కున్న తర్వాత, దాన్ని నమిలి మింగుదామనీ అనుకున్నదో ఏమో! అడవులలో - ప్రమాదం సంభవించినపుడు తొందరపడి పరుగెత్త కూడదు. పరుగెత్తితే ముళ్లూ, తీగలూ మున్నగు వాటివల్ల ఆత్మ రక్షణకు ఇంకా క్లిష్టపరిస్థితి ఏర్పడుతుంది. ఈ సంగతిని అప్పుడు జ్ఞాపకం తెచ్చుకున్నాను. కాని యిప్పట్లో అది సాధ్యమా? నేను నా బనియనును తీసి పారవేద్దామనుకున్నాను. అలా చేస్తే ధరించడానికి ఏమీలేక మొరడులాగు వుండవలసి వస్తుందని వూరుకున్నాను. నేను పరుగెత్తిపోతూవుంటే అదృష్టవశాత్తూ ఇద్దరు మనుష్యులు కనబడ్డారు.

వారు పడిపోయిన ఒక టేకుమ్రాకును రంపంతో కోస్తున్నారు. 'టాసిన్‌మా !' అని ఒక్కమాటమాత్రం నానోటంట వచ్చింది. వాళ్ళు నన్ను మరేమీ ప్రశ్నించకుండా నాతోపాటు పలాయనం సాగించారు. వాళ్లే ముందుపోసాగినారు. అందువల్ల నేను సరైన దారిలోనే వస్తున్నట్లు తెలుసుకుని తృప్తిపడ్డాను.

ఆ యిద్దరిలో ఒకడు ముందుగా మా బసకుపోయి నా వృత్తాంతం అక్కడివారికి చెప్పాడు. నేను అక్కడికి వెళ్లేసరికి మావటి వాళ్లూ, వాళ్ళ కుటుంబాలవాళ్లూ కులాసాగా మాట్లాడుకుంటూ వున్నారు. నన్ను చూడగానే వాళ్లు విరగబడి నవ్వుకున్నారు. కొందరు ఆనందంతో తమ చేతులతో తుంట్లను చరుచుకున్నారు. టా-సిన్-మా మావటి, మాంగ్-పో-నెట్ (Maung Po Net - రాత్రివలె నల్లని వాడు) మాత్రం తన లుంగీని మడిచి కట్టుకుని, తన ఏనుగును కలుసుకోడానికి బయలుదేరాడు.

బర్మీయులు ఎగతాళి చేసేటప్పుడు, మనమూ వాళ్లతో చేరవలసినదే! మరోమార్గం లేదు. నేను పరిహాసంచేసినా, వాళ్లు నాతో చేరేవారు. అందువల్ల నేనూ వాళ్ళతోపాటు నవ్వుతూ, తుంట్లు చరుచుకున్నాను !

మరొక గంట సేపటికి ఒక ఊజీ నా సంచీని, చొక్కాను తెచ్చి యిచ్చాడు. అవి చినిగిపోలేదు, సరిగదా - నలగనన్నా లేదు. మాంగ్ పో - నెట్, టాసిన్ - మా పై ఎక్కి మకాముకు వచ్చాడు. వాని యొక్కయూ, ఆ ఏనుగు యొక్కయూ ముఖలక్షణాలను బట్టి చూస్తే మర్నాడు కూడా ఇలాగే జరిగేటట్లు తోచింది. కాని, అలా జరగలేదు. మరునాడు, దాని కాలి బందాలతోపాటు కట్టి వుంచడానికి ఇరవై అయిదు అడుగుల గొలుసు ఇచ్చాను. అది ఎక్కడ తిరిగినా - ఆ గొలుసు దానితో వుండవలసిందే!

కొందరు మావటివాళ్లు తమ ఏనుగులకు చిత్రమైన ప్రవర్తన నేర్పుతారు. దానివల్ల వాటి సహజస్వభావం ఎట్టిదో బోధపడదు. బోగ్యీ (Bo Gyi - గొప్ప మనిషి) అనేది ఏనుగు తిరగబడడంలో అది పేరు పడింది. దానిని పట్టుకుని మకాముకు తీసుకువచ్చుటకు ప్రయత్నించేటప్పుడు అది తన మావటివాని మీద తిరగబడుతుంది. కాని, కొంత సేపటికి - పది అడుగులు వేసి నిలబడి, తన కాలి బంధాలు విప్పడానికి సమ్మతిస్తుంది. అప్పుడది మేకపిల్ల వలె ఎంతో విధేయతతో వుంటుంది. మరే మావటీనిపై నయినా అది తిరగబడితే, వాడు నిలుచున్న పాటున పరుగెత్తి పోవలసిందే! అది యిలాటి పద్ధతికి అలవాటు చెయ్యబడినట్లు తర్వాత తర్వాత తెలిసింది. ఎలుగుబంటువల్ల దాని మావటివాడు చనిపోయాక, అతడు చచ్చిపోయాక యీ ఏనుగు నెల్లాళ్ళపాటు ఇష్టం వచ్చినట్లు తిరిగింది. ఎవ్వరూ దాని యెదట పడలేక పోయేవారు. దానిని పట్టుకోవడం అసాధ్యమని తోచింది. అందువల్ల, దానిని పట్టుకొన్న వారికి రు. 300 బహుమానం ఇస్తామని ప్రకటించాను. నవయౌవనంలో వున్న ఒక పల్లెటూరి చిన్నవాడు, నా వద్దకు వచ్చి "అయ్యా! నేను మీ నౌకరిలో మనిషిని కానుగదా! మరి నేను ఆ ఏనుగును పట్టి తెస్తే నాకు బహుమానం యిస్తారా?" అని అడిగాడు. "తప్పకుండా యిస్తా"నని అన్నాను. మరి రెండు రోజులకు వాడు ఆ ఏనుగుపై ఎక్కి, ఆనందోత్సాహాలతో మకాముకు వచ్చి, తన బహుమానం తీసుకున్నాడు. వాడు దీన్ని ఎలా స్వాధీనం చేసుకుంటాడో కనిపెట్టడానికి నేను ముందుగానే ఇద్దరు మనుష్యులను పంపాను. వాళ్లు సంగతులు గ్రహించి తెలియజేశారు. దీనిలో రహస్యం ఏమిటంటే - చనిపోయిన మావటివానికి ప్రియురాలైన ఒక బాలిక ఉన్నది. ఈ ఏనుగుకు దానితో చనవు వుంది. ఆ చిన్నదాని మూలంగా ఈ చిన్న వాడికి ఆ ఏనుగు లొంగినది! ఈ

చిన్నవాడు ఆ బాలికకు నూతనప్రియుడు. వాళ్లిద్దరూ పెళ్లిచేసుకుని, కొత్తకాపురం పెట్టడానికి నే నిచ్చిన బహుమానం ఉపయోగ పడింది.

పరిసరాల్లో రాజకీయాల ననుసరించి కల్లోలం చెలరేగినపుడు ఎనభై మంది మావటివాళ్ళు ఒకప్పుడు సమ్మె చేశారు. ఆ సమయంలో నేను ఆరు దుష్టగజాలను లొంగ దీసుకోవలసి ఉన్నది. వాటిలో ఒక్కొక్క దానిని లొంగ తీసుకోవడానికి ఒక్కొక్క కిటుకు వున్నది. కొన్నిటికి దగ్గరగావుండాలి. కొన్ని ఉపాయాలు ఏనుగులకు దూరంగా వుంటేనేగాని ఫలించవు. కొన్నిటికి ఎదుట ఉండాలి. కొన్ని కిటుకులు అవి కూర్చున్నపుడూ, కొన్ని అవి నిలిచి వున్నపుడూ పనిచేస్తాయి. ఆ విధంగా ఊజీలు వాటికి అలవాటు చేశారు. ఆ కిటుకులు తెలిసిన వారొక్కరూ నా దగ్గరలేరు; వారు సమ్మెలో చేరారు.

ఎలాగైతేనేమి, ఐదేనుగులు స్వాధీనమయాయి. చివరిది 'టో హైన్' (Toe Hline-The Destroyer = ధ్వంసకము) అనే ఏనుగు. సమ్మె చేసిన వారిలో ఒకనికి లంచం యిచ్చే పక్షంలో, వాడు దాన్ని లొంగదీసి తెస్తాడని నా ప్రతినిధి మూలంగా తెలిసినది. ఆ సొమ్ముతో అతడు తాను కోరిన బాలికను పెండ్లాడి, పిదప పనిలో ప్రవేశించాలని అనుకున్నాడు.

'టో హ్లైన్'ను ఎవరైనా పట్టుకుంటే చాలునని నాకు అనిపించింది. అది చాలా క్రూరమైనది. అడవులలోని ధాన్యపు గాదెలను (కొట్లను) అది ధ్వంసం చేసేది. అది నేనుండే కుటీరం యొక్క పరిసరాల్లోనే మేస్తూ వుండేది. నాది వెదుళ్లతో నిర్మింపబడిన కుటీరం. దాని రాటలు చాలా బలహీనమైనవి. అది చూడడానికి ఒక ధాన్యపు కొట్టులాగే వుంటుంది. ఏక్షణంలో అయినా ఆ యేనుగు దీనిపైని పడవచ్చును. అందువల్ల - దాన్ని పట్టుకొన్న వానికి కొంత సొమ్ము

బహుమానంగా యివ్వడానికి నేను నిశ్చయించాను. వాడు ఆ ఏను గును ఎలా పట్టుకునేదీ నేను పరిశీలిస్తూనే వున్నాను. అతడు 150 గజాల దూరంలో వున్నప్పుడే రెండుసార్లు అది పైని పడింది. అది స్వాధీనం కాదనే నేను నిశ్చయించుకున్నాను. కాని అలా తిరగ బడడం - మావటీడు, ఏనుగు - ఒకరి నొకరు దగ్గరగా చూసుకో వడం, మామూలుగా అనుసరించబడే పద్ధతి మాత్రమే అనీ, నిజంగా పై బడడం కాదనీ త్వరలోనే గ్రహించాను. తర్వాత అతడు గొంతికిలా కూచుని దాన్ని సమ్మతింపజేసే స్వరంతో 'హ్మాట్, హ్మాట్, హ్మాట్, హ్మాట్' అని పిలిచాడు. ఈ విధంగా పావుగంట సేపు జరిగింది. ఏనుగు అతన్ని లక్ష్యం చెయ్యలేదు. లక్ష్యం చెయ్యక పోయినా, అది మేత మేస్తూనే ఒక కన్ను అతని మీద వుంచుతూనే వున్నది. ఉన్నట్టుండి అది మేతమాని నిలిచిపోయింది. తర్వాత మెల్లగా అతడు వున్న వేపు వచ్చి, ఆసక్తితో చెవులు ముందుకు పెట్టి కూర్చోడానికి నిశ్చయించింది.

అలా వుండీ కూడా దానిని అధిరోహించడానికి ఎంతో ధైర్యం వుండాలి. ఆరోహకుడు 'హ్మాట్, హ్మాట్' అని అంటూనే కిందికి వంగి దాని కట్లు విప్పాడు. సాధారణంగా ఏనుగు నిలబడి వున్నప్పుడే బంధం విప్పుతారు. ఇప్పుడు, అది కూర్చుని వుండగానే విప్పవలసి వున్నది. తర్వాత అతడు దానిపై కెక్కి 'టా' (Htah-నిలబడు) అని అన్నాడు. 'టోష్లైన్' లేచి మకాం వైపు బయలుదేరింది. ఈ ఆఖరి ఏనుగుకూడా స్వాధీనమైనదనే ఆనందంతో నేను పానీయం గ్రహించి పండుగు చేసుకున్నాను. అప్పుడు నేను ఎనభై మంది కొత్త మావటి వాళ్ళనూ కూర్చుకున్నాను, సమ్మేదారులు అందరూ విస్తుపోయారు.

'టోష్లైన్'ను స్వాధీనం చేసుకున్నవాడు తాను కోరిన అమ్మా యిని పెళ్లి చేసుకుని, నా వల్ల ధనాన్ని బహుమానంగా గ్రహించాడు.

తర్వాత 'టోహెన్' పూర్వపు మావటి 'పోలోన్' (Polone) వచ్చాడు. అతడు వంచకులలో గట్టివాడు. అతడు వచ్చి "అయ్యా! నేను నా మిత్రుడు బహుమానం పొందేటట్లున్నూ, అతడు తాను కోరిన కన్యను పెండ్లాడేటట్లున్నూ చేశాను. నేను అనుకున్న పని నెరవేరింది. మళ్ళీ పనిలో ప్రవేశించదలచాను. నా ఏనుగును నా కిప్పించండి" అని అన్నాడు. ఆ యేనుగు అతనికి అప్పగించ బడింది. ఆ యిద్దరు మావటి వాళ్ళూ తమలో తాము ఏదో ఏర్పాటు చేసుకున్నారు. సమ్మెకు శైథిల్యం కలిగించానని నేను తృప్తిపడ్డాను.

మరొకప్పుడు మరొక చిత్రం జరిగింది. షాన్ జాతికి చెందిన ఇరవై యేళ్ళ యువతి క్రూరగజాన్ని స్వాధీనం చేసుకున్న సంఘటన అది! 'క్యాక్ సెయిన్' = Jade Coloured Eyes = నీలిరంగు కన్నులు కలది) అనే దుష్టగజం మాంగ్ - చాన్ - తా (Maung Chan Tha) అనే కుంతధారిని ఆ నాటి మధ్యాహ్నం దంతాలతో పొడిచి వేసింది. అతడు చాలా ప్రమాదస్థితిలో వున్నాడు. అందువల్ల నాటి సాయంత్రం నేను మకాములోని నా కుటీరంలో చాలా కలతపాటుతో కూర్చుని వున్నాను. ఆ యేనుగు మాంగ్ - పో - యిన్ (Maung Poyin) అనే మావటీనిని చంపబోతూ వుండగా, అతన్ని కాపాడాలనే వుద్దేశంతో ప్రయత్నించగా, ఆ గజం మాంగ్ - చాన్ - తాను పొడిచి వేసింది. అది మదంలో వుంది. ఆ పరిసరాల్లో తిరుగుతున్నది. పాపం! కుంతధారి దెబ్బతిన్నా మావటీనిని రక్షించ లేకపోయాడు. ఆ ఏనుగు అతన్ని చంపివేసింది!

నేను, నాతోవున్న ముఖ్యుడైన బర్మీయుడితో ఆలోచిస్తున్నాను. దెబ్బ తిన్న మాంగ్ - చాన్ - తాను ఆసుపత్రికి పంపడం ఎలాగా? అని. అతడిని బలమైన గాయాలు కడుపునకు తగలడం వల్లా,

కాలు విరగడం వల్లా - ఏనుగుపై ఎక్కించి పంపడం సాధ్యంకాదు. అలా పంపితే బలవంతంగా అతన్ని చంపడమే అవుతుంది. వెదురు డోలీలో పరుండ బెట్టి పంపితే - ఆసుపత్రి చేరడానికి ఐదు రోజులు పడుతుంది. ఈలోగా అతని స్థితి ఎలావుంటుందో!

ముందుగా తెలుపకుండానే - హఠాత్తుగా - అందంగా వున్న ఒక పొడుగాటి ఆడమనిషి నా కుటీరంలోకి వచ్చింది. ఆమె, చనిపోయిన మావటి వాని యొక్క భార్య అని వెంటనే గుర్తుపట్టాను. ఇలాంటి పరిస్థితుల్లో - ఇట్టి స్త్రీలు దుఃఖంతో కుమిలిపోతూ ఏడ్వడం తమ కడసారి బిడ్డను తీసుకుని వచ్చి, అధికారుల యెదుట మోకరించి కూర్చోవడం సంప్రదాయం. కాని, యీమె అలా చెయ్యలేదు. ఆమె ఎట్టి విచారాన్నీ వ్యక్తం చెయ్యకుండానే ధైర్యంతో "అయ్యా! నా భర్త అయిన మాంగ్ - పో - యినును ఉద్యోగం నుంచి తొలగించినట్లు అధికారపత్రం యిస్తారా?" అని నన్ను అడిగింది.

"సరే. తప్పకుండా యిస్తాను. రేపటి వరకూ కాస్త నిరీక్షించి వుంటే నష్టపరిహారాన్ని కూడా చెల్లిస్తాను. మొదట మాంగ్-చాన్-తాను ఆసుపత్రికి పంపించవలసి వున్నది," అని జవాబు చెప్పి, ఆమెకు కలిగిన కష్టానికి అమిత విచారాన్నీ, సానుభూతినీ తెలిపి, ఆమెకు బిడ్డలున్నారేమో అని వాకబు చేశాను.

ఆమె పలుకలేదు. నా చెంతవున్న బర్మీయుల పెద్ద ఆమెకు బిడ్డ లెవ్వరూ లేరని సమాధానం చెప్పాడు. మర్యాదలను వేటినీ పాటించకుండా ఆమె వచ్చి అవిధేయతగా ప్రవర్తించి నందుకు తన అసంతృప్తిని వెల్లడించి 'నీవు ఇప్పుడు వెళ్లిపో. నేను వచ్చి మాట్లాడతానులే' అని చెప్పి, ఆమెను అక్కడినుంచి పంపివేశాడు.

ఆమె వెళ్లిపోయాక నేను అతనితో "ఆమె పో-యిన్ యొక్క భార్యయేనా?" అని అన్నాను.

'అవునండి. ఆమె అతనికంటె ఎక్కువగా నల్లమందు సేవిస్తుంది. అందుచేతనే ఆమెకు బిడ్డలు కలగలేదు" అని అతడు జబాబిచ్చాడు.

నాకు చాలా ఆశ్చర్యం కలిగింది! షాన్ జాతి స్త్రీ నల్లమందు తినడం అంతవరకూ నేను వినలేదు. ఆ బర్మీయుల పెద్ద "సందేహం లేదు. మీ రీరాత్రి పది టికాలుల (Ticals - ఒక విధమైన తూనిక ప్రమాణము) నల్లమందు నాచేతి కివ్వండి. రేపుదయం ఆమె 'క్యాక్ సెయిన్'ను స్వాధీనం చేసుకుని తీసుకు వస్తుంది. పో-యిన్ నల్లమందు నిషాలో వున్నప్పుడు చాలా సార్లు ఆమె ఆ యేనుగును తీసుకుని రావడం నేనెరుగుదును" అని చెప్పి నాలో ఎంతో సంచలనం కలిగించాడు!

నేను అతను కోరినట్లే నల్లమందు ఇచ్చాను. ఆ రాత్రి ఎంతో కలతపడిన మనస్సుతోనే పరున్నాను. తెల్లవారకముందే తెలిసింది చాన్-తా చనిపోయాడని. అందువల్ల మనస్సు మరీ సంక్షోభపడినది!

మర్నాడు ఉదయమే బర్మీయుల పెద్ద కలుసుకున్నాడు. కాని, నేను అతనిని ఏమీ అడగలేదు. ఏమి జరగబోయేదీ ఎదురు చూస్తూ మాత్రం వున్నాను.

పది గంటల సమయంలో అతడు వచ్చి "మాక్యా"(Makyaw-పో-యిన్ భార్య) క్యాక్ సెయిన్‌ను అధిరోహించి వస్తున్నది. మీరు వచ్చి చూడవచ్చును" అని అన్నాడు. ఆమె ఆ ఏనుగు మీద ఎక్కి మకాము వైపు పోతూవుంటే చూచి, నా కన్నులనే నేను నమ్మలేక పోయాను. ఆమెను చూస్తూవుండగా, తక్కిన ప్రపంచమే మరపునకు

వచ్చింది. ఆమె నల్లని జుత్తు వెనకవైపు వేళ్లాడుతున్నది. ఆమె నీలి రంగు టమైను (Tamain-ఒక విధమైన చేతులులేని పొట్టి జాకెట్టు) ధరించి వున్నది. ఆమె భుజాలు తళతళ లాడుతున్నవి. ఆమెదృష్టి తిన్నగా-ముందు వైపునే ప్రసరిస్తూ వుండెను. ఆ దృశ్యాన్ని కొంచెం సేపు మాత్రమే చూచి, లోపలికి పోయాను. తర్వాత పన్నెండు గంటలకు వార్త వచ్చింది-క్యాక్‌సెయిన్ భద్రంగా ఒక చెట్టుకు కట్టబడిందని. మదించివున్న ఏనుగులను ఆ విధంగా బంధించడమే సంప్రదాయం !

ఆ సాయంకాలం 'మాక్యా' నా వద్దకు వచ్చింది. ఆమె అప్పుడు చక్కని దుస్తులు ధరించి వున్నది. రంగురంగుల టమైను ధరించి వున్నది. దానిపైని తెల్లని కోటు ధరించి, నల్లని శిరోజములమీద ఒక పూవు పెట్టుకొన్నది. ఆమె మోకాళ్ళపై కూర్చుండి మూడుసార్లు షికో (Shiko = వందనం) చేసి, నా యెదుట కూర్చున్నది. ఆమె తల వంచుకుని, తాను కూర్చున్న చాపమీదనే దృష్టిని నిలిపి, కుడిచేతిలో వున్న చిన్న కర్రపుల్లతో ఏమేమో రాస్తూవున్నట్లు ఉన్నది.

నేను ఆమెకు రావలసిన పరిహారాన్ని చెల్లించాను. అంతేకాక, క్యాక్ సెయినును పట్టుకొని తెచ్చినందుకు ప్రత్యేకంగా బహుమతిని ఇచ్చాను. నేనీ సంగతిని చెప్తున్నప్పుడు ఆమె పెదవులలోంచి ఒక మందహాసం బయలుపడ్డది. తర్వాత ఆమెకోరిన అధికార పత్రాన్ని వ్రాసి యిచ్చాను. అపాయాలవల్ల మరణించిన వారి విషయమై ఇట్టి పత్రాలు వుండడం అక్కడి ఆచారం! అవి వుంటేనే గాని మరణించిన వారి ఆత్మలను అచటి వనదేవతలు స్వీకరించవని అక్కడివారి నమ్మిక. నేనీ విధంగా వ్రాశాను-"క్యాక్‌సెయిన్ అనే ఏనుగుకు మావటీడైన మాంగ్-పో-యిన్‌కు, అతడు కోరిన స్థలానికి వెళ్ళడానికి

యిందు మూలంగా అనుమతి నిస్తున్నాను. అతనిని నా దగ్గరి ఉద్యోగం నుంచి తొలగిస్తున్నాను." ఇలాగున వ్రాసి, సంతకం చేసి యిచ్చాను.

నేను నా టేబిలు దగ్గరనుంచి లేస్తూ అనుమతి పత్రాన్నీ, సొమ్మునూ ఆమెకు అందియ్యగా మాక్యా బొల్లి యేడుపుతో రెండు కన్నీటి బిందువులు రాల్చి, మూడు సార్లు వందనం చేసి, లేచి 300 గజాల దూరంలో-కయ్యకు అవతలవైపున వున్న మకాముకు వెళ్ళి పోయింది.

తర్వాత ఏమి జరిగేదీ నిరీక్షిస్తూ, నాలో నేను ఊహిస్తూ ఒక దినం గడిపాను. తర్వాత క్యాక్ సెయినుకు కొత్త మావటివానిని ఏర్పాటుచేసే విషయమై, బర్మీయుల పెద్దతో సంప్రతించాను. అతడిలా అన్నాడు - "ఆ విషయమై ఏర్పాటు జరిగింది. మాంగ్ — న్వే — గ్యా (Maung Ngwe Gyaw) అనే నల్లమందు భాయి వున్నాడు. అతడు మాక్యాను చేరదీశాడు. క్యాక్ సెయిన్ - అందరికంటె ఎక్కువ నల్ల మందుతినేదని వాళ్లు చెపుతున్నారు. మీరు దయచేసి పది టికాలుల నల్లమందు ఇస్తే సరి, అంతా సరిపడుతుంది" అని.

అలాంటి క్లిష్ట సమయంలో పది కాదు, అడిగితే ఇరవై అయినా ఇవ్వడానికి నేను సిద్ధంగా వున్నాను.

'మాక్యా' నల్లమందు తింటుందని ఇప్పటివరకూ కూడా నాకు నమ్మకం లేదు. ఆమె దృఢసంకల్పంకలది. ఆమె చేత్తో నల్లమందు అందిస్తే క్యాక్ సెయిను చక్కగా తీసుకుంటుంది. ఆమె చేతి వాసనను అది ఎరుగును, ఆమె తన మావటివాని భార్య అని బాగా తెలుసును. ఆ యేనుగును పట్టుకొనడానికి ముందు ఆమె దానికి పూర్తిగా మైకం కలిగించి వుంటుందని నేను అనుకున్నాను.

అడవిలోని యేనుగుల స్వభావం వింత అయినది. వాటిలో అన్నీ కఠినమైనవీ, క్రూరమైనవీ, దుష్టమైనవీ కావు. నూటికి ఒక్కటి మాత్రమే క్రూరమై తన మావటివానిని ఎదిరించడం గాని, చంపడం గాని చేస్తుంది, తక్కిన తొంభై తొమ్మిదీ మచ్చికపడి ఎంతో స్నేహంతో ప్రవర్తిస్తాయి.

౧౧

ఏనుగులు మున్నగు మహామృగములు వుండే అడవిలో నేను పాతిక సంవత్సరాలు గడిపాను. మొదటి మూడున్నర సంవత్సరాలలో తుపాకితో జంతువులను కాల్చడంలో ఎంతో వుత్సాహం వుండినది. అప్పుడు నా కండ్లకు మాయ కప్పినట్లుండినది. నేను సంపాదించిన అనుభవాన్ని బట్టి యిప్పుడు—ఏనుగులు దేవుని స్వంతమనీ, వాటి నెన్నడూ వేటాడకూడదనీ దృఢమైన నిశ్చయజ్ఞానం కలిగింది.

అరణ్య నివాసంలోని మొదటి మూడున్నర సంవత్సరాల తర్వాత ఇలాంటిపని చెయ్యకూడదనే అభిప్రాయం ఏర్పడింది. అడవులపైనీ, అడవిమృగాలపైనీ గౌరవ భావం ఏర్పడింది.

నాకు బాగా జ్ఞాపకం వున్నది. ఒకప్పుడు నేను మణిపూర్ నదీ ముఖప్రాంతంలో - ఒంటరిగా తిరుగుతున్న ఒక మగ ఏనుగును పట్టుకోవడంకోసం రెండు నెలలపాటు ప్రతిదినమూ ప్రయత్నించాను. ఎంతో శ్రమపడినా, ప్రతిదినమూ ఆశాభంగం అయేది. ఆ యేనుగు పేరు 'ష్వేకా' (Shwe kaw). బర్మా బాలిక అంగభంగిమాలు ప్రదర్శిస్తూ, చేతులనూ, వ్రేళ్ళనూ మీదికి - బయటికి ప్రసరిస్తూ నాట్యం చేసి ఆనందాన్ని కూర్చినట్లుగా ఈ యేనుగు దంతాలు మీదుగా, బయ

టికి వ్యాపించి మనోహరంగా వుండడంవల్ల - ఆ అభిప్రాయంతో నా వద్ద వుండే మావటివాళ్ళు ఆ యేనుగుకు ఈ పేరు పెట్టినారు. అది మా యేనుగులు రెండింటిని దంతాలతో గాఢంగా పొడిచి వేసింది. మా యేనుగులకు ఎప్పుడూ చికాకు కలిగిస్తూనే వుంటుంది. మా మావటీలు చాలామంది తమ ఏనుగులను పట్టుకోడానికి అడవుల్లోకి వెళ్లినప్పుడు - ధైర్యంగా తిరుగుతున్న ఆ ఏనుగును - చూచారు. వాళ్ళు తమ చేతులను తిన్నగా పొడుగ్గా చాచి దాని దంతాల తీరునూ, కొలతనూ వర్ణించి చెప్పారు. అవి ఎంత లావుగావుండేదీ తెలియడానికి - మోకాలి మీదిభాగాన్ని చేతులతో పట్టుకొని చూపారు. అవి అద్భుతమైన దంతాలు !

ఆ సమయంలో నేను తక్కిన అడవియేనుగులను పట్టుకోడానికి ఎన్నో అవకాశాలు ఉండినవి. అలావున్నా, వాటిని విడిచి 'ష్వేకా'ను పట్టుకోవాలనే దృఢనిశ్చయానికి వచ్చాను. నేను దాన్ని రెండుసార్లు చూచాను. కాని అప్పుడు దాన్ని గుండుతో కొట్టే స్థితిలో లేను. తర్వాత ఒక నెల్లాళ్ళు సెలవుమీద వెళ్ళాను. తిరిగి మే నెలలో అక్కడికి రాగలననీ, అది తుపాకీవేటకు అనుకూలమైన సమయమనీ నాకు తెలుసును.

ష్వేకాను నేను పట్టుకోగలిగితే, అది నా నాలుగో ఏనుగా తుంది. జాడలు కనిపెట్టడంలోనూ, తుపాకీవేటలోను ఆరితేరినవాడనున్నా కాగలను.

ఒకనాటి సాయంకాలం మేము సినీవా (Sinywa - అడవి యేనుగుల పల్లె) చేరుకున్నాం. ష్వేకా ఆ చుట్టుప్రక్కలనే ఉన్నదనీ, ముందురోజు కొందరికి కనబడిందనీ, వారు దానిని రెండు మైళ్ల దూరంలోవున్న నదికి అవతలిగట్టున చూచారనీ నా సహచరులు తెలియజేశారు.

మాకు స్పష్టంగా ఒక పెద్ద ఏనుగుయొక్క అడుగు జాడలు కనబడినవి. అవి ష్వేకాకు సంబంధించినవే అని నేను ఊహించాను. అవి మ్యిత్తానది గట్టువరకూ వ్యాపించి వున్నాయి. రాత్రివేళ ఆ యేనుగు నదినిదాటి మేము బసచేసివున్న వైపువచ్చి వుంటుందని స్పష్టంగా తెలుస్తున్నది. మేము ఈ విషయం తెలుసుకునేసరికి పగలు పన్నెండు గంటలు దాటింది. ఎండ ఎంతో తీవ్రంగా ఉంది.

నేనప్పుడే ఫలాహారం చెయ్యడానికి కూర్చున్నాను. కొంచెం నోట్లో వేసుకునేసరికి ఒక బర్మీయుడు వచ్చి - తమ మకాముకు 300 గజాల దూరంలో - తాము అప్పుడున్నస్థలానికి మైలుదూరంలో - బ్రహ్మాండమైన అడవి యేనుగు ఒకటి వున్నదనీ, అది బహుశః ష్వేకా అయి వుండవచ్చనీ తెలిపాడు.

ఏ మాత్రమూ సందేహించకుండా వెంటనే బయలుదేరాను.

మూడు గంటలప్పుడు - సొమ్మసిల్లజేసే మండుటెండలో నేను దాని సమీపానికి - చెవులు కొట్టుకున్న చప్పుడు వినిపించేటంత సమీపానికి చేరుకున్నాను. మరేచప్పుడూ వినబడలేదు. పన్నెండడుగుల ఎత్తు "ఏనుగు గడ్డి"లో అది మేస్తూవున్నది. దాని అడుగుల జాడను బట్టి లోపలికి పోవడానికి సాహసించాను. నా ఎడమవైపు ఏటిగట్టు చాలా దగ్గరగానే వుంటుందని నాకు తెలుసును. ఏ మాత్రమైనా నెమ్మది చెడితే అది తన అడుగుజాడలను బట్టి వెనకకు వస్తుందని నాకు తెలుసును. అందుకని, నేను దాని అడుగుజాడలకు కొంత ప్రక్కగా తప్పుకుని ఒక చిన్న చెట్టుకు నా పిస్తోలును చేరబెట్టి, ముఖంమీది చెమటను తుడుచుకున్నాను. నేను నా ఫ్లాస్కులోని నీళ్ళు తాగి దప్పి తీర్చుకున్నాను. ఆ రోజు తప్పక తుపాకి ప్రేల్చవలసి వుంటుందని నిశ్చయించుకున్నాను.

నేను ఆ స్థలంలో వున్నట్లు ఆ యేనుగు పసిపట్టింది. ఆ సంగతిని గ్రహించిన వెంటనే నాలో కలవరం కల్గింది. ఇలా పసిపట్టి తెలుసుకోవడం ఏనుగులకు పరిపాటి. అది తన తొండం చివరతో గట్టినేల మీద గట్టిగా కొట్టింది. ఆ ధ్వని కఠినమై, కంగుమనే గంటధ్వనివలెనే-మరచిపోదామన్నా మరపునకు రాకవున్నది. తర్వాత నిశ్శబ్దం! నిలిచిన చోట అలాగే వుండడంతప్ప నాకు మార్గాంతరం లేదు. మేమిద్దరమూ అలాగే వుండిపోయాం. కాని, ఏనుగే తర్వాత దారితీసి, నేనుండే స్థలాన్ని దాటుకుని ముందు పోయింది. నేను నదీతీరంవైపు వెళ్లాను. నేను ఊహించిన దానికంటె దగ్గరగానే వుంది. దాని వొడ్డున కయాంగ్ గడ్డి మొలిచివున్నది. ఒడ్డు నీటిమట్టానికి ఎనిమిదడుగుల ఎత్తుగా వుండి, ఇటీవలనే జారిపోతూవున్నది. ఆ వొడ్డును చేరడం సాధ్యంకాదు. చేరితే క్రిందపడిపోయే అపాయం కలగవచ్చు. కొద్ది క్షణాలలోనే నీళ్లను మీదికి త్రుళ్లించిన పెద్దధ్వని వినబడింది. పొడుగాటి ఆ గడ్డిలోంచి చూడగా - నాకు దిగువవైపు ఏభై గజాల దూరంలో బ్రహ్మాండమైన ఒక మగయేనుగు కదను తొక్కినట్లుగా నడుస్తూ చాలా వేగంగా ఏటిని దాటుతూ కానవచ్చింది. అది త్రుళ్లగొట్టిన నీరు దాని శరీరం నిండా వ్యాపించి వున్నది.

ఏ మాత్రమూ జంకక నేను ఎనిమిదడుగుల ఒడ్డునుంచి నీటిలోకి ఉరికాను. నీరు మూడడుగుల లోతే ఉన్నది. కాని, జోళ్ళతోకూడా నా కాళ్లు బురదలో కూరుకుపోయాయి. నేను కదలలేకపోయాను. ఇట్టి స్థితిలో కాకపోతే తుపాకి పేల్చడం మరి ఎన్నటికీ సాధ్యంకాదు. ఆ యేనుగు వేగంగా పోతూవుండడంవల్లా, నీరు మీదికి చిమ్మబడుతూ వుండడంవల్లా దాని గుండెకు గురి చూచి కొట్ట నిశ్చయించాను. కాలు నిలవతొక్కుకోవడం కష్టమైపోయింది.

ఆ యేనుగు డెబ్బై అయిదు గజాల దూరంలో వుండగా నేను తుపాకి ప్రేల్చాను. అది కొంచెం తొట్రుపడినా వెంటనే తేరుకొని పోలో గుర్రంవలె గుండ్రంగా అల్లాడి, వెళ్లినదారినే వెనకకు వచ్చింది. అది నాకు ఇరవై అయిదు గజాల దూరంలోవుంది. దానికి విపరీతంగా కోపం కలిగింది. ఆ కోపంలో, అది నన్ను చూడలేదు. నేను అలాగే నిలిచిపోయాను. గట్టు ఎక్కగలననే ఆశ లేకపోయింది. కొన్ని నిమిషాలక్రిందట, నీటిలోకి దిగినచోటనే అది గట్టెక్కినది! అది దెబ్బ తిన్నట్లు నేను గ్రహించాను. 'ష్వేకా' దంతాల మాదిరిగా దాని దంతాలు పెద్దవిగానూ, వర్ణించిన విధంగా కొంచెం వంగివున్నట్లూ కానరాలేదు.

నేను మరొకసారి గుండెకు గురిచూచి కొట్టాను. ఈ సారి సరిగానే దెబ్బతగిలింది. ఆ యేనుగు ఏటిగట్టుపైని పడిపోయింది. నా వెంట నున్న పిల్లవాడు ఇంతసేపూ గట్టుమీద వున్న ఒక చెట్టుపై వున్నాడు. నేను బురదనుండి తప్పించుకుని వచ్చేలోపల - ఆతడు ఆ ఏనుగును పరీక్షించడానికి వెళ్ళి తొందరగా వెనక్కువచ్చి "అమాయ్, అమాయ్ (**Amai-Amai** = అమ్మో, అమ్మో) మీరు క్యాన్‌జిత్‌ను (**Kyan Zit**) చంపివేశారు" అని ఏదో విచిత్రం జరిగినట్లు గట్టిగా అరచి నాతో చెప్పాడు.

ఆ మాటలు వినగా నాకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. కాని, వాడు ఏ అభిప్రాయంతో అన్నదీ గ్రహించాను. అప్పుడు నాలుగు న్నర గంటలయి వుంటుంది. ఎండతీవ్రత తగ్గలేదు. నేను అడవి యేనుగు జయించిన చిహ్నంగా ష్వేకా యొక్క దంతాలను గ్రహించ దలచాను. కాని, దానిని నేను స్వాధీనం చేసుకోలేక పోయాను. మరొక ఏడాదివరకూ, మరొక ఏనుగును కొట్టడానికి నాకు

అనుమతిలేదు. కాని, నేను చంపిన ఏనుగు యొక్క తలను చూసే సరికి నా నిరుత్సాహమంతా మాయమైపోయింది. అలాటి జంతువు చాలా అరుదుగా వుంటుంది. అది యిదివరకే మావటి వాళ్లందరికీ ఎంతో ఆందోళనను కలిగించింది. అందువల్ల దీనిని చూడడానికి వాళ్లు మకాామునుంచి గుంపులు గుంపులుగా వచ్చారు.

'క్యాన్‌జిత్‌ను గురించి వింత వింత కథలు వున్నాయి. అందరూ ఆతురతతో 'క్యాన్‌జిత్, క్యాన్‌జిత్, క్యాన్‌జిత్' అని అరిచేసరికి, దాన్ని గురించిన విచిత్రతమమైన కథ యథార్థమైనదిగా వారు భావించినట్లు తోచింది.

నేను ఖడ్గమృగాన్ని చంపినా ఇంత ఎక్కువగా ఆశ్చర్యపడి వుండను. 'క్యాన్‌జిత్' అనే మాట అరుదుగా వుండే దంతాలనుగూర్చి వర్ణించేది. చెరకుగడ కున్నట్లుగా ఆ దంతాలకు కొంచెం ఉబ్బెత్తుగా వలయాలు ఏర్పడి ఉంటాయి. అలాటి దంతాలుగల ఏనుగులు కథల్లో వస్తాయనీ, అయినా అరుదుగా కానవస్తాయనీ బర్మీయులు చెపుతూ వుంటారు. క్యాన్‌జిత్ జాతి యేనుగు ఏనుగులకు రాజనీ, దాని బల పరాక్రమాలను చూచి మిగిలిన ఏనుగులు భయపడి, విధేయతగా వుంటాయనీ వారి నమ్మకం.

దాని దంతములు మొదటి నుంచి చివరి వరకూ వలయాలు కలిగి వుంటాయి. ఆ దంతాలను కోసివేసినా-తిరిగి మొలిచినప్పుడు వలయాలు ఏర్పడతాయి. కాని, చాలా తగ్గుదలలో వుంటాయి. ఆ తర్వాత ఈ దంతాల యొక్క ఛాయాచిత్రం ఒకటి "బొంబాయి నాచురల్ హిస్టరీ జర్నల్" అనే పత్రికలో ప్రకటించ బడింది. దంతాల్లో యిలా వలయాలు ఏర్పడడానికి తగిన కారణం బోధపడ లేదు. రెండు దంతాలకూ ఈ విధంగా వలయాలు క్రమపద్ధతిలో

వున్నందున-వికార స్వరూపం అని చెప్ప వీలుకాదు. బర్మాలో మచ్చిక పడి వేలకొలదిగా వున్న ఏనుగులలో ఒక దానికిన్నీ యీ విధమైన దంతాలు కానరావు.

నేను దాని కాలుమీద కూర్చుని కొంచెం నీరు త్రాగి ఆందోళనతోనూ, పశ్చాత్తాపంతోనూ దానివైపు చూచాను. 'ఈ యేనుగు తన దంతాలతో నాకేమి హాని కలిగించింది? నేను దాని విషయంలో చేసిన పని యేమి?" అని నాలో నేనే ప్రశ్నించుకున్నాను.

ఆ యేనుగు చుట్టూ మూగిన మావటివాళ్లు ఆ దంతాలను ఆశ్చర్యంతో చూస్తూ దీర్ఘంగా చర్చలను సాగించారు. మకామునుంచి మావటీల పెద్ద - దాని దంతములను కొయ్యడానికి ఒక చిన్న గొడ్డలితోను, వాడికత్తులతోనూ వచ్చాడు. 'క్యాన్‌జిత్'ను చూడడానికి మకాములోని స్త్రీ లందరూ పిల్లతోనూ, చంటిబిడ్డలతోనూ వచ్చారు.

నేను బసకు వెళ్లి తేనీటినీ, ఫలహారాన్నీ తీసుకుని తిరిగివచ్చి దంతాలకోత మున్నగు వాటిని గమనిస్తూ వుంటిని. దాని తోక వెంట్రుకలనూ, ముందు పాదాన్నీ భద్రం చేశాను. క్యాన్‌జిత్ పాదం వలె సరియైన పాదమూ, కాలిగోళ్లూ వున్న ఏనుగు మరొకటి నాకు కానరాలేదు. కాలి గోళ్లు తోమి పరిశుద్ధం చేసినట్లుగా ప్రకాశిస్తూ వున్నాయి. గోళ్ళ నడుమ వుండే మాంస గ్రంధులు, ఆ ఏనుగు తన జాతిలో ఉత్తమమనే సంగతిని వ్యక్తంచేస్తూ వున్నది.

దీనిని కొట్టడంతో నా తుపాకీ వేట పరిసమాప్తమైనది. ఆ తర్వాత నేను దేనినీ తుపాకితో కొట్టనూలేదు. అట్టి వుద్దేశంగల వారికి సాయపడనూ లేదు.

ఇప్పుడు నాకు యిష్టం లేకపోయినా, మొదటి రోజుల్లో తుపాకిని ఉపయోగించడానికి విచారపడే వాడనుకాను. అడవినీ, అడవిలో వుండే ఏనుగులనూ ప్రేమించడానికీ, అర్థం చేసుకోడానికీ ఆ జీవితమే యిచ్చింది! నేను నాలుగు ఏనుగులను చంపాను. కాని వందలకొద్దీ ఏనుగులకు అనేక విధాల సహాయం చేశాను. వాటి అభివృద్ధి కోసం పళ్ళుతరబడి పోరాడాను. యుద్ధం సంభవించినప్పుడు వాటితో కలిసి యుద్ధం చేశాను.

---

.

# రెండవ భాగము

## ౧౨

1925-26 సంవత్సరాల మధ్య నేను జనరల్, సర్. విలియం బర్డ్ వుడ్డుగారితో కలిసి వేటకు వెళ్లినాను. అప్పుడాయన ఇండియా సర్వసేనాధిపతిగా వుండేవారు. అతని బలగం ఎగువ చిండ్ విన్ నది దగ్గర వుండి, నేను సర్వసేనానినీ, అతని పరివారాన్ని సిట్టాంగ్ **(Sittaung)** దగ్గర కలుసుకున్నాను.

అప్పుడు బర్మా ఇండియా అధికారం కింద ఉండినది. అప్పుడా సర్వసేనాని ఇంఫాలునుంచి టామూ వరకూ కాలినడకను ప్రయాణం చెయ్యడమే ఎంతో దుస్తరమైనది. పద్దెనిమిది, ఇరవై సంవత్సరాలకు పర్పడిన యిప్పటి దారికీ, అప్పటి దానికీ కొంచెమైనా పోలికలేదు. ఇప్పుడు ఎంతో అభివృద్ధి పొందినది!

ఆయన తన బలగంతో అయిదు రోజులు ప్రయాణం చేసినట్లు నాకు జ్ఞప్తి వున్నది. ప్రయాణంలో ప్రతి ఒక్కరూ శరీరం కొంకర్లు పోయేటట్లు చేసే చల్లటి పర్వత ప్రవాహాల్లో ఈదవలసి కూడా వుండి నది. మార్గం ఆరడుగులు వెడల్పు కల్గి చిక్కగా వుంది; క్రమమైన పద్ధతిలో లేదు. ఇండియా యొక్క భావిరతుణనుబట్టి మాత్రమే

కాకుండా రాజకీయంగా కూడా ఈ మార్గానికి ప్రాధాన్యం వుంది. అప్పుడు బర్మాను ఇండియానుంచి వేరు పరచే సమస్య ప్రాధాన్యం వహించి వున్నది

ఇండియాకు పోయే ఈ మార్గాన్ని అభివృద్ధిపరచడం బర్మీయులకు ఎంతమాత్రమూ అభిమతంకాదు. ఇది మంచిరోడ్డుగా తయారైతే దీనిమూలంగా ఇండియనులు ఎడతెగకుండా బర్మాకు వలసవస్తారని వారి భయం! సముద్రంమీదనుంచి రాకుండా వారిని అటకాయించవచ్చును; కాని, రోడ్డుమీద వచ్చేవారిని అడ్డుకోవడం చాలా కష్టం. వర్తకానికా, యీ దారి వుపయోగపడదు. అందుచేత దీని అభివృద్ధి బర్మాకు మేలు చేకూర్చదని వారి అభిప్రాయం

1942 నుంచి 45 వరకూ జరిగిన బర్మా దండయాత్ర కంతటికీ యీ మార్గమే ఆధారం! బర్మానుంచి ఇండియాకు రావడానికి రెండే రెండు మార్గాలున్నవి. ఒకటి - సముద్రమార్గం! రెండు ఈదారిన్నీ. ఇవి కాక ఒకటి రెండు కొండదారు లున్నవి. అవి ఎగువ చింద్విన్ నదియొక్క ఉపనదులనుంచి ఉత్తర ఆసాము చేరుతవి. బర్మా — ఇండియా సరిహద్దులో బ్రహ్మాండంగా గోడపెట్టినట్లు పర్వతపంక్తులు వున్నవి. ఆరోహణకు అవి అసాధ్యాలు! అవి ఐరావతీనదీ లోయనుండి ఆసామును చేరకుండా చేస్తున్నవి. బర్మాలో సముద్ర ప్రాంతమైన అరకాన్ రాష్ట్రంనుంచి సముద్రతీరంగా రోడ్డు వెయ్యడమూ సాధ్యంకాదు. అందువల్ల బర్మానుంచి నేలమీదుగా ఇండియాను చేరడానికి - చింద్విన్‌కు మీదుగా కలేవా (Kalewa) వరకూ పోయి, ఆమీద కాబా (Kabaw) కనుమనుంచి టామూ (Tamu) కు పోయి, పర్వతపంక్తులను దాటి మణిపూరు ప్రాంతంనుంచి ఇంఫాలు (Imphal) సమతలాన్ని చేరవలసి వుంటుంది.

సైనికదృష్టితో పరిశీలించగా, ఈ మార్గం ఎంతో ముఖ్యమైన దని తెలుస్తుంది. బ్రిటిష్‌వారికి సముద్రంమీద అధికారం వున్నంత వరకూ సైనికంగాకూడా ఇది ప్రాధాన్యం కలదికాదు. ఈ మార్గం వల్ల రాజకీయంగా కొన్ని చిక్కులు సంభవించవచ్చును కూడా. కాని, యీ మార్గాన్ని అభివృద్ధిపరచడానికే జనరల్ బర్డ్‌వుడ్డుగారు అను కూలంగా వున్నట్లు తెలుసుకున్నాను. వార్తలను పంపడానికీ, తెప్పించుకోడానికీ దీని అభివృద్ధి ఎంతో అవసరం! ఈ ప్రయాణం ఆయనకు అపరిమితమైన ఆనందాన్ని కలిగించింది. ఈ ప్రయాణంలో ఆయన మామూలు దైనందిన కార్యక్రమంనుంచీ, అధికారిక లాంఛ నాల నుండీ తప్పించుకు తెరిపిగా ఉన్నాడు - చిన్నతనంలోవలె సాధా రణ సైనికోద్యోగిగానే ఉండి, ఒక నెల సెలవుమీద వున్నట్లు భావించు కుని సంతోషించాడు. ఆయన సతీమణి కలకత్తానుంచి రంగూనుకు సముద్రంమీద వచ్చి, అక్కడినుంచి మాండలేకు వెళ్లింది. అక్కడానె నీటిరంగు చిత్రాలు వేస్తూ కొన్నాళ్లువుండి, తర్వాత చిన్‌డ్విను‌కు వచ్చి భర్తను కలుసుకున్నది.

నేనప్పుడు వేటాడినది బాతులను మాత్రమే! ఏనుగులను వేటాడడమనే ప్రసక్తేలేదు!

నేను బర్డ్‌వుడ్డు దంపతులతో రెండు రోజులు మాత్రమే వుండ డానికి వీలు కలిగింది. అప్పుడు బొంబాయి, బర్మా కార్పొరేషనువారి చిన్న పడవ 'చిన్‌డ్విన్' నా స్వాధీనంలో వుండినది. అందు భోజన సామగ్రి మొదలైనవి తగినట్లు ఏర్పాటు చెయ్యబడినవి. ఆ షికారు నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది.

1942-44 లలో యుద్ధం జరుగుతూ వున్న సమయంలో బర్మానూ, ఇండియానూ కలుపుతున్న ఆ రహదారిమీద - సర్వ

సేనానిగా వుండిన లార్డ్ వేవెల్‌తో కలిసి ఫలాహారం చేశాను. తర్వాత సర్వసేనాధిపతిగా వుండిన సర్ క్లాడ్ ఆచిన్‌లెక్‌తో కలిసి విందారగించాను. ఇలా జరుగుతుందని నేనెన్నడూ అనుకోనేలేదు.

1938 లో నేను సెలవుమీద ఇంటికి వెళ్ళాను. యుద్ధం అనివార్యమని తోచింది. ఈ స్థితిలో బర్మాకు తిరిగి వెళ్లడమా, మానడమా అనే సందిగ్ధస్థితి నాకు ఏర్పడింది. ఏమైనాసరే అని బర్మాకు వెళ్ళడానికే నిశ్చయించుకున్నాను. ఒకవేళ యుద్ధము సంభవిస్తే జపాను శత్రుపక్షం చేరవచ్చుననీ, అప్పుడు నేను సూయజ్ కాల్వకు పడమట వుండడంకంటె తూర్పున వుండడమే ఉపయోగకరమనీ భావించాను.

1939 లో యుద్ధం ప్రారంభమైంది. ఉక్కుమాదిరిగా టేకు కలపకూడా యుద్ధసామగ్రిగా ప్రాధాన్యం వహించింది. టేకు కలప పనిలో నిమగ్నులైనవారంతా దేశానికి గొప్పసేవ చేసేవారుగా పరిగణింపబడ్డారు. యుద్ధంయొక్క ప్రాథమిక దశలో టేకుకలప విస్తారంగా ఇంగ్లాండుకు ఎగుమతి అయ్యేది. ఇటలీ యుద్ధరంగంలో ప్రవేశించాక మధ్య ప్రాచ్యానికి టేకు మిక్కిలి అవసరమైంది. ఒక్క ఇండియాకే ఎంతో కలప కావలసి వుండినది. కావలసిన మేరకు బర్మా టేకును సరఫరా చెయ్యలేకపోయేది. అడవుల్లో పని ఎంతో వేగంగా జరగవలసివుండినది. టేకు కలపనేకాకుండా తక్కిన కలపను కూడా రవానా చెయ్యడానికి ఏనుగులు ఎంతో అవసరమైనాయి.

యుద్ధంలో జపాను ప్రవేశించాక ఇండియాకు కలపయొక్క ఆవశ్యకత ఎంతో ఎక్కువైంది. 1941 డిసెంబరుకు తర్వాత అత్యధికంగా కొత్త ఉత్పత్తి కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. కలప పనికి సంబంధించిన ఉద్యోగులందరూ మూడు నెలలు అడవిలోనే వుండి

పోయారు. వాళ్ళలో చాలా మంది కుటుంబాలతో కూడా వచ్చారు. యుద్ధ పరిస్థితులు వాళ్ళకు నిస్తంత్రి (Wireless) మూలంగా తెలిసేవి. అప్పుడు జపానీయులు ఎంతో శీఘ్రంగా పురోగమించారు. అయినప్పటికీ వాళ్ళు సింగపూరుతోనూ, మలయాతోనూ ఆగిపోవలసి వస్తుందని ప్రతివ్యక్తీ అనుకునేవాడు. అయినా, పరిస్థితులు విషమించాయి. ప్రయివేటు వ్యాపార సంస్థ అయిన మా 'బొంబాయి బర్మా కార్పొరేషను' వారు తమ కంపెనీలో పనిచేసే ఐరోపీయులనూ, వారి కుటుంబాలనూ వెంటనే సురక్షిత స్థలాలకు చేర్చే ఏర్పాట్లు చెయ్యాలని తొందర తొందరగా హెచ్చరికలు చేశారు. ఆ ఐరోపీయులను ఎగువ చిన్‌డ్విన్ నుంచి మణిపూరునకూ, అక్కడి నుంచి ఆసాముకూ పంపవలసి వున్నది. దీనికై ఒక చక్కని పథకం ఏర్పరుపబడినది. మా దగ్గర ఏనుగులు లేకపోతే యీ తరలింపు పని సాధ్యమై వుండేది కాదు.

ఆ సమయంలో నేను నా భార్యతోనూ, కుటుంబంతోనూ షామ్ మాగాణాలలో (Sham States) ష్వేలీ (Shweli) నదీ ప్రాంతాల్లో తిరుగుతూ వుంటిని.

నాకు మా కంపెనీ నుంచి ఒక రహస్య లేఖ కూడా వచ్చింది. అందులో స్త్రీలందరూ వెంటనే కేంద్ర స్థలానికి తరలింపబడాలని గట్టి సలహా ఇవ్వబడింది.

చిండ్విన్ నదీతీరంలోని మొనీవా (Monywa) కు వెళ్ళాలనీ, ఆ పైగా వెళ్ళడానికి కూడా సిద్ధంగా వుండాలనీ నాకు టెలిగ్రాం కూడా వచ్చింది. వీరిని సురక్షిత స్థలాలకు పంపడానికి కంపెనీవారు ఎలాటి ఏర్పాట్లు చేసినదీ నాకు తెలియదు. ఆ దేశాన్ని గురించి బాగా తెలుసును కాబట్టి ముందు ఏమి జరగబోయేదీ నేను ఊహించాను.

బర్మాలోని ఆంతరంగికాలైన చిక్కులను బట్టియే నాకు యీవిధంగా సలహా ఇవ్వబడిందని నా ఆలోచన. నేను నిర్బంధంగా ఏనుగులతో నది వద్దకు వెళ్ళాను. తర్వాత మా చిన్న పడవలో దిగువకు రెండు రోజులు ప్రయాణంచేసి ఐరావతీ నదిని చేరాము.

యుద్ధం ప్రారంభమైనప్పట్నుంచీ ఏర్పడిన పరిస్థితులకు అల వాటుపడిన మాకు మాండలే (Mandalay) లో ఎలాటి మార్పులూ కనబడలేదు. మహిళల సహాయ సైన్యంలోని సభ్యురాండ్రు తప్ప మిగిలిన స్త్రీలూ, పిల్లలూ చిన్‌డ్విన్ వరకూ వెళ్ళిపోయారు. అందరూ ఎంతో బెదిరిపోయారు. ధనవంతులైన భారతీయులు అక్కడినుంచి బయలుదేరి పోతూనే వున్నారు.

నేను మాండలేనుంచి తిన్నగా మొనీవాకు వెళ్ళవలసివుంది. కాని, మొదట మా యింటికీ, మేమియో (Maymyo)లోని కేంద్రానికీ పోయి, ఒక రాత్రివుండి ఆ తర్వాతే మొనీవాకు వెళ్ళదలచాను. అక్కడ నా క్యాంపు సామాను వుంచివేసి, తేలికైన సామాను తేదలచుకున్నాను. ఇది, చిన్డ్‌విన్‌కు వెళ్ళేటప్పుడు నా భార్యకు కావలసి వుంటుంది! ఆమె నిర్బంధంగా బర్మాను విడిచిపెట్టి వెళ్ళే పరిస్థితి యేర్పడినపుడు నేను మేమియోకు రావలసి వుంటుందని అనుకున్నాను.

ఇట్టి పరిస్థితిలో మొనీవాకు పోయే రైళ్లూ, కలేవాకు పోయే స్టీమర్లూ ఇండియనులతో కిటకిటలాడుతూ వుండేవి. తమ ఐరోపీయోద్యోగులకు కుటుంబాలను చింద్విన్ వరకూ పంపడానికి తగిన చర్యలు తీసుకున్న సంస్థలలో మొట్టమొదటిది మా బొంబాయి బర్మా కార్పొరేషనే! అక్కడ యేదైనా ప్రమాదం జరిగే పక్షంలో, వారు సులభంగా అక్కడినుంచి పోగలరు. దూరదృష్టి గల కొందరు ప్రభుత్వో

ద్యోగులు కూడా తమ కుటుంబాలను పంపివెయ్యడానికి స్వంతంగా ఏర్పాట్లు చేసుకున్నారు. ఈ విషయంలో ప్రభుత్వం ఎట్టి చర్యలనూ తీసుకోలేదు. మీదు మిక్కిలి - మా కంపెనీ, తమ వుద్యోగస్థులలో కొందరికి మాత్రం కుటుంబాలను తరలించే సౌకర్యం కలిగించి పక్షపాతం చూపించినదంటూ విమర్శించింది. కాని, అత్యవసర పరిస్థితులు ఏర్పడినప్పుడు ప్రభుత్వం యీవిషయంలో పనిచేయ్యడానికి బొంబాయి బర్మా కార్పొరేషనే మార్గదర్శక మైనదని చెప్పాలి. ఉద్యోగస్థుల కుటుంబాలను దూరప్రదేశాలకు తరలించడంవల్ల, వాళ్ళు తమ కుటుంబాలను గురించి పడే ఆందోళనా, బాధ్యతా తగ్గి తమ పనులు సక్రమంగా చెయ్యడానికి వీలు కలిగింది.

మొనీవాలో, నేను స్త్రీల యొక్కయు, శిశువుల యొక్కయు రెండవ జట్టును కలుసుకున్నాను. మొదటి జట్టు చిన్డ్విను నదిలో మాలయక్ (Mawlaik) వరకూ ప్రయాణం చేసింది. అక్కడికి అందరూ చేరిన తర్వాత ఏమి చేయ నిర్ణయించేదీ తేలుతుంది. మొనీవా నుంచి వెనకకు రావాలని నా సంకల్పం. కాని, అక్కడినుంచి రెండవ జట్టును తీసుకుని లాంచి (చిన్న పడవ) లో మాలయక్ వెళ్ళాలని అధికారుల ఆజ్ఞ.

నేను మాలయక్ వెళ్ళి నా బాధ్యత కిందవున్న రెండవ జట్టును అక్కడివారికి అప్పగించాను. అత్యవసర పరిస్థితులు సంభవిస్తే, అక్కడున్న వారిని మణిపూరు స్టేటు ద్వారా ఇండియాకు పంపడానికి జరిగే ఏర్పాట్లకు సాయపడాలనీ, అందుకోసం అక్కడే వుండాలనీ అధికారులు ఉత్తరువు చేశారు. ఈ విధంగానే నిర్ణయిస్తే, నేను స్త్రీ, శిశువుల వెంట వుండి, ఏనుగులతోకూడా, వారిని ఇండియాకు చేర్చవలసి వుంటుంది. ఏనుగులు, వారి ఆహార పదార్థాలనూ, అత్యవసర

మైన వస్తువులనూ మొయ్యడానికి మాత్రమే కాని, జట్టుదారులను మొయ్యడానికి మాత్రం కాదు.

అప్పటినుంచీ ఏనుగులు యీ రవాణాపనిలో ప్రధాన పాత్రను వహించసాగినవి. అది 1942 ఫిబ్రవరి నెల. ఏనుగులు కలేవా (Kalewa) ఉత్తరంగా. చిన్‌డ్విన్ నదియొక్క పడమటి తీరంలో కలపపనిలో నిమగ్నమై వున్నాయి. ఆ పనిని వెంటనే నిలిపివేసి, జనాన్ని సురక్షిత స్థలాలకు తరలించడానికి ఏనుగులను పంపవలసిందని జాఫ్ బస్టక్ (Geoff Bostock) ఉత్తరువు చేశాడు. ఆయన ఆ సమయంలో అడవిలోని అధికారులకు అధినేత!

ఇండియానుంచి బ్రహ్మాండమైన సైన్యంఒకటి రాబోతున్నదనీ, దానికోసం ఇంఫాలు నుంచి కలేవా వరకూ అతిచురుకుగా రోడ్డు తయారవుతున్నదనీ వదంతులు బయలుదేరాయి. సిటాంగ్ నది (Sittaung River) నదివైపు పురోగమిస్తున్న జపాను సైన్యాన్ని అడ్డుకోడానికే యీ సైన్యం వస్తున్నదట! కొందరు యీ వదంతులను విశ్వసించారు. కలేవా చివరనుంచి టామూ వరకూ రోడ్డుపని జరుగుతున్నది. కాని పై వదంతుల ప్రకారం జరగడం లేదు. అక్కడనుంచీ పడమటి తట్టున పర్వతపంక్తి! రోడ్డు వెయ్యడంలోనూ, వంతెనల ప్రాంతాలకు కలపను చేరవెయ్యడంలోనూ ఏనుగులు ఎంతో ఉపయోగ పడ్డాయి. ఏనుగులతో మావటీలు ప్రతి దినమూ ఎక్కువ గంటలు మనః పూర్వకంగా చాలా శ్రమ తీసుకుని పనిచేశారు. ఆ మార్గాన ఎడతెగకుండా వస్తూవున్న భారతీయ ప్రయాణికులవల్ల ఏ మాత్రమూ చికాకు లేకుండా యీ పని జరిగింది.

ముసలివాళ్ళనూ, రోగులనూ సిటాంగు (Sittaung) నుంచి చిన్‌డ్విను మీదుగా టామూ చేర్చడానికి కొన్ని యేనుగులు పనికి

వచ్చాయి. మార్గమధ్యంలో కొంత సేపు నిలవడానికి తాత్కాలికంగా కొన్ని బసలు అక్కడక్కడ అడవులలో ఏర్పాటయాయి. అడవుల్లోని ఉద్యోగులు వాటిని నిర్వహించేవారు. కొన్ని యేనుగులు ఆ బసలలో వుండే వారికి అవసరమైన వస్తువులను తెచ్చేవి. చివరకు బొంబాయి బర్మా కార్పొరేషనూ, ప్రభుత్వమూ, అటవీశాఖ - అన్నీ మొత్తం మీద కలిసి యీ కార్యకలాపం నెరవేర్చాయి. అవి సక్రమంగా ఏనుగుల వల్లనే జరిగాయి !

ఏప్రిలు చివరి వరకూ ఎడతెగకుండా ఏనుగులు యీ విధంగా పనిచేశాయి. తర్వాత వాటికి నీళ్ళు దొరకలేదు. కలేవా - టామూ రోడ్డు పని అంతటితో నిలిచిపోయింది. బర్మానుంచి వెనుదిరిగి వచ్చిన సైన్యం చిండ్విన్ దాటి రావడంతో ఆ పని తిరిగి ప్రారంభమైనది.

స్త్రీలూ, పిల్లలూ టామూ చేరడానికి అడవి మార్గంలో ప్రయాణం చేశాము. ఏమంటే - రహదారిలో జనం ఎడతెగకుండా ప్రయాణం చేస్తున్నారు. అలాంటి మార్గంలో ఏనుగులతో వెళ్ళడం చాలా చికాకుగా తోచింది. నేను శ్రీ బస్టక్‌తో కలిసి 1942 ఫిబ్రవరి 14 వ తేదీని మాలయక్ నుంచి బయలుదేరాను. ఇరవైమంది స్త్రీలూ పదిహేనుగురు పిల్లలూ, ఏనుగులతో మాకు అప్పగించబడినారు. రెండవ జట్టు శ్రీ పార్కర్‌కూ, శ్రీ జోన్సుకూ అప్పగించబడింది. అందులో ఇరవైమంది స్త్రీలూ, పన్నెండుగురు పిల్లలూ వున్నారు. మా తర్వాత రెండు రోజులకు వారు ప్రయాణం ప్రారంభించారు. మొత్తం మీద నలభైమంది స్త్రీలూ, ఇరవై యేడుగురు పిల్లలూ, నూరు ఏనుగులూ మా పర్యవేక్షణ కింద ఉన్నవి.

ఏనుగుల విషయంలో నాకు చాలా ఆందోళనగా వుండినది. కాని, మావటి వాళ్లు నెమ్మదిగా వాటిని చూచుకున్నారు. మేము

ముందుకు సాగిపోతూనే వున్నాం. ముందు ముందు చాలా కష్టాలున్నాయని హెచ్చరిక వచ్చింది. అది తూ - చా - తప్పని యథార్థంగా కనబడింది. దారిలో ఒక చిన్ గ్రామంలోని గ్రామస్థులు కొట్టియిచ్చిన అరటి బోదెలు తప్ప ఏనుగులకు - ముప్ఫయి గంటల వరకూ ఆహారంగాని, నీరుగాని దొరకలేదు. ఆ బోదెలున్నూ ఒక్కొక్క దానికి పన్నెండేసి వచ్చాయి. మేము ఏనుగులను కట్టివేసి రాత్రంతా మేలుకొనే వున్నాం. పాపం! వాటికి తినడానికి కూడా శక్తి లేకపోయింది. మొదట కొంత అభ్యాసం చేయించకుండా స్త్రీలనూ, పిల్లలనూ హఠాత్తుగా యిలా తరలించడం చాలా కష్టమైన పని అని బాగా బోధపడింది. కాని, క్రమంగా రోజుకు రోజూ - అనుసరించవలసిన పద్ధతికి అందరూ అలవాటు పడ్డారు.

ఎన్నో చిక్కులు పడి, పోతూ పోతూ నేను ఒక బుల్‌డోజరు (**Bulldozer** - నేలను చదును చేసే యంత్రం)ను చూశాను. దాన్ని నడుపుతున్న వ్యక్తిని పది నిమిషాల పాటు పరిశీలించాను. అతని యంత్రం నేలను తవ్వుతూ మట్టినీ, రాళ్ళనూ ప్రక్కకు తోసివేస్తూ, పొదలనూ వాటినీ ఛేదిస్తూ వుంది. 'సర్' అనే బిరుదం యివ్వదలిస్తే దానికి అతడే అర్హుడని తోచింది.

ఇంఫాలు సమతలంలోని పలేల్ (**Palel**) వరకూ, దారి పొడుగునా మాకు యీ యంత్రాల ధ్వనులు వినబడుతూనే వుండినవి. కొంతవరకూ కొత్తరోడ్డు పడింది. ఆ చివర్నుంచీ ఈ యంత్రాలు పనిచేస్తూ వుండినవి. ఈ రోడ్డు వెయ్యడం బర్మాకు సేన రావడానికో లేక బర్మానుంచి సైన్యాన్ని తరలించడానికో తెలియలేదు. బర్మానుంచి వచ్చే వార్తలు మాత్రం భయంకరంగా వున్నవి. పలేలునుంచి ఇంఫాలు వరకూ వెళ్ళడానికి మాకు మోటారు బండ్లు దొరికాయి.

ఏనుగులను అక్కడ నాశనం చెయ్యడంకంటె తిరిగి వెనక్కు పంపడమే మంచిదని తోచింది. అవి బర్మాలో చెయ్యవలసిన పని ఎంతోవుంది.

ఆసాం-బెంగాల్ రైల్వేవారి రెలుబండి ఎక్కి ఆ కుటుంబాలు పోతూ వుంటే మనస్సుకు ఎంతో నెమ్మది ఏర్పడింది. టామూనుంచి రావడానికి రెండవ జట్టు ఏనుగులను ఉపయోగించ లేదు. కూలీలను మాత్రమే ఏర్పాటు చేసుకొన్నది.

ఆసాంలోని తేయాకు తోటల యజమానులు, వేలకొద్దీ వున్న వారి కూలీలతో వచ్చి రోడ్డు నిర్మాణానికీ, నిర్వాసుల బసలకూ సహాయం చేశారు. దిన దినమూ హెచ్చుతూ వస్తున్న - నిలువ నీడ లేని నిర్వాసులకు ఆ బసలే ఆధారమైనాయి. మా తిరుగు ప్రయాణంలో మేము ఏనుగుల ద్వారా సామగ్రిని రవానా చెయ్యడానికి సాయపడి కొంఖన్ (Konkhan)లో నిర్వాసులకు బస ఏర్పడేటట్లు చేశాము. ఆ బసలో కావలసిన ఆహార పదార్థాలను జతపరచి బర్మాకు వెళ్ళిపోయాము.

మా యేనుగులన్నీ సురక్షితంగా వెనక్కు వచ్చాయి. మణిపూరు ప్రయాణంలో ఒక్కటికూడా జబ్బు పడలేదు. కలేవా-టామూ రోడ్డును నిర్మించడంలో సహాయం చెయ్యడానికి అవి పూనుకున్నాయి. బర్మా పతనం తప్పదనీ, ఇండియా చాలా బెదురుతున్నదనీ గట్టిగా తెలిసినా, మావటివాళ్ళు తమ పనులు మానడం లేదు.

మానవులు అట్టి క్లిష్టస్థితుల్లోనూ, ప్రదేశాల్లోనూ వున్నపుడు ఇతరులకు తోడ్పడం అసాధ్యమైన పని! ఒక సంఘటన - స్వానుభవం మీద వున్నది ఉదాహరిస్తాను. అది కడసారి ప్రయాణం! నేనే నిర్వాసితుడనుగా బయలు దేరాను. 1942 ఏప్రిలు 9-వ తేదీ-మధ్యాహ్నం

నేను టామూను విడిచి పెట్టాను. నా సామానును నేనే మోసుకుంటున్నాను, వీపునకు కట్టి. నా వెంట రావడానికి నా కుక్కల్లో ఒక్కటీ మిగలలేదు. కాని ఒక మిత్రుని కుక్క విశ్వాసంగల ముసలి లేబ్రాడర్ (**Labrador** = ఒక జాతికుక్క) నా వెంట వున్నది. నేను ప్రయాణిస్తూ, ఆ దారిని మణిపూరు కొండలను ఎక్కుతూ, మలుపు తిరిగిన చోటికి వచ్చాను. అక్కడ ఇద్దరు పిల్లలు ఏడుస్తూ కనబడ్డారు. వాళ్ళు భారతీయులు. పెద్ద బిడ్డ బాలిక - ఏడేళ్ళది. చిన్నబిడ్డ నాలుగేండ్ల బాలుడు; వాళ్ళ తల్లి ఇరవై యేళ్ళ యువతి గట్టుకు చేరబడి వుంది. ఆమె ఆకలి దప్పికలతోనూ, ఆయాసంతోనూ, దుఃఖంతోనూ బాధపడి మరణావస్థలో వున్నది. నా దగ్గరున్న నీటి పాత్రలోని కొంచెం నీటిని ఆమె గొంతుకలో పొయ్యడం తప్ప నేను మరేమీ చెయ్యలేక పోయాను. ఆమె కృతజ్ఞతతో నా వైపు చూసింది. ఆ చూపులో "నా పిల్లల సంగతేమిటి?" అనే గొప్ప ప్రశ్న నాకు అర్థమయింది.

ఆమెను నేను విచారంతో చూస్తూ వుండగానే ఆమె ప్రాణాలు విడిచి పెట్టింది. ఆ బిడ్డల బాధ్యత నాపైని పడింది. ఆ మార్గంలో ప్రయాణం చేసే ప్రతి పురుషుడూ, ప్రతి స్త్రీ యున్నూ తమ ప్రాణాలు నిలుపుకోడానికి ఎంతో కష్టపడేవారు, ప్రాణాలతో బయట పడ్డవారు ఎంతో అదృష్టవంతులనే చెప్పాలి. ఆ బిడ్డలను అక్కడ వుంచి వేసి ముందుకు పోవడానికి నాకు అడుగు పడలేదు. పోనీ, ఒక బిడ్డను వుంచి వేసి, ఒక బిడ్డను కాపాడదామన్నా, నేను ఆ చిన్నబిడ్డనైనా మోసుకు వెళ్ళడం సాధ్యం కాదు. వెనక్కు వెళితే ఏదైనా సహాయం లభించవచ్చుననే ఆశ కలిగి, వాళ్లను తీసుకుని వెనక్కు వచ్చాను. అదృష్టవశాత్తూ - ఒక మైలు దూరంలోగానే ఒక జీపు కారు వస్తూ కనబడింది. ఆ రోడ్డు మీద నేను జీపును చూడడం అదే

మొదలు. ఒక పెద్ద అధికారి దానిని నడుపుతున్నాడు. కొన్ని రోజుల కిందటనే అతనిని నేను టామూలో కలుసుకున్నాను.

నేను ఆ కారుకు అడ్డంగా దారిపై నిలబడ్డాను. అతడు నా మీద నుంచి కారును పోనియ్యవచ్చు. లేదా నన్ను రాసుకుని పోయి ప్రక్కనున్న లోయలో దొర్లిపోయేటట్లు చెయ్యవచ్చు. అయినా నేను సాహసించి అడ్డంగా నిలిచాను. అతడు నన్ను పోలిక పట్టి కారు ఆపాడు. "క్షమించండి. మిమ్ము నేను ఎక్కించుకోలేను. మీరు జీపులో కూచుంటే ఈ కొండను నేను ఎక్కడం అసాధ్యం! చీకటి పడకముందే నే నీ కొండలను దాటి పోవాలి" అని అతడు అన్నాడు.

దారి పక్క వుండి పోయి చచ్చిపోవడానికైనా సిద్ధపడతాను గాని, కారు ఎక్కదలచుకో లేదని నేను స్పష్టంగా అతనితో చెప్పి, ఆ బిడ్డలను ఇద్దరినీ మాత్రం ఎక్కించుకొనిపోయి ఇంఫాలులోని నిర్వాసుల శిబిరానికి అప్పగించాలని బ్రతిమాలాను. అతడు తప్పకుండా వాళ్ళను ఎక్కించుకుంటాడనే అనుకున్నాను. ఒక వేళ అలా జరక్క పోతే, ఆ కారును ప్రక్కనున్న పల్లంలోకి తోసివెయ్యాలని అనుకున్నాను. కాని, అలా ఏమీ జరగలేదు. అతడు ఇద్దరు పిల్లలనూ ఎక్కించుకొని, బయలుదేరాడు. నేను మెల్లగా నడుస్తూ దాని వెనకనే ప్రయాణం సాగించాను. నా మనస్సులో బరువు తగ్గింది. నేను ఆ కొండలను దాటి, రెండవసారి ఇంఫాలు వెళ్లాను. అక్కడ నిర్వాసుల శిబిరానికి వెళ్ళి, అనాథ శిశువుల విభాగంలో వున్న ఆ బిడ్డల నిద్దరినీ చూచి తృప్తిపడ్డాను.

ఆ రోడ్డు ఘోరాలకూ, దుఃఖాలకూ నిలయమైంది. క్రమంగా అది మంచి మార్గంగా తయారైనది! బర్మానుంచి సైన్యం వెనక్కు రావలసిన సమయానికి సరియైన రోడ్డు టామూకు ఏర్పడింది. బుల్

డోజర్లు వచ్చి ఆ పనిని త్వరగా నెరవేర్చాయి. వాటిని చూచి, ఏను గులు 'ఇక మనతో అవసరంలేదు' అని అనుకొని వుండవచ్చు. అవి అలా అనుకుంటేమాత్రం పొరపాటని చెప్పవలసి వస్తుంది. అన్ని పరిస్థి తుల్లోనూ, ఎప్పుడూ వాటి అవసరం వుండనే వున్నది.

## ౧౩

బర్మా పతనంతో భారతదేశంలో టేకు కలపకు ప్రాముఖ్యం ఎక్కువైనది. అక్టోబరు నెల చివరివరకూ నేను వంగదేశంలోనూ, ఆసాములోనూ వుండే టేకు చెట్లను పరిశీలించడంలోనూ, చెట్లను నరికి కలప తయారుచెయ్యడానికి కూలీలను జతపరచడంలోనూ నిమగ్నుడనై ఉంటిని. ఈ పనిని నాకు ఆషాం ప్రభుత్వం అప్పగించింది. ఆ సమయంలో మా నూరు ఏనుగులూ నా దగ్గర వున్నట్లయితే, యీ పని ఎంతో సులభంగా జరిగిపోయేది. కాని, అవి బర్మాలో వుండి పోవడంవల్ల పని కష్టమని తోచింది. ఒకసారి బర్మాలోని కొత్త రోడ్డు మీదికి వెళ్ళినయెడల, అక్కడి యేరుగులూ, మావటివాళ్ళూ మాతో చేరిపోతారని నాకు తెలుసును.

అదృష్టవశాత్తూ యిలాటి ఆలోచనే మరొక సేనాధిపతికీ తట్టి నది. 1942 అక్టోబరు నెలలో తూర్పు సేన (అదే తర్వాత 14-వ సేనగా మారింది.) యొక్క అధికారి వద్దనుంచి ఒక జాబు వచ్చింది. ఏనుగు లను గురించీ, చిన్‌డ్విన్ అడవులను గూర్చి, బర్మా భౌగోళిక పరిస్థితు లను గురించీ చర్చించడానికి తన్ను ఒకసారి కలుసుకోవాలని ఆయన ఆ జాబులో వ్రాశాడు. నేను అతన్ని కలుసుకుని మాటాడాను. అతని కోరికను అనుసరించి ఏనుగులను గురించిన సలహాదారుగా అతనిదగ్గర

ఉద్యోగంలో చేరాను. వాస్తవానికి, నేను సలహా యివ్వడానికి ఆ సమయంలో అతని సైన్యంలో ఏనుగులు లేనేలేవు.

1942 నవంబరు 8 వ తేదీని, ఆసాంలోని జోర్‌హాట్ (Jorhat) లోవున్న 4-వ దళం ప్రధాన కార్యాలయంలో నేను ఉద్యోగిగా ప్రవేశించాను. నే నాస్థానానికి అపూర్వవ్యక్తిని. నాకు బర్మాభాష తెలుసు. అక్కడి రహదారులు, నదులు, రైలుమార్గాలు తెలుసును. ఐరావతీ నదీప్రాంతాన్ని నేను బాగా ఎరుగుదును. అన్నిటికన్నా ఆశ్చర్యమేమంటే - నాకు అడవి మార్గాలు అన్నీ తెలుసును! పరిశోధక శాఖవారికి నాయందు ఎంతో నమ్మకం! నే నక్కడ సజీవమై సిద్ధంగావున్న గ్రంథాలయంగా పేరుపొందాను. అక్కడివాళ్ళు నన్ను ఊపిరి తీసుకోనిచ్చేవారు కారు. అప్పుడప్పుడు ఏదో అవకాశం చిక్కించుకుని కాస్త మంచిగాలి పీల్చుకోడానికి బయటికి వెళ్ళానా, అక్కడివాళ్లందరికీ ఆశ్చర్యం కలిగేది. ఏమంటే నేను తిన్నగా సైన్యాధిపతి దగ్గరకే పోయేవాడను.

"జపానువారికి స్వాధీనం కాకుండా వుండిపోయిన ఏనుగులేవైనా వున్నాయేమో చూడాలని అనుకుంటున్నాను. దానికి టామూ వరకూ వెళ్ళాలి. ఒక జీపుకారును నా స్వాధీనంలో వుంచాలి" అని ఒకసారి అతనిని అడిగాను.

మూడు రోజుల్లోనే నాకు జీపు ఇవ్వబడింది. జీపును సంపాదించడం అసాధ్యమని అందరూ అనుకున్నా, అది సుసాధ్యమే అయింది. పరిశోధన శాఖవారి అనుమతి లభించడం అంతకన్నా కష్టం! నాకు అదీ లభించింది. తాము కోరినవెంటనే తిరిగివచ్చే పద్ధతిలో వారు నాకు టాముకు వెళ్ళడానికి అనుమతిని ఇచ్చారు!

నేను టామూకు పోతూ మార్గంలో పురోగామి శాఖవారి కేంద్రానికి (Forward Division Head quarters) వెళ్ళాను. అక్కడున్న హారోల్డ్ బ్రౌను (Harold Browne) ను నాతో తీసుకువెళ్ళడానికి సేనాధిపతి అనుమతిని పొందియున్నాను. హారోల్డు నా ముఖ్యమిత్రుడు! అటవీశాఖలో అతడు ఉద్యోగంలో ప్రవేశించిన దగ్గర్నుంచీ నేను అతన్ని ఎరుగుదును. అతని జన్మభూమి దక్షిణ-ఆఫ్రికా. అతడు మంచి కండర పుష్టికలవాడు. వెడల్పు ఎగు భుజాలూ, ఇరుకైన పిరుదులూ కలవాడు. స్కాండినేవియనులవలె అతని కన్నులు నీలమైనవి. గోరిల్లావలె అతని దేహం రోమమయం! అతడు బర్మాకు రాగానే, బాతు నీటిలో ప్రవేశంచినట్లు ఉత్సాహంతో అడవిలో ప్రవేశించాడు. ఒంటరిగావున్నా జంకులేనివాడు. అంతేకాదు. ఒంటరితనాన్నే కోరేవాడు. సెలవుమీద వున్నప్పుడు అల్లరిమూకతో చేరి వ్యర్థంగా కాలం గడిపేవాడు. అతడు నూటికి నూరుపాళ్ళు అధికారిగా స్వధర్మం నిర్వహించేవాడు. ఆరీతినే స్నేహాన్ని చూపేవాడు. బర్మా ఊజీల అభ్యుదయంకోసం హోరాహోరి పోట్లాడేవాడు.

యుద్ధసమయంలో కాబాకనుమ అతని అధికారం కింద వుండినది. అక్కడికి వెళ్లే పెద్ద ఉద్యోగస్థులందరికీ ఆతడు ఆతిథ్యం యిచ్చి గౌరవించేవాడు.

గోల్డ్‌బెర్గ్ (Goldberg) అనే ఆంగ్లో - బర్మీయ యువకుడు చిన్‌డ్విన్‌లోని సిటాంగ్ చేరువనున్న ఆక్టాంగ్‌కు (Auktaung) చెందిన గస్తీదళాన్ని అనుసరించి వున్నాడు. మేము టామూకు చేరడానికి కొంచెం ముందే అతడు అక్కడ చేరడం జరిగింది. అక్కడ నలభై ఏనుగు లున్నాయి. వాటికి చెందిన బర్మీయులతో సంబంధం కుదుర్చుకోడానికి ప్రయత్నం చేస్తానన్నాడు. అక్కడి యేనుగులను మా-ల

యకుకు తీసుకురావాలని వాటి మావటీల పెద్దకు జపానీయులు ఆజ్ఞయిచ్చారు. మారుమాట చెప్పకుండా అతడు దానికి సమ్మతించి, ఏనుగులను మా-లయకుకు తరలించాలని తన ఊజీలను కోరాడు. వాళ్లు మరునాడు బయలుదేరి జపానీయులను చేరడానికి సిద్ధంగా వున్నారు. గోల్డ్ బెర్గ్ కు వాళ్ళలో చాలామందిని తెలుసును. అతడు వాళ్ళతో మాటలాడి వీలైనంత వేగంగా ఎగువ టీలాంగ్ (Teelaung) నదివరకూ వెళ్లి, అక్కడినుంచి పడమటకు మళ్లీ టామూకు వెళ్లేటట్లు ఒప్పించాడు. ఏనుగులకన్న ఊజీలు తక్కువగా వున్నారు. ఒక వేళ, వాళ్ళు జపానువారితోనే చేరితే మావటీలులేని యేనుగులను వెనక దిగవిడవడానికే నిర్ణయం జరిగిపోయినదట. కాని టామూలో తమరి నందరినీ కలుసుకునేందుకు మేము వేచి ఉంటామని తెలియగానే, ఊజీల యువతులు - మావటీలు లేని ఏనుగులపై ఎక్కి వాటిని తీసుకు రావడానికి సిద్ధపడ్డారు. వాళ్లు గొప్ప సాహసం చూపి, రాత్రి బయలు దేరినారు. టీలాంగ్ నదీప్రాంతంలోని అడవుల్లో జపాను గస్తీదారులున్నా, వాళ్ళ చేతుల్లో పడేప్రమాదం వున్నా - ఊజీలూ, వారి కుటుంబాలూ ఎంతో ధైర్యంతోనూ, నేర్పుతోనూ వాళ్ళను తప్పించుకున్నారు. వాస్తవానికి ఆ అటవీప్రదేశం ఎవరిదీకాదు. అయినా, మన గస్తీదారులకంటె జపానువారి గస్తీదారులే ఆ ప్రాంతంలో తరుచు తిరుగుతూ వుండేవారు.

ఇలా తప్పించుకొని, ఏనుగులతో వచ్చిన ఊజీలను చూచి మేము ఎంతో ఆశ్చర్యపడ్డాము. ఇదే చివరకు ఒకటవ నెంబరు "ఏనుగుల కంపెనీ" అయినది.

మరికొద్ది కాలంలోనే అనుకోకుండా ఒక విషాద సంఘటన జరిగింది. దురదృష్టవశాత్తూ ఒక గస్తీదారుడు 'యూవా' (Yuwa)

గ్రామంలోని పెద్దను - అతి ముఖ్యుని - 'యూ-న్వా' (Unwa) అనే అతన్ని కాల్చి చంపివేశాడు! దీనివల్ల నా సంకల్పాలకు గట్టి దెబ్బ తగిలింది. మా లయకుకూ, టామూకూ మధ్యానుండే ప్రదేశంలో వున్న - నా పూర్వపరిచితులైన ఊజీలను కలుసుకుని, వారితో మాట లాడాలని నా కోరిక. యూ - న్వా మరణంతో అది అసాధ్యంగా తోచింది.

యూ - న్వా అరవైఏళ్ళ బర్మీయుడు. టేకుకలప పనిలో ఐరోపీయులతో కలిసి మెలిసి అడవుల్లో నలభై ఏళ్ళు పనిచేశాడు. ఘరానా మనిషికి వుండే లక్షణాలన్నీ అతనిలో పూర్తిగా వున్నవి. ఎగువ చిన్‌డ్విను నుంచి మాండలేవరకూ అతనిని ఎరగనివారు లేరు. 'ఔజా' (Auza) అనే ఉపపదం లేకుండా అతనిపేరును ఎవ్వరూ ఉచ్చరించరు. ఒళ్ళువంచి పనిచేసి అధికారం సంపాదించినవాడని దాని అర్థం! అతనికి పుట్టుకతోనే బర్మీయుల నాయకత్వం అబ్బినది. తాను ఏమాత్రమూ తక్కువవాడనని భావించకుండా అతడు ఐరోపీయులతో సమాన పాయలో కలిసి వుండేవాడు యుద్ధసమయంలో - అందరూ తమతమ ప్రాంతాలు విడిచి వెళ్లిపోయేటప్పుడు, ఆ అడవిలోవుండే బర్మీయులలో అతడే ధనవంతుడని తేలినది. అతనికి పన్నెండువేల రూపాయల ప్రోవిడెంటుఫండు వున్నది. భార్యదగ్గర కొంత ధనం వున్నది. యూవాలోని ప్రధాన వర్తకులలో ఆమె ఒకతె. తమ వూరికి జపాను గస్తీదారులు వచ్చినా, బ్రిటిషువారు వచ్చినా, యూ - న్వా ఆందోళన పడలేదు.

అతన్ని అనుమానించడంవల్లనే యీ పని జరిగింది. బ్రిటిషు గస్తీ వచ్చినపుడు అతడు భయపడి అడవిలోకి పారిపోలేదు. ఇదే అతని పై అనుమానానికీ హత్యకూ కారణమైంది! కడచిన ఆరునెలలనుంచీ

జరుగుతున్న సంఘటనలు అతనికి దిగ్భ్రాంతిని కలిగించాయి. అయినా, మేము తప్పకుండా తిరిగివస్తామనే నమ్మకం అతనికి వుండినది. మాలో ఎవరమైనా తిరిగివస్తామా అని మారాకకు ఎదురు చూస్తూవుండే వాడు. బ్రిటిష్‌వారిని చూచి, స్వాగతం యివ్వడానికి అతడు వచ్చాడు. కాని ఆ వచ్చినవారిలో ఒక్కరికీ బర్మాభాష తెలియదు.

రాత్రి పదిగంటలకు అతన్ని చెట్టుకు కట్టి, తెల్లవారు జామున కాల్చి చంపారు. విద్యుచ్ఛక్తివలె ఈ సమాచారం అంతటా వ్యాపించి జపానీయుల చెవిలో పడింది. అప్పటికే వారు అడవుల్లో వుండే బర్మీయులనూ, ఏనుగులనూ అనేక విధాలుగా, ఉపయోగించడం ప్రారంభించారు. వాళ్ళకీ వార్త దైవికంగా మంచి ప్రచార సాధనంగా ఉపయోగించింది. 26022

మేమూ జాగ్రత్తగానే వున్నాం. ఈ సంఘటనకు బాధ్యుడైన అధికారిని మరి గస్తీకి పంపడంలేదు. అదృష్టవశాత్తూ ఆ సమయంలో బర్మా సివిల్‌సర్వీసుకు చెందిన శ్రీ టామీ థామస్ (Tommy Thomas) టామూలో వున్నాడు. ఆయనా, నేనూ కలిసి, యీ సంఘటనను గురించిన సమాచారం పూర్తిగా అధికారులకు తెలియజేశాము.

అనేకమైన ప్రతిఘాతాలకూ, తత్ఫలితాలకూ అవకాశం యిచ్చిన రెండేండ్ల క్లిష్టకాలంలో - ఏనుగులతోనూ, వాటి మావటివాళ్ళతోనూ పరిచయం చేసుకోడానికీ నావంటివాళ్ళు ఎవరికో తప్ప ఇతరులకు సాధ్యం కాలేదు. మా పని జరగడం కష్టమైంది. 1942 చివరనూ 43 ప్రారంభంలోనూ బర్మా భాషను తెలిసిన బ్రిటిష్ ఉద్యోగులు అక్కడ కరవైపోయారు. ఆ సమయంలో సిమ్లా పర్వతాలపైని పనికిమాలిన "పునర్నిర్మాణ" కార్యం ప్రారంభమైంది. అందుకోసం అర్హులైన బ్రిటిష్ ఉద్యోగులు చాలామంది అక్కడికి వెళ్ళవలసి

వచ్చింది. కాని, వారు మొదటవున్న చోటనే వుండినట్లయితే ఎంతో ఉపయోగంగా వుండేది.

౧౪

1943-వ సం. వేసవిలో పదిహేడు ఏనుగులను పట్టుకొన్నాం. వెనకటి నలభై చేరి మొత్తం ఏభైయేడు ఏనుగులు! మొదట్లో - వాటిని, కాబాకనుమలో వున్న మూడు రోడ్లలోనూ వంతెనలను నిర్మించడానికి వుపయోగించాం, తర్వాత ఆ కట్టిన వంతెనలను వెడల్పు చేసే పనిని వాటిచేత చేయించాము. ఈ పనులను బాగా నెరవేర్చి ఏనుగులు మంచి పేరు సంపాదించాయి. వంతెనలు నిర్మించడంలోనూ, రోడ్లు వెయ్యడంలోనూ వాటికి వుండే గొప్ప శక్తిని సైనికోద్యోగులు చక్కగా గుర్తించారు.

సరిహద్దు ప్రాంతాలలోని శత్రువుల గస్తీదారులకూ, మా వారికీ వేసవికాలం పూర్తిగా సంఘర్షణలు జరుగుతూనే వుండేవి. కాబా కనుమనుంచి ఇంఫాలు వరకూ వుండే ప్రదేశాన్ని గమనించడానికి రెండే రెండు పటాలాలు మాకున్నవి. అందలిసైనికులు చాలా దూరదూరంగా మాత్రం వుండగలరు. జపానీయులు దక్షిణంగా కాలెమ్యో (Kalemyo) నుంచి చిన్ పర్వతాల్లోని టిడ్డిం వరకూ (Tiddim) తోసుకొని రాసాగారు.

ఏప్రిలులో కొన్ని జల్లులు పడ్డాయి. వాటిని బట్టి కాబా కనుమలో ఇక వర్షాలు ప్రారంభమౌతాయని సైనికులు వూహించారు.

కడచిన మే నెలలో బర్మా సేనయొక్క 17-వ దళం వెనకకు మరలి వచ్చినపుడు ఈ లోయకు 'మృత్యులోయ' అని మారు పేరు

పెట్టారు. కారణం ఏమిటంటే - ఆ మార్గంగా వచ్చిన నిర్వాసులు వందలకొద్దీ ఆకలి దప్పులతోనూ, శ్రమతోనూ, కలరా, మశూచికం, రక్తభేది మొదలైన రోగాలతోనూ బాధపడుతూ, దారి పొడుగునా చచ్చి పడివుండడం ఆ సైనికులు ఎరుగుదురు. వాళ్ళలో కూడా చాలా మంది పై విధంగా మరణించారు. తర్వాత వచ్చిన సైనికుల విషయంలో ఆ పేరు మానసికంగా పనిచేసి, ఆరోగ్యాన్ని చెడగొట్టింది. ఆ చుట్టు ప్రక్కల వుండే కనుమల్లో వున్నంత ఉమ్మిరిగా కాబా కనుమలో మలేరియా లేదు. అయినా, దానికి చెడ్డపేరు వచ్చింది. 11-వ తూర్పు ఆఫ్రికా సేనావిభాగం వచ్చే వరకూ - 1944 వ సం॥ వర్ష ఋతువు వచ్చే వరకూ అది వుండలేదు. ఎలాటి చెడ్డ సమయంలో అక్కడికి వచ్చినా హాని వుండదని రుజువయింది కూడా.

మేము ఏర్పాటు చేసిన ఏనుగుల మకాములోనే నేను నివసిస్తూ వుండే వాడను. కాని, అప్పుడప్పుడు ఆసాములోని సైనిక కేంద్రానికి వెళ్లుతూ వుండేవాడను. అప్పుడుండే పరిస్థితులను అధికారులు కొందరికి మాత్రమే తెలిపే వారు. అట్టి వారిలో నేనొకణ్ణి. అలాంటి స్థితిలో తమవారి ప్రవర్తనా, నమ్మకమూ చలించకుండా వుండేటట్లు చూడాలి. తమ సైనిక పరిస్థితులు దెబ్బతినే స్థితిలోవున్నా వ్యక్తం చెయ్యక గంభీరంగా వుండాలి. ఇట్టివి నాకు బాగా తెలుసును. 1943 మే నెలలో నన్ను సైనిక కేంద్ర కార్యాలయానికి పిలిపించి "వర్షర్తువు ప్రారంభం కావడానికి ముందే కనుమలోవున్న సేనలను అన్నిటినీ తరలించి వేస్తే ఏనుగుల సంగతి ఏమిటి?" అని అడిగి, దాని విషయమై నాఅభిప్రాయాన్ని వ్రాసి యిమ్మన్నారు. నేవ్రాసిన దిది - "ఏనుగులు కనుమలో వుండవలసినదే. వాటితో నేనూ వుంటాను. అక్కడ వుండే మావటివాళ్ళకూ, ఏనుగులకూ ఆరునెలలకు అవసరమైన వస్తువులిస్తే చాలు. మమ్మల్ని బెదరిస్తూ జపానువారి గస్తీ వస్తే

తప్పించుకుని ఇంఫాలు రావడానికి ఏనుగులను ఎప్పుడూ సిద్ధంగా వుంచుతాము" అని.

వర్షాకాలం తర్వాత కనుమకు తిరిగి వచ్చిన మా సేనలు ఏనుగుల విలువను గ్రహించాయి. సేనలు మళ్లీ వెనక్కు పోతే, వాటితో కూడా ఏనుగులను తరలించడానికి నాకు ఎంత మాత్రమూ ఇష్టం లేదు. అలా చేస్తే బర్మీయుల ప్రవర్తన తలక్రిందులు కావచ్చు. మరొక సంగతి. అక్కడి నుంచి ఏనుగులను తరలిస్తే మళ్లీ అవసరమైనప్పుడు వాటిని తీసుకు రావడం కష్టం! సైన్యం తిరిగి వచ్చేటప్పుడు మార్గం అంతా వేగంగా ప్రయాణం చేసే యంత్ర శకటాలతో నిండి వుంటుంది కదా!

నా ఆలోచనకు మొదట కొందరు అడ్డు తగిలారు. కాని, చివరకు అధికారులు సమ్మతించారు. కాని, నాకు కావలసిన వాటిని నేనే ఏర్పాటు చేసుకోవాలని అన్నారు. అప్పుడు నాకు కావలసినంత వ్యవధి వుండినది. అప్పటికింకా 23-వ సైన్యం బయలుదేరలేదు.

ఇదే సమయంలో టామూలోనూ, ఆ కనుమలోని గ్రామాల లోనూ వున్న ప్రజలు - మా సేనలు తిరిగి అక్కడికి వచ్చిన సంతోషాన్ని వ్యక్తం చేస్తూ ప్వాయ్ (Pwai) ఉత్సవం చేసుకున్నారు. ఉత్సవానికి జరిగే ఏర్పాటులలో ఆలస్యం జరిగింది. తిరిగి సేనలు అక్కడినుంచి పలాయనమయ్యే సమయానికి ఈ వుత్సవం జరిగింది! నేను ద్రాక్షారస పానం చేసి, 'మింతామీ' (Minthami=ప్రదర్శనం యొక్క నాయకురాలు)తో కలిసి నాట్యం చేశాను. ఆ సాయం కాలం మా ఏనుగుల బలగం నాయకుడు 'యూ - పో - సిన్'కు (U-Po-Sine) 23-వ ఇండియన్ డివిజను సేనాధిపతి చికిలీ చేయబడిన అందమైన కత్తిని బహూకరించాడు. ఆ రాత్రిని బర్మీయులు ఎక్కువ

ఉత్సాహంతోనూ ఆనందంతోనూ, గడిపారు. నేను మాత్రం అధమం రెండు నెలలలోగా నయినా అక్కడినుంచి సేనలు వెళ్ళిపోతాయనే విచారంతో ఆ రాత్రిని ఎలాగో గడపాను.

కాని, సేనలు అక్కడినుంచి బయలు దేరడంలో మరి రెండు వారాలు ఆలస్యం అయింది. నైఋతి భాగంలో జరిగిన సంఘటనలలో 17-వ డివిజను చిక్కుకొని వుండడమే దీనికి కారణం.

49-వ సేన యింకా విటోక్ (Vitok) కనుమలో వుండగానే-అనుకున్న సమయంకంటె ముందుగానే వర్షాలు ప్రారంభమైనాయి. రెండు రోజుల్లో - మోటారులన్నీ బురదలో కూరుకు పోయాయి. మధ్యలో కొంచెం కాలం వర్షాలు వెలిశాయి. అప్పుడు మెల్లిగా అవి వూబిలోంచి బయటికి రాగలిగాయి. అదిన్నీ మా యేనుగుల సహాయం వల్లనే! ఆ దారి పొడుగునా-ఏనుగులను పంపి సహాయం చెయ్యాలని చాలామంది కోరేవారు. షాంపేన్ సీసాలనుంచి బిరడాలను త్రుళ్ళించి తీసేటట్లుగా, మా యేనుగులు లారీలను బయటికి వూడలాగేవి.

ఈ విధంగా బండ్లను బురదనుండి లాగడమే కాకుండా - ఏనుగులు బురద నేలల మీద దుంగలను పరిచి, అతి వేగంగా సేతువులను నిర్మించి, మోటారుల ప్రయాణానికి ఆటంకంలేకుండా చేశాయి. పని చేస్తున్నప్పుడు ఏనుగులను తొందర పెట్టకూడదు. అవి నిదానంగా పనిచేస్తాయి. ప్రారంభించిన పనిని పూర్తి చేసేవరకూ విడవవు. విశ్రాంతి తీసుకోవు.

'మోరే' (Moreh) దగ్గరి సేతువు మీద నుంచి కడపటి శకటం ప్రయాణం చేసి వెళ్లుతున్నప్పుడు సైనికుల పెద్ద, సేతువుమీద నుంచి నడిచి వెళ్ళుతూ శకటాలన్నీ వెళ్ళిపోయినట్లు వ్యక్తం చేశాడు.

ఏనుగులు ఆ పక్కనే నిలబడి మసక మసక వెలుగులో, దిగ్భ్రమతోనూ అసహ్యంతోనూ లారీల వైపు చూస్తూ వుండగా, అవి ఏదో అడవి భూతాన్ని చూస్తున్న భావంతో వున్నట్లు నాకు తోచింది. సైన్యాన్ని అక్కడి నుంచి తరలించడాన్ని గురించి ఊజీలు ఏమి అనుకున్నారో నాకు తెలియదు.

ఎడతెరిపి లేకుండా వర్షాలు పడుతున్నాయి. ఇద్దరు ఐరోపీయులు వాటిని ఎప్పుడూ సహించి వుండేవారు. వారానికి ఒకసారి మా మకాముకు గస్తీకి గూర్ఖాలు వస్తూపోతూ వుండేవారు. వాళ్ళ రాక పోకలకు - ఆ కనుమలోని చిత్తడినేలలో ఏనుగులే ఉపయోగపడేవి. వాళ్ళు ఆయాసంతోనూ, జ్వరంతోనూ బాధపడుతూనే వుండేవారు, క్వినైనువంటి మందులు అప్పుడు వారికి ఇయ్యలేదు. ఏమంటే- అలాటివి డాక్టరే ఇవ్వాలని ఏదో పొరపాటున ఉత్తరువు ఈయబడింది.

వాళ్ళు చేరిన మకాములలో మా యేనుగుల మకామే మొదటిది. చివరి మూడు ప్రయాణాల్లోనూ వాళ్ళు ఏనుగులపై ఎక్కి వెళ్ళారు. జబ్బు మనుష్యులను ఏనుగుల మీదనే తీసుకురావలసి వచ్చింది. మిగిలిన వాళ్ళకు కూడా చిత్తడి నేలలో వెళ్లడం సాధ్యం కానందున మొత్తం మీద అందరినీ ఏనుగుల పైనే ఎక్కించవలసి వచ్చింది. వాళ్ళ సామానులను కూడా ఆ రీతిగానే పంపాము. ఏనుగులూ, ఊజీలూ ఎంతో జాగ్రత్తగా ఈ పనులు నెరవేర్చడం జరిగింది.

ఒక్క ఇండియను సిపాయీలే కాదు; బ్రిటిష్ అధికారులూ కూడా, కంచరగాడిదలను ఎంత భద్రంగా చూస్తామో, ఏనుగులను కూడా ఆ రీతిగానే చూడాలని ఎంత మొత్తుకున్నా వినేవారుకారు. నిజానికి ఏనుగులు మరీ విలువైనవి. కంచర గాడిద బురదనేలలలోని బాడిలో కూరుకు పోయేవి — వాటిని బయటికి లాగడమే ఒక

ప్రయాస. చివరకు తెగించి, ఏనుగులను భద్రంగా చూసుకోవాలని తాఖీదులు కూడా పంపాను. అయినా, వాళ్లు సరిగా ప్రవర్తించక గస్తీ కోసం - అందరూ చేరవలసిన స్థలాల్లో గంటల కొద్దీ వాటిని చెట్లకు కట్టివేసి వుంచేవారు. చుట్టు ప్రక్కల మేత మెయ్యడానికి విడవడంలేదు. దీనివల్ల నిష్కారణంగా వాటి జీర్ణశక్తికి భంగం కలిగింది. ఇంకా - వాటి మీద సామానును ఎచ్చుతగ్గులు లేకుండా సరిగా వుంచడానికి బదులు, తమ యిష్టం వచ్చినట్లు పడవేసేవారు. పొట్టి గూర్ఖాలకు ఏనుగులపై కూర్చోవడం వినోదంగా తోచింది. ఒక ఒక ఏనుగు మీద ఆరుగురు గూర్ఖాలు కూర్చోడం చూచి, పట్టుకున్నాను. వాళ్లు వారి తుపాకులను తాళ్ళతో ఏనుగుల చెవులకు - పొగాకొయ్యలకు తగిలించినట్లు కట్టారు! వాళ్ళు యిలా చేస్తూవుండగా నేను చాలాసార్లు చూచాను. నన్ను చూడగానే వాళ్ళు చల్లచల్లగా జారిపోయి అడవుల్లో దాగుకునేవారు. ఆ పిట్టచెట్లు ఎక్కుతూ పట్టుపడిన బడిపిల్లలు పారిపోయే పద్ధతి నాకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది. చివరకు - మాతో సహకరించకపోతే సైనికులకు ఏనుగులను ఎంత మాత్రమూ యివ్వకూడదని అనుకున్నాను.

తర్వాత, యీ విషయంలో ఇండియన్ సైనిక దళం వారికీ, రాయల్ ఇంజినీర్లకూ మధ్య వాదవివాదాలు జరిగాయి. ఆ వివాదాలలో - ఏనుగులను ఉపయోగించే విషయంలో ఎవరి అవసరాలు మొదట చూడాలనేది ఒకటి. ఏనుగులు రవాణా శాఖకు చెందినవా, కలప పనికి చెందినవా అనేది మరొకటి. చిన్‌డ్విన్ ప్రాంతాల్లోని పరిస్థితులను బాగా అవగాహన చేసుకున్న వాళ్ళందరూ ఏనుగులు అక్షరాలా కలపపనికి సంబంధించినవని చెప్పి తీరుతారు. కాని, ఆరోజుల్లో అవి రెండు విధాలా ఎంతో సహాయం చెయ్యవలసి వుండడంచేత ఇరుపక్షాలకూ తృప్తి కలగవలసివుంది.

ఏనుగులతో కలిసి పని చేసిన వారికి, అవి దేనికి చెందినవో స్పష్టంగా తెలిసినా, ప్రధాన కార్యాలయంవారికి దీని నిర్ణయం చాలా కష్టతరం ఐనది. ఆ తర్వాతనే ఏనుగుల జట్లు (Elephant Companies) ఏర్పడ్డవి. వాటిని గూర్చిన యుద్ధపరికరాలూ, ఏర్పాట్లూ మున్నగు సమస్యలు బయలుదేరినవి. జపాను యుద్ధం ముగిసిన తర్వాత కూడా ఏనుగుల హోదా ఏమిటో నిర్ణయంకాలేదు ఇప్పటికీ కూడా నిర్ణయం కాలేదనే నా నమ్మకం. 1895 లో రాయల్ ఇంజినీర్ల శాఖలోపనిచేసిన డైసీ(Daisy)యొక్క ఆత్మను ప్రమాణంగా సాక్ష్యం కోరి తీసుకువస్తే బాగుండేదని తోచేదినాకు. ఆ సమయంలో నేను ఏనుగులను చూచుకునే నా పనిలోనే మునిగివుండే వాడిని. ఈ విషయంపై నెలల తరబడి చర్చిస్తూ కాగితాలు వ్రాయడానికి నాకు తీరిక లేదు. కేవలం తార్కిక వివాదానికి సంబంధించిన యీ సమస్యను కాగితాల కెక్కించి, నెలల తరబడి కట్టలు కట్టివుంచి తన అసమర్థతను చాటే ఒకానొక వ్యక్తివల్ల, మా.కార్యక్రమం సరిగా జరగనివ్వక పోవడం మాత్రం చాలా దుఃఖకరమని చెప్పవలసి వస్తున్నది.

౧౨

బర్మాను తిరిగి స్వాధీనం చేసుకోవాలని 1943 అక్టోబరులో సంకల్పించి తగిన బందోబస్తు చేయసాగాము. ఆ శరదృతువులో మా ఏనుగుల మకాము వసతి గృహంగా (Hostel) మారింది. ఎంతో మంది అక్కడ బసచేసేవారు. మార్చి నెల వరకూ ఈ వసతి గృహం పనిచేసింది. టెలిఫోను ఏర్పాటు జరిగింది. ఎవరో ఒకరు ఎప్పుడూ ఫోనులో పిలుస్తూనే వుండేవారు: "రేపు పగలు పదిగంటలకు ఒక

ప్రధానవ్యక్తి అక్కడికి వస్తున్నాడు. అన్నిటికన్నా ముఖ్యంగా ఏను గులు పనిచెయ్యడం చూడాలని అతని సంకల్పం. దానికి ఏర్పాటు చేస్తారా?" అని. ఇలాంటివే ఎన్నో!

అందరితోనూ కలిసి వుండడం ఎంతో ఉత్సాహంగా వుండేది. రాత్రులు అక్కడికివచ్చిన ప్రతివారితోనూ స్నేహపూర్వకంగా వాద ప్రతివాదాలు జరిపేవాడను. ఏ పనిలోనూ అలసట లేదు. బర్మాను ఎప్పుడు, ఏవిధంగా స్వీకరించేదీ ఎన్నో సారులు "జనరల్ స్టాఫ్"కు తెలిపివుండాలి. అక్కడికి మొదట వచ్చిన వారు మలేరియా పరిశోధ కులూ, ఆయుధ శకటాలు నడిపే నిపుణులున్నూ.

నేను మలేరియా పరిశోధకులతో కలిసి జీపులలో కనుమలు తిరగడంలోనే రోజులుగడిచిపోయేవి. ఆపరిశోధకులు కొన్ని 'ఐవిన్'లు (Iwins = దట్టమైన అడవులలో వుండే నీటి పల్లములు) చూచి, అవి నిలవ నీరువుండే చోటులనీ, అలాంటి చోట్లలో మలేరియా కలుగజేసే దోమలు వుండడానికి వీలుందనీ, ఆదోమలు అక్కడచేరకుండా చూడా లనీ అన్నారు. ఆ నీరు నిల్వనీరు కాదనీ, మరొక పల్లంనుంచి నీరు ప్రవహించి, ఇందులోంచి మరోచోటికి పోతూవున్నదనీ నేను వివరంగా చెప్పగా, దానికి సమాధానము లేదు! మణిపూరు, ఆసాము కనుమల్లో వుండే చెట్లు చేమలకూ, జంతువులకూ, కాబా కనుమలలోని వాటికీ ఎంతో తేడా వుందనీ, ఇక్కడి దోమల అలవాట్లు వేరనీ వివరించాను. అడవులలో వున్నవారు గాని, ఏనుగులుగాని, ఆ పల్లాల ప్రక్క ఎప్పుడూ పోవడంలేదని కూడా వాదించాను.

ఏనుగులను గమనించు కోవడంతోనూ, అతిథులకు ఏర్పాట్లు చెయ్యడంతోనూ నాకు సరిపోయేది. సైన్యం తిరిగి తప్పక వస్తుందనే నిశ్చయం, వేగంగానే వస్తుందనే నమ్మకం ఏర్పడినవి. ఏనుగుల

8

దంతాల చివరి భాగాలతో చేసిన వస్తువులూ, దంతపు కట్టుగల చేకు గోట్లాలూ గిరాకీ పొందాయి. వాటిని ఊజీలే తయారు చేశారు.

కనుమలోని బురద శీఘ్రంగానే ఎండిపోసాగింది. 23-వ సేనా దళం స్థానంలో 20-వ దళం రావలసివున్నది ఆ సేనకు సంబంధించిన శకటాలు వచ్చే లోపునే నదులపైని, కాల్వలపైని చాలా వంతెనలు తయారయాయి. ఉత్తరాన మ్యోతిట్ (Myothit) వరకూ, తూర్పున సిటాంగువరకూ, దక్షిణంలో విటోక్ (Vitok) వరకూ నిరాటంకంగా సైన్యాలు వెళ్ళడానికి మార్గాలు ఏర్పడ్డాయి.

ఏనుగులు అప్పుడప్పుడు మూటలు మొయ్యడానికి ఉపయోగించబడేవి. కాని, వాటి ముఖ్యమైన పనిమాత్రం అప్పట్లో వంతెనల నిర్మాణమే. రవాణాకు వాటిని వుపయోగించేటప్పుడు, వాటిని జాగ్రత్తగా చూచుకోవాలని సైన్యాన్ని హెచ్చరించవలసి వస్తూనే వుండినది.

సైనికులూ, ఊజీలూ ఒకరి నొకరు హాస్యం చేసుకుంటూ వినోదంగా కలిసి పని చేసేవారు. ఊజీలు సైనికుల పనివాళ్ళుగా పద్దుకు ఎక్కలేదు. స్వేచ్ఛగా ప్రవర్తించేవారు. మనుష్యులను మాడ్చి వేసే ఎండలో వాళ్ళు తమ యిష్టం వచ్చిన - నీడవున్న చోటికి ఏనుగులను తోలుకొని పోయేవారు. వాళ్ళను జమ్మాదారుగాని, మరే సైనికోద్యోగి గాని అడ్డినా లక్ష్యపెట్టేవారు కారు.

ఏనుగుల అవసరం ఎంతో ఎక్కువైంది. అడిగిన అందరికీ వాటిని పంపడం అసాధ్యం కూడాను. అసలు వాటికి తీరికలేదు. కొన్ని వంతెనలు నిర్మిస్తూ వుండేవి. కొన్ని పడవల తయారీకి కలపను తెచ్చేవి. కొన్ని గస్తీ దళాలకు సాయపడేవి. అప్పుడు మా దగ్గిర డెబ్బయి ఎనిమిది ఏనుగులు మాత్రమే వుండేవి. అవి, నేను అనుకున్న

దానికంటె చాలా ఎక్కువ వేగంగా పని చేసేవి. కాని, అవి పని చేస్తూవున్న సమయంలో మోటారు డ్రియివర్లు వేగంగా బళ్ళు నడుపుతూ, వాటిని తప్పించుకుని వెళ్ళేటప్పుడు ఎక్కువ ప్రమాదాలు సంభవించేవి. అవి పని చేసే చోట్లలో డ్రయివర్లు మెల్లగా నడపడం నేర్చుకున్నా ప్రమాదాలు తగ్గిపోయాయి.

ఏనుగులు పోట్లాడుకోవడంలో కొన్ని ప్రమాదాలు జరిగాయి. నాకు మిక్కిలి ప్రియమైన బందూలా (Bandoola) అనే మగఏనుగు రెండు ఏనుగులను చంపివేసింది.

ఒక యేనుగు రాత్రి తిరుగుతూ తిరుగుతూ తన హద్దులోకి వచ్చే సరికి - ఒక గూర్ఖా పారావాడు వెన్నెలలో తళతళలాడే దాని దంతాలకు వ్యామోహపడి దానిని తుపాకితో కొట్టాడు. ఆ తుపాకి గుండు దాని కంటికింద నుంచి దౌడలోంచి దూరుకొని పోయి, గుండెల్లో చిక్కుకున్నది. ఆ దవుడకు అయిదు షిల్లింగుల నాణెమంత రంధ్రం ఏర్పడింది. శస్త్రచికిత్స చేసి, ఆ గుండు తియ్యావలసి వచ్చింది. ఆ గాయం నయమై, ఏనుగు పనిలోకి రావడానికి మూడు వారాలు పట్టింది.

కొత్తరకం చిక్కుకు ఇది ప్రారంభం! ఒకమారు రాత్రి భాగంలో ఏనుగులు తిరుగుతూ మకాములను చిందరవందర చేస్తే - అదే అలవాటై పోతుంది. ఏనుగులు మళ్ళీ మళ్ళీ చికాకులు పెడుతూనే వుంటాయి. చాలా మైళ్ళ దూరంనుంచీ రాత్రి అంతా నన్ను ఫోనులో పిలుస్తూనే వుండడం జరిగేది.

"అయ్యా! ఒక యేనుగు మా బసలో ప్రవేశించి ఆహార వస్తువులను తిని వేస్తున్నది. దాన్ని చూచి అంతా మిక్కిలి భయపడుతున్నారు. ఏం చెయ్యాలో మాకు తోచలేదు"

"మీ రెవరండి?"

"కాస్కారా (Cascara)" (లేక - అలాంటి సంకేత నామం!)

"బాగుంది! మీరుండే స్థలం ఇక్కడికి ఏడుమైళ్ళున్నది. నేను అక్కడికి వచ్చేలోగా అది పూర్తిగా తినివేసి వుంటుంది. అంచేత లాభం లేదు. దాన్ని పూర్తిగా తినివెయ్యనిండి."

"అంతే కాదు. అది గొడ్డు మాంసపు డబ్బాల మూతలు తీసి వేసి నానాబీభత్సమూ చేస్తున్నది!"

ఇలాంటి వెన్నో తమాషా విషయాలు! ఏనుగులతో సైన్యాన్ని జత చేస్తే యిలాంటివి జరగడం సంభవమే!

వంతెన స్తంభాలను పాతే యంత్రాలకూ, బుల్‌డోజర్లకూ ప్రక్క ప్రక్కనే ఏనుగులు పనిచేస్తూ వుంటాయని మూడేళ్ళ క్రిందట ఎవరైనా చెప్పినట్లయితే నేను నమ్మిఉండేవాడినికాను. నేను జోక్యం కలిగించుకొని వుంటే అవి పనిచేసి వుండేవి కావు. నేను ఊరికే వుండడంబట్టి అవి పని చెయ్యడమే నా సంకల్పమని ఏనుగులూ అనుకున్నవి; ఊజీలూ అనుకున్నారు. తుపాకి గుండు చప్పుడు వింటూనే నిశ్చల బుద్ధితో అవి పని చేసేవి. ఏ గడియలో ఏమి జరుగుతుందో కూడా తెలియక, వచ్చే సంఘటనను ఎదురు చూస్తూ వున్నాము.

నా మనస్సు నిర్విచారంగా లేదు. జపానీయులు మేమున్న ప్రాంతానికి వస్తే నా మనుష్యులనూ, ఏనుగులనూ ఏమి చెయ్యడమో తెలియలేదు. తరచుగా - తరచుగా ఏమిటి - ఎడతెగకుండా నాకు ఫోనుల మీద పిలుపులు వస్తూనే వుండినవి. అక్కడికి వందల కొద్దీ మైళ్ళదూరంలో బర్మా మధ్యభాగంలో వుండే అడవుల భౌగోళిక పరిస్థితులను వివరంగా తెలపవలసినదని. దాన్ని బట్టి శీఘ్ర

కాలంలో ఏదో ఒకటి పెద్ద సంఘటన జరుగుతుందని మాత్రం తోచింది. ఎదురు చూస్తూ వుండడం కూడా ఎంతో చికాకుగా వుండినది. కాని, డిసెంబరు నెల చివర నాకు అదృష్టం కలిసి వచ్చింది. ఇంకా క్రిస్మసు రెండు రోజులున్నదనగా - నాతో సహకరిస్తూ వున్న ఒక సేనాదళ నాయకుడు కేంద్ర కార్యాలయానికి రావలసినదని వార్త పంపాడు. నేను వెంటనే నా జీపులో ఇంఫాలు రోడ్డు మీదుగా ప్రయాణం చేసి వెళ్లాను. ఆ రోడ్డు మీది ఎగుడు, దిగుళ్ళూ, మలుపులూ నాకు బాగా తెలిసినవే! నేను కేంద్ర కార్యాలయంలో అతన్ని కలుసుకుని, కావలసిన సమాచారాన్ని వివరంగా తెలిపి, వందన సమర్పణ చేసి, వెనక్కు రావడానికి సిద్ధంగా వున్నాను. "క్రిస్మసుకు షిలాంగు (Shillong) వెళ్ళడానికి నాకు ఐదు రోజులు సెలవు దొరికింది" అని అతడు సంతోషంతో అన్నాడు.

గాలి ఎలా విసురుతుందో తెలుసుకుందామని "మంచిది, సార్! నాకైతే మూడు రోజులు సెలవైనా చాలును" అని అన్నాను, అతడు "చాలా బాగుంది! ఏడురోజులు తీసుకోండి. సంవత్సరాదిని కూడా మీ కుటుంబంతో హాయిగా గడిపి రండి" అన్నాడు.

మధ్యను ఎక్కడా ఆగకుండా 400 మైళ్ళు ప్రయాణం చేసి, నేను క్రిస్‌మస్ ముందు రోజుకు ఆసాములోని షిలాంగుకు వెళ్ళినాను. అప్పుడు నా భార్య, నలుగురు పిల్లలకూ మేజోళ్ళు నింపుతూ వున్నది. (పండుగకు పిల్లల బహుమతులు మేజోళ్ళలో పెడతారు.) క్రిస్‌మసు ఎంతో ఆనందంగా జరిగిపోయింది. 1944 జనవరి మొదటి తేదీ తెల్లవారు జాము 4 గం॥లకు తిరిగి బయలుదేరి, నీళ్లు కూడా గడ్డకట్టిపోయే చలిలో కొండలమీద ప్రయాణం చేసి మకాము చేరుకున్నాను.

క్రొత్త సంవత్సరం ప్రారంభంలోనే సేనలు కదలడం ప్రారంభించాయి. ఏనుగులు, టామూనుంచి కలేనియో (Kalenyo)కు

వెళ్ళే మార్గాన్ని అభివృద్ధి పరచడానికీ, దానికీ నియమించబడ్డాయి. బైలే (Bailey) వంతెనకూ, హామిల్టన్ (Hamilton) వంతెనకూ, పెద్ద పెద్ద రోడ్లు వేయుటకూ కావలసిన యంత్రసామగ్రి ఎడతెగకుండా వస్తూనే వుంది. అసలు పరిస్థితులు ఏ కొద్ది మందికో మాత్రం తెలుసు. జపానీయులు తమ ఆక్రమిత ప్రదేశాల్లో ముందున్న ప్రాంతాలలోని గ్రామాలను ఖాళీ చేస్తున్నారు. వారు కాబా కనుమను ఆక్రమింప బోతారనే వదంతులు పుట్టాయి. అందుకోసం వారు సన్నాహాలు చేస్తూవున్నారట!

ఒకనాటి సాయంకాలం మా పక్షానికిచెందిన విమానాలు విన్‌గేట్స్ చిండిట్సు (Wingate's Chindits)మాతలమీదినుంచి ఎగరడం చూశాను. వాటివెనక మరికొన్ని విమానాలుకూడా వస్తాయని ఎదురు చూచాము. కాని, మరేవీ రాలేదు. మేము రోడ్డుల నిర్మాణం చెయ్యసాగాము. వంతెనల స్తంభాలకు దన్నుగా కర్ర దూలాలను వుంచాలని నిర్ణయించడం వల్ల ఏనుగులు తమ మామూలు పనికి రెండు రెట్లు - ఎక్కువకాలం పని చేయవలసి వచ్చేది. అలా పని చెయ్యడంలో ఎంతో సాహసం చూపేవి. 1944 వర్షర్తువు రావడానికి ఇంకా మూడు నెలలే అవకాశం వుంది. ఆ కనుమ సంగతి ఎరుగుదును కాబట్టి - అన్ని కాలాల్లోనూ నిరాఘాటంగా రాకపోకలకు తగిన రోడ్డు పడాలంటే బ్రహ్మాండమైన ప్రయత్నం జరగాలని తోచింది.

నేను ఒకనాటి సాయంకాలం నా టేబిలు దగ్గర కూర్చుని లెక్కలు వేస్తూ ఏనుగులు 2,300 టన్నుల కలపను - మూడు నెలలలో రోడ్డు నిర్మాణానికి రవానా చేసినట్లు తేల్చుకున్నాను. అదే సమయంలో డివిజనల్ కమాండరు ఫోనులో నన్ను పిలిచి మరునాడు

దళాధిపతితో కలిసి విందారగించడానికి రావాలని కోరాడు. ఆ ఆహ్వానం, ఎప్పుడూ పిలిచే మామూలు పద్ధతిలో కాక, చాలా గంభీరంగా వుండినది. ఏదో విశేషం వుండి వుండాలని తోచింది నాకు.

మర్నాడు విందు ముగిసిన తర్వాత డివిజినల్ కమాండరున్నూ, దళాధిపతిన్నీ, నన్నొక్కడినీ ఒక గుడారంలోకి తీసుకుని వెళ్ళి ఇలా అడిగారు—"ఇది గొప్ప రహస్య విషయం! మీ ఏనుగుల నన్నింటినీ కూడదీసుకుని ఇక్కడినుంచి బయలుదేరడానికి ఎన్నాళ్ళు కావాలి? కాబా కనుమనుంచి మీరు వాటిని ఏవిధంగా తరలిస్తారు?" అని.

తిరిగీ అక్కడినుంచి సేనలు వెనక్కు వెళ్ళిపోతాయని తెలిసేసరికి నా గుండెలు కొట్టుకున్నాయి. ఈసారి ఏనుగులు సేనలతోనే వెళ్ళ వలసివుంటుందని గ్రహించాను. నేను లేచి డివిజనల్ కమాండరు టేబిలు దగ్గరకు పోయి, అక్కడున్న దేశపటాన్ని పరిశీలించాను. ఆ కనుమలో వుండే ఏనుగుల తత్త్వం నాకు బాగా తెలుసును. వీటిని బట్టి లెక్క వేసుకుని అన్ని యేనుగులనూ ఒకచోట చేర్చడానికి ఐదు రోజులు చాలుననీ, అయితే, రెండు వేర్వేరు స్థలాల్లో వాటిని చేర్చ వలసి వుంటుందనీ చెప్పాను. దానికి వారు సమ్మతించి, వెంటనే ఆ పనికి పూనుకోవాలని ఉత్తరు విచ్చారు.

నా మనస్సు చాలా క్రుంగిపోయింది. కొయ్యబారి పోయానని కూడా చెప్పవచ్చును. నేను వెంటనే నా జీపులో బయలుదేరి ఏనుగుల మకాములకు పోయి మర్నాడు బయలుదేరి అన్నీ ఒకచోట చేరాలని చెప్పి, రాత్రి చాలా పొద్దుపోయాక బస చేరుకున్నాను. తుపాకులు ప్రేల్చిన ధ్వనులు వింటూనే నిద్రపోయాను.

తర్వాత నాలుగు రోజులు మిత్రులం ఒకరి నొకరు కలుసుకో లేదు. అయినా, అనుకున్నప్రకారం ఏర్పాట్లన్నీ జరిగాయి. మకాము

లకు దూరంగా అడవుల్లో వున్న ఊజీల కుటుంబాలనుకూడా ఈలోగా పిలిపించాం.

అంతా సిద్ధంగా వున్నదని నాలుగోనాటి సాయంకాలం ఫోనులో డివిజినల్ కమాండరుకు తెలియజేశాను. టాములోవున్న ఒక్క మకాములోనివి మాత్రం రాలేదు. అన్ని ఏనుగులూ రెండు చోట్ల చేరుకున్నాయి. టామూకు ఉత్తరంగా ఎనిమిది మైళ్ళ దూరంలోవున్న కాంచాంగ్ (Kanchaung) దగ్గర నలభై ఆరు ఏను గులూ, ఇరవై మైళ్లదూరంలోవున్న మింథా (Mintha)లో ముప్పై మూడు ఏనుగులూ వున్నవి. మాకు పదిహేను రోజులకు సరిపడిన ఆహారవస్తువులూ మొదలైనవికూడా ఆ రెండుచోట్లకూ వచ్చిచేరాయి.

టామూకు దక్షిణంగా చిన్‌డ్విన్ నది తూర్పుతీరంలో కలే మియో ప్రాంతంలో జపానీయులు ఏదో చేస్తూన్నారని వదంతులు బయలుదేరాయి. సరిగా తెలియకపోయినా ఏదో కథ జరుగుతోందని బర్మీయులనుకున్నారు. కాని, తమకు ప్రియమైన చిన్‌డ్విన్‌కు పడమ రగా వెళ్ళిపోవలసి వస్తుందని మాత్రం అనుకోలేదు. అయినా వారు మా వెంటరావడం విషయమై నాకు ఎన్నడూ అనుమానం లేదు !

మార్చి 16-వ తేదీ మధ్యాహ్నం ఫోను మూలంగా తెలిసింది, సేనలను తరలించాలని. జపానీయులు చిన్‌డ్విను నదిని దాటి మేముండే స్థలానికి ఉత్తరంగా - చాలా వేగంగా వస్తున్నారని నాకు తెలుపబడింది. టోనే (Tonhe) మార్గంలో వారి పారా మనుష్యులు మా సేనలను అతిక్రమించి వెళ్ళిపోయారు.

జపానీయులు అసంఖ్యాకంగా చిన్‌డ్వినును దాటి ఉత్తరంగా వెళ్లిపోయారనీ, వాళ్లు రెండు ముఖ్యమార్గాలలో వెళ్ళారనీ, మా

సేన ఒకటి తెల్లవారుజామున బయలుదేరి మింతాకు అవతల ఉత్తరపు రోడ్డున వెళ్ళగలదనీ అర్ధరాత్రికే వార్త వచ్చింది. ఈ కడపటివార్త నాకు ఆనందాన్ని కలిగించింది.

రాత్రి పూర్తిగా ప్రయాణం చేస్తున్న బండ్ల చప్పుడు వినిపిస్తూనే వున్నది. మర్నాడు పగలు 11 గం. వరకూ మరేసమాచారమూ తెలియలేదు. కాంచాంగ్‌లో అంతా సక్రమంగా జరుగుతున్నదనీ, తక్కినచోట్ల అనుకున్న ప్రకారం జరగడంలేదనీ నేను సేనాధిపతికి కేంద్ర కార్యాలయానికి ఫోనులో తెలిపాను. వచ్చే యేనుగులకు తగిన యేర్పాట్లు చెయ్యవలసి వుంటుంది కనుక, ముందుగానే మిగిలి వున్న కారెనులతోకూడా ఇంఫాలు కేంద్రానికి రావలెనని వెంటనే వార్త వచ్చింది. ఆ తరువాత మా ఏనుగుల శిబిరం ఉండిన స్థలం వాయు విమాన ప్రతిరోధక, యంత్రశకట ప్రతిరోధక శిబిరంగా మారిపోతుంది. ఈ సంగతి చెప్పగా, మా బర్మీయనాయకులు దిగ్భ్రమ చెందారు. కాని, బాగా తర్ఫీతు అయిన సేనవలెనే వారు ప్రవర్తించారు.

ఈసారి జపానీయులు పెద్ద యెత్తున వచ్చేటట్లు స్పష్టమయింది. అలాగున జరిగితే మింతా (Mintha) లో వున్న ఊజీలు తమ చాకచక్యాన్ని వుపయోగించి, వాళ్ళకు చిక్కకుండా పడమరగా కొండల్లోకి పారిపోగలరని మా ఆశ. కాని ఆ విధంగా జరగలేదు. మాదగ్గర నుంచి ఏమీ ఉత్తరువులు రానందున, మా ఊజీలు దిగ్భ్రమ చెందుతూ అక్కడే ఎదురుచూస్తూ వుండిపోయారు. జపాను సేనలు మింతాలో ప్రవేశించడానికి ముందే, జపాను గస్తీదారులు, మాఊజీలకు మరెవ్వరితోనూ సంబంధం లేకుండే విధంగా వాళ్ళ వెనకవైపున వున్నారు. వాళ్ళనుగురించిన వార్తలేమీ మాకు తెలియలేదు. వాళ్లు కొండల్లోకి పోగలరనే గుడ్డినమ్మకం మాత్రం వుండినది.

మేము అక్కడినుంచి ఆ సాయంత్రం దిగులుతో బయలు దేరాము. మేమున్న స్థలానికి రెండుప్రక్కలా ఘోరంగా యుద్ధం జరుగుతున్నట్లు తెలిసింది. దక్షిణంవైపు మాకు ఆయుధాల ధ్వనులు వినిపిస్తూనే వుండినవి.

నేనారాత్రిని, ఇంఫాలు సమతలంలోని పలేల్ లో గడిపాను. అక్కడికి చేరుకొనేసరికే చాలా రాత్రి అయింది- మేము ఊహించి నట్లుగానే జపానీయుల దాడి ప్రారంభమైనది. మింతాలో వుండి పోయిన ఏనుగుల గతి ఏమయిందో - ప్రయాణం చేస్తూవున్న ఏను గుల భవిష్యత్తు ఎలాగు వుంటుందో అనే ఆందోళన నాకు ఎక్కువై నది. ముప్ఫయిమూడు ఏనుగులు ఎలాగూ స్వాధీనం తప్పిపోయాయి. తక్కిన వాటిని గురించి ఇదమిత్థమని నిర్ణయించడానికి వీలులేదు. ముందేమి చెయ్యాలో తెలియలేదు. ఇదంతా అయోమయం కాక మరేమిటి ?

తర్వాత, సమాచారం తెలిసింది. మింతా ఏనుగులు బయలు దేరనేలేదట. వాటిని ఊజీలు అడవులలోని రహస్య స్థలాలకు తీసుకు పోయారట ! వాళ్ళదగ్గర 15 రోజులకు కావలసిన పదార్థాలు వున్నా యట. ఈ సమాచారం విన్నతర్వాత మనస్సు కుదుటబడింది ! వాళ్ళంతా కలిసి బయలుదేరివుంటే, జపానీయులు వాళ్ళను వెంబ డించి, తరిమి పట్టుకొనే వుందురు. వాళ్ళను పట్టుకుంటే, జపా నీయులు ఏనుగులనూ, ఊజీలనూ తమ రవానా శాఖలో చేర్చి ఉప యోగించుకొని వుందురు. వాళ్ళు ఊజీలనూ, ఏనుగులనూ కనిపెట్టి, పట్టుకుని, ఉపయోగించుకోడానికి కొంతకాలం పట్టవచ్చును !

నేను కాపాడి, ప్రయాణం చేయిస్తున్న నలభై అయిదు ఏను గులనూ వెంటనే కలుసుకుని, ఇంఫాలు సమతలానికి ఉత్తరంగా తీసుకు

పోయి, అక్కడినుంచి పడమరగా వెళ్లాలనీ, లేకపోతే అవి దక్కక పోవచ్చనీ మా దళనాయకుడు నన్ను పిలిపించి చెప్పాడు.

మా యేనుగులు ఊజీలతోనూ, వారి కుటుంబాలతోనూ వాంగ్ జింగ్ (Wangjing) దగ్గర ప్రధాన మార్గాన్ని దాటిపోవడానికి సిద్ధంగా వుండగా, నేను ఎనిమిది లారీలను తీసుకునిపోయి వాటిని కలుసుకున్నాను. వారి కుటుంబాలను జాగ్రత్తగా చూసుకుంటానని ఊజీలకు వివరంగా చెప్పాను. వారి కుటుంబాలూ, పిల్లలూ ఎక్కిన లారీలను మెక్ విట్టీ (Mc Vittie) అనే ఆంగ్లో-బర్మీయునికి అప్పగించి "వెంటనే వీళ్ళను తీసుకుని మణిపూరు రోడ్డు రైల్వే చేరుకుని అక్కడి నిర్వాసుల కాంపుకు వెళ్లమని అతనితో చెప్పాను. ఆ కాంపు అప్పటికే సన్నగిల్లినది.

నాటి సాయంకాలం ఆరు గంటలకు లోపునే ఆ రోడ్డును శత్రువులు తెగగొట్టారు. నేను ఆ మధ్యాహ్నం మూడు గంటలప్పుడు కూర్చుండిన వంతెన దగ్గరే యీ పని జరిగింది.

ఇంఫాల్ – టిడ్డిం రోడ్డు తెగగొట్ట బడింది; బిషణ్ పూరు (Bishanpur) రోడ్డును శత్రువులు అడ్డుకొన్నారు. లండింగ్ - సిల్ హెట్ (Lumding - Sylhet) కొండ రైలు మార్గాన్ని చేరడానికి, పడమట హాఫ్లాంగ్ (Haflong) మీదుగా పోయే కాలిబాట తప్ప మరొక మార్గం లేదు. ఆదారి టామెలాంగ్ (Tamelong) గ్రామం పైనుంచి వెళుతుంది. ఒక దఫాకు పదమూడు జట్టులలో 300 మంది అగ్రగామి భటులను పంపదలచుకున్నాం.

ఇంఫాలు కనుమ నుంచే ఆసాములోని సుర్మా (Surma) కనుమను చేరేది ఎలాగనేదీ పెద్ద సమస్య! అది పడమటి వైపు ఉంది. ఆ రెండు కనుమలకూ మధ్య ఐదు వరసలలో, ఐదువేల నుంచీ ఆరు

వేల అడుగుల ఎత్తు పర్వతాలున్నవి. మైలుకు పావు అంగుళం కొల తలో తయారైన దేశపటము తప్ప, అక్కడి స్థలాలను గురించి తెలుసు కునే మార్గం లేదు. ఆ స్థలాలను గురించి నాకు ఏమీ తెలియదు. చీకటి పడకముందే నేను సైన్యాధికారిని (Brigadier, General Staff) చూచి, శత్రు సేనల ఆచోకీ అనే సంగతే యిక లేదని వివరించి, మా 96 ఏనుగులకూ పదిహేను రోజులకు ఆహార వస్తువులు సరఫరా చేయించాలనీ, శత్రువుల బారి పడకుండా తప్పించుకుంటాననీ చెప్పాను. దానికి అతడు సమ్మతించలేదు. కాని, తర్వాత దళాధిపతి (Coops Commander) నన్ను కలుసుకుని, కోరిన వాటిని యిచ్చాడు. మార్గ ములో టామెలాంగ్ (Tamelong) చేరిన తర్వాత సుఖంగా చేరినట్లు తెలియజేయమన్నాడు. నేను నాతో వున్న కారెనులందరికీ తుపాకు లనూ, పిస్తోళ్ళనూ యిచ్చాను.

నేను, ఏనుగులను కలుసుకోడానికి వెళ్ళినప్పుడు నా వెంట లాబ్రేడర్ కుక్క కాబర్ (Cobber) మాత్రం వుండినది. అది నా సీటుకు వెనుక ఆనుకుని, నామీద దయతలచినట్లుగా, నా ముఖం మీది చెమట బిందువులను నాలుకతో నాకి, తోక ఆడించి ఉత్సాహాన్ని వెల్ల డించింది. నాకు ముందున్న అద్దంలోంచి చూస్తూ పళ్ళిగిలించి సంతో షము వ్యక్తం చేసింది, "అదిగో, సుర్మా కనుమకు వచ్చేశా" మనే భావాన్ని తెలుపుతూ.

ఆ సాయంత్రం మా మకాములో చివరకు ఏమి చెయ్యాలో చర్చించాము. 1944 ఏప్రిలు 5 వ తేదీ తెల్లవారు జామున బయలు దేరవలసి వున్నది. రాత్రి చాలా భాగం వాన పడుతూనే వుంది. ఇంఫాలు మర్నాడు శత్రువులకు చిక్కే స్థితిలో వుండినది.

౧౬

నలభై ఐదు ఏనుగులూ, సాయుధులైన నలభైమంది కారెనులూ తొంభైమంది మావటివాళ్లూ, వారి సహాయులూ, అరవై నలుగురు శరణార్థులైన స్త్రీ శిశువులూ, వాళ్లను గమనించడానికి నలుగురు వుద్యోగులూ: ఇదీ మా బలగం ! నేనొక ఎత్తు ప్రదేశంనుంచి చూస్తూ వున్నప్పుడు - అడవి యెలుకల వెనుక నల్లచీమల బారు నడుస్తున్నట్లు కానవచ్చింది. జపానీయుల పోరాలనుంచి తప్పించుకున్నందున మా బర్మీయులు ఎంతో ఉత్సాహంతో వున్నారు. ఎలాగో ఒకలాగు ఎప్పుడో ఒకప్పుడు సుర్మా కనుమను చేరగలమనే నమ్మకం కలిగింది.

నడకవల్ల స్త్రీ, శిశువులు చాలా అలసిపోయారు. అయినా అద్భుతంగా తమ విధిని నెరవేర్చారు. మేము ఉదయం బయలుదేరే టప్పుడు ముగ్గురు స్త్రీలూ, నల్గురు శిశువులూ మాత్రం ఏనుగులపై ఎక్కారు. వాళ్ళు సుస్తీగా వుండడమే దానికి కారణం! ఆ సాయంత్రానికి పది, పదిహేను మంది దాకా ఏనుగుల మీద వున్నారు. ఊజీలు దయతలచి వాళ్లను ఎక్కించారు. కాని ఏనుగులు ఇదివరకే ఆహారపదార్థాలతోనూ, మిగిలిన సామానులతోనూ - తగని బరువు మోస్తూవుండడంవల్ల ఎంతో శ్రమతో మెల్లగా నడుస్తున్నవి. కొన్ని తమ శ్రమను వ్యక్తం చేస్తూవున్నవి. వాటి శ్రమను తగ్గించాలంటే మిగిలిన వాటి మీద ఎక్కువ బరువు వెయ్యవలసి వుంటుంది. అది వాంఛనీయం కాదు. రోజుకు రోజూ వాటికి శ్రమ ఎక్కువగా వుండినా, మేము ఆహార పదార్థాలను వాడుకుంటూ వున్నందున బరువూ తగ్గేది.

హాచిన్ (Haochin) నుంచి, పడమటగా - ముందు ఏమున్నదో తెలియకుండానే ప్రయాణం చేసినా, చివరకు సుర్మా కనుమను చేరు

కున్నాం. దేశపటాన్ని చూడగా ఆ కనుమ అంచున ఎత్తుగా బలదాన్ (Baladan)టీ ఎస్టేటు(తేయాకు తోట)వున్నట్లు తెలిసింది. అక్కడ ఒక బంగాళావుంటుందనీ, అక్కడ ముసలియజమానీ, పడుచుభార్యా వుంటారనీ, అక్కడ వెన్నరాచిన రొట్టెలూ, టెలిఫోనూ వుంటాయనీ మేము తమాషాకు వూహాలపైవూహాలుపోనిస్తూ హాస్యంగామాట్లాడుకున్నాం.

మే మిప్పుడు ఐదువేల అడుగుల ఎత్తున వున్నాము. సాధారణమైన 'ఏనుగుల లైను' కంటె ఎంతో ఎత్తున వున్నామన్న మాట! ఏనుగులు కష్టపడుతూ, ఎంతో మెల్లిగా ఎక్కేవి. వయస్సు మళ్ళినవి పడిపోతూవుండేవనే చెప్పాలి. కాని, అక్కడి దృశ్యాలు ఎంతో ఆశ్చర్యము కలిగించాయి. మా మనస్సులలో ఎన్నెన్ని చికాకులున్నా, ఆ దృశ్యాలను చూస్తే అవన్నీ మరపునకు వచ్చాయి.

మేము దినాని కొకటి వంతున ప్రవాహమూల స్థానాన్ని దాటిపోతే ఆ వెనుక, ఏనుగులకు సమృద్ధిగా ఆహారం దొరకగలదనీ ఆ పల్లపు ప్రదేశంలో కావలసినంత నీరు లభించగలదనీ నమ్మకము కలిగినది.

మేము వుండే ఆ ఉన్నత ప్రదేశంలో చలి విపరీతం! అందువల్ల కొందరు స్త్రీలకు చలిజ్వరం వచ్చింది. త్వరలోనే జ్వరంపడ్డ రోగుల సంఖ్య ఎక్కువైంది, వాళ్ళను జాగ్రత్తగా చూచే బాధ్యతకూడా పైని పడింది. రాత్రులందు విపరీతంగా వానలు పడుతూవున్నందున ఎంతో చిక్కుపడవలసి వచ్చేది. వీటికితోడు కాలిపండ్లూ, నులిగడుపూ రొమ్మువాపూ, రొమ్ముకురుపులూ కూడా రావడం జరిగింది. కొన్ని ఏనుగులకు కూడా ప్రథమ చికిత్స అవసరమైంది. ఇలా వున్నా, జబ్బుతో వున్నవాళ్లు కొంచెం విశ్రాంతి తీసుకొని, ఆరోగ్యం పొందడానికైనా ఒకచోట కొంచెంవుండడానికి వీలుకలగలేదు. జపానువాళ్ల

భయంనుంచి నిలపకుండా ప్రయాణం సాగింపవలసి వచ్చినది. ప్రతి దినమూ తెల్లవారినది మొదలు సాయంత్రం అయిదు గంటలు దాటే దాకా ప్రయాణం సాగించేవారం!

హోచిన్ నుంచి ముందు వెళ్ళేటప్పుడు - ఏనుగులు నడవడానికి అనుకూలంగా దారిని చెయ్యడానికి - కొందరు మాకంటె ముందుగా వెళ్ళేవారు. ఏదైనా నదినిగాని, ప్రవాహాన్నిగాని దాటవలసివచ్చినప్పుడూ, ఎక్కేటప్పుడూ - ప్రక్కప్రక్కలకు పోకుండా సరియైన మార్గంలో వెళ్ళేటట్లు, మార్గం సరిచేసే జట్టుదారులకు గట్టి సలహాలు యిచ్చేవాడను. అక్కడ వేటాడేవారు వాడే మార్గాలయినా లేవు. అక్కడ అట్టివాళ్లున్నట్లులేదు. కొన్ని పల్లెల గుర్తులు కానవస్తాయిగాని, యిప్పుడీపల్లే కానరాదు. ఏమంటే అక్కడివాళ్లు సంచారంచేసే వ్యవసాయదారులు ! వాళ్లు కొండచరియలపై పోడు వ్యవసాయం పెట్టి పంటరాగానే, మరోచోటికి పోతూవుంటారు. మూడేళ్లకు ఒకసారి మాత్రమే ఆ వ్యవసాయం సాధ్యం. అందువల్ల వాళ్లు మరోచోట వ్యవసాయం చేసుకుంటారు. వాళ్లతోపాటు ఊళ్ళుకూడా జరుగుతూ వుంటాయి.

మేమొక పెద్ద ప్రవాహం దగ్గరకు వచ్చాం. అక్కడ ఏనుగులకు మేత సమృద్ధిగావుంది. మేమందరమూ బసచెయ్యడానికి తగిన స్థలం ఏర్పాటు చేశాను. తర్వాత ఆ ప్రవాహం దాటి మరొక కొండ వచ్చేవరకూ వెళ్లాను. మర్నాడు అక్కడినుంచి ఎలా వెళ్లేదీ నిర్ణయించడమే నా ఉద్దేశం. ఎగుడు, దిగుళ్లలో శ్రమపడుతూ, దట్టమైన వెదురు అడవుల్లోంచి రెండు మైళ్ళు వెళ్లాను. అక్కడ మూడు, నాలుగువందల అడుగుల యెత్తున్న రాతికొండ చరియ అడ్డంవచ్చింది. దాన్ని ఎక్కడం అసాధ్యం. దక్షిణ దిక్కుగా తిరిగి, దాని పక్కనుంచి

ఎక్కడైనా ఎక్కడానికి వీలుపడుతుందేమో అని మైలు దూరము వెళ్ళాను. ఎక్కడా సందు దొరకలేదు. నిటారుగావున్న ఆ కొండను ఎక్కడం నావంటి వానికే సాధ్యం కాదు! ఇక ఏనుగుల సంగతి చెప్పనక్కరలేదు. కొంచెం దూరం వెళ్ళగా పెద్దపెద్ద పాత వెదుళ్ళ ముక్కలు ఒకచోట కానవచ్చాయి. ఏడాదికిందట వాటిని కత్తితో కొట్టినట్లు వూహించవచ్చు. ఒక చిన్ గ్రామస్థుడు అలా చేసి వుంటాడనీ, ఆతడు కొంత కాలం అక్కడ నివసించి వుంటాడనీ కూడా అనుకున్నాను. దేశ పటాన్ని బట్టి చూస్తే ఆ కొండకు, పడమటి తట్టున ఖాళీ చెయ్యబడిన గ్రామం ఒకటి వుండినట్లు తెలుస్తున్నది కూడా.

తిరిగి బసకు వస్తూవున్నప్పుడు ఆ కొండకు ఒక చోట, మనుష్యులు ఎక్కడానికి కొంత వీలుగా ఒక సందు కానవచ్చింది. దాని మూలంగానే అవతలి మనుష్యులు యీ వైపు దిగి వుంటారు. కాని, యీ భాగం నుంచి ఏనుగులు ఎక్కడం అసంభవం! నేను, ఆ స్థలం జ్ఞప్తిలో వుండడానికి, అక్కడున్న ఒక చెట్టుకు పెద్ద గంటు పెట్టి గుర్తు పెట్టుకున్నాను. మేము ముందుకు వెళ్ళవలెనే కాని, వెనకకు వెళ్ళడ మనేది లేదు.

మకాముకువచ్చి, అక్కడ రెండురోజులు వుండవలసి వుంటుందని చెప్పాను. శరణార్థులైన స్త్రీలూ, శిశువులూ చాలా ఆనందించారు. పొద్దు పోకుండానే వాళ్ళు గుడ్డలు ఉతుకుకుని, ఆరవేసుకున్నారు. ముందుకు సాగిపోవడానికి ఎంతో శ్రమపడి పనిచెయ్యాలనీ, ఎన్నో కష్టాలు పడవలసి వుంటుందనీ వివరంగా చెప్పాను. ముందు 'దారి' లేనందున ఇలా చెప్పలేదు. ఏమంటే - కడచిన చాలా రోజుల నుంచీ మేము ఒక సవ్యమైన మార్గాన్ని అనుసరించనే లేదు. ఎక్కడానికి తగిన స్థలం దొరక్కపోవడమే ఈ నాటి చిక్కు. అది దొరికితే ఆ మీద మార్గాన్ని నిర్మించుకోవచ్చు.

నిట్ట నిలువుగావున్న ఆ పర్వతభాగం తప్ప, తక్కిన చోట రెండు రోజులు త్రవ్వడమూ, చెట్లు కొట్టడమూ చేసి సులభంగా మార్గం చేసుకోగలమని తోచింది. అది ఇసుక రాయి కావడం వల్ల దానిమీద మార్గాన్ని నిర్మించవచ్చు. ఏనుగులు దాని మీదకి ఎక్క గలవా అనేదే సందేహం! ఏమంటే కొన్ని చోట్ల ఏనుగులు వెనక కాళ్ళపైననే నిలవవలసి వుంటుంది కూడా!

పోటోక్ (**Po Toke**) బర్మీయ నాయకులలోనివాడు కాడు. కాని ఏడు ఏనుగుల జట్టును గమనిస్తున్నవాడు. అతని జట్టులోనే బందూలా (**Bandoola**) వున్నది. అతడు హఠాత్తుగా నా దగ్గరకు వచ్చి "మన ప్రియాణంలో బందూలా ముందు నడుస్తుంది. దానికే అసాధ్యమైతే మరేవీ ముందుకు కదలనే లేవు. అగాధం వుంటే, ఆ వైపు అది చూడదు. నేల కుంగి పోయేటట్లు తోస్తే అడుగు వెయ్యదు. కొంత దూరం వెళ్లి - ఆ పైని సాధ్యం కాకపోతే - వెనకవైపు కళ్లు ఉన్నమాదిరిగా జాగ్రత్తగా వెనక్కు వస్తుంది" అని అన్నాడు.

బందూలా చాలా క్రూరమైన ఏనుగు; అయినా గొప్పది!

పోటోక్ ఇలా చెప్పినాడే గాని, చెప్పిన దానిలో సగమైనా యథార్థమని అతనికైనా నమ్మకం వున్నదో, లేదో? కాని, అతనికి నిరుత్సాహం కలిగించదలచుకోలేదు. బందూలా చాలా సమర్థమైన దని అందరూ ఒప్పుకున్నారు. అంతటితో ఆ విషయాన్ని విడిచి పెట్టాము.

అంచులు ఇరుకుగా వుండడం, ఇసకరాళ్లు, రాళ్లుపైకి చొచ్చు కొనడం - మొదలైన వాటితో మార్గం తయారవడం కష్టమే! దీనిక తోడు, దిగుడు మార్గంలో పొదలూ అవీ లేకుండా దారి చక్క

చెయ్యాలి. తమ వీపుమీది సామానుతో ఏనుగులు నడవడానికి వీలు పడేటట్లు దారిని కొంత వెడల్పు చెయ్యాలి.

మర్నాడు తెల్లవారే సరికి ఊజీలతోనూ, ఆరోగ్యంగా వున్న స్త్రీలతోనూ సహా అందరూ మార్గం తయారు చేసే పనిలో ప్రవేశించారు. అందరూ నాలుగు జట్టులుగా ఏర్పడి వేర్వేరు స్థలాలలో పనికి పూనుకున్నారు. నేను మాత్రం మకాము ప్రక్క పనిచేసే జట్టులోనే చేరాను. ఎత్తైన చోట పనిచేస్తే తల తిరిగి పడిపోతానేమో అని నాకే భయం!

శరణార్థులైన స్త్రీలు కూడా ఉత్సాహంతో పని చెయ్యడంవల్ల ప్రొద్దుగూకిందాకా పని బాగా జరిగింది. వెనకటి రోజుకీ, అప్పటికీ ఎంతో తేడా కనబడింది. కాని, మర్నాడు కూడా యిలా పని జరగగలదా? అని నాకు అనుమానమే! అయితే మాత్రం - వెనకకు వెళ్లడం జరిగేపని కాదుగదా!

మర్నాడు పూర్తిగా పని చేశాము. ఆ సాయంత్రం బర్మీయుల నాయకుడూ, పోటోక్ - నా దగ్గరకు వచ్చి "సాధ్యమయినంత పనీ చేశాం. ఇంతకన్న మరి సాధ్యంకాదు. ఇప్పుడు సాధ్యం కానిది మరెప్పుడున్నూ కాదు" అని చెప్పారు. ఆ మార్గంలో ప్రమాదకరమైన స్థలాలు రెండున్నాయి. అక్కడ దారి వెడల్పు మూడడుగులు! ఒకవైపు బ్రహ్మాండమైన గోడవలె పర్వతం! మరోవైపు పాతాళం వంటి అఖాతం! అందరమూ ఆ దారిని ఒక్కసారిగా వెళ్ళితే, అది కుంగి పోతుందేమో? నలభై అయిదు ఏనుగుల ఒత్తిడికి తాళగలదా? అని నా అనుమానం!

నేనా తర్వాత పో - టోక్‌తో కలిసి ఆలోచించాను. ఏమంటే ఈ సాహస కృత్యానికంతకీ అతడే మూలం: మేము కృతార్థులమైతే ఆ ఘనత అతని యేనుగు బందూలాదే!

ఏనుగులన్నీ కొండ యెక్కిన తర్వాతనే శరణార్థులు బయలు దేరేటట్లు ఏర్పాటు జరిగింది. స్త్రీలుగాని, శిశువులుగాని ఏనుగులపై ఎక్కరాదని వేరే చెప్ప నక్కర్లేదు. నడవలేని వారిని ఆ తర్వాత మోసుకు వెళ్లడం జరుగుతుందనీ, వెళ్ళేటప్పుడు ఊజీలు ఒకరితో ఒకరు మాటలాడ కూడదనీ చెప్పాను. ముందు బందులా ప్రయాణం సాగించాలి; దానిని చూస్తూనే పో - టోక్ వెనుక నడుస్తూ వెళ్ళాలి.

ఏనుగు లన్నిటి మీదా బరువులు వేసి సిద్ధం చేశాక నేను అందరికీ ముందుగా దారి తీశాను.

అతి ప్రమాదకరమైన స్థలం దాటి 200 గజాలు దాని పై భాగంలో పోయి నిలిచాను. ఆ అపాయకర స్థలంలో మేము రాళ్ళ మీద మెట్లు చెక్కవలసి వచ్చింది. అవి ఏనుగు అడుగులు పట్టడానికి మాత్రం సరిపోతాయి. బందూలా ఆ ప్రదేశం దాటడం చూచి ముందుకు పోదలచాను.

చూస్తూ వుండగా, నాకు క్రిందిభాగంలో ఆ అపాయస్థలంలో-మూలలో మొదట బందూలా తల, దంతాలు కానవచ్చాయి. తర్వాత అది కనబడింది. అది వెనక కాళ్లమీద నిలిచినట్లు కానవచ్చింది. దాని తలమీద వున్న ఊజీ క్రిందికి చూస్తూ, ఎక్కడెక్కడ అడుగు పెట్టాలో సూచిస్తున్నట్లు తోచింది. అది అపాయ స్థలాన్ని అతిక్రమించి ముందుకు సాగింది. దాని వెనకనే పో - టోక్ వస్తూ వుండడం చూచి, ముందుకు సాగిపోయాను. బందూలా సగం దారికి ఎక్కింది. మా సంకల్పం నెరవేర్చాలని దేవుని ప్రార్థించాను. కాని, నెరవేరుతుందనే నమ్మకం మాత్రం లేదు.

మరొక రెండు గంటలు అయాక మళ్లీ అది కనబడింది. ఏ మాత్రం ప్రమాదం లేకుండా అది మీదికి ఎక్కింది. నాకు మాటలతో చెప్పలేనంత నెమ్మదీ, ఉత్సాహమూ కలిగాయి.

బందూలా వెనక పోటోక్ వచ్చాడు. అతని వెనుక ఒక ఆ డేనుగు వచ్చింది. నన్ను దాటుకొని అతడు ముందు పోతూ, ఒక మాటైనా ఆడకుండా, ఒక్క వింత చూపు చూసి వెళ్ళాడు. "మరేం భయం లేదు. అందరూ వస్తారు" అనే అభిప్రాయం దానివల్ల వ్యక్త మయింది.

నిజమే! అందరూ వచ్చారు! నా దగ్గరున్న పద్దు ప్రకారం 45 పెద్ద యేనుగులూ, 8 పిల్ల యేనుగులున్నూ వచ్చాయి! ఈ పర్వతాధి రోహణంలో కొన్నిటి వెనక కాళ్లు చాలా బలహీనాలై పోయాయి. అందువల్ల ఆ ఏనుగులు నిలబడి వున్నా కాళ్ళు వణకడం మానలేదు.

ఆ గుట్టమీద మకాం పెట్టడం నాకు ఇష్టంలేదు. ఏమంటే - అక్కడ బాగా నలిగిన దారి కానవస్తున్నది. శత్రువులు రావడానికి అవకాశం వుంది: అయినా మార్గాంతరం లేనందున అక్కడే నిలవ వలసి వచ్చింది. శరణార్థులలో ఆఖరి జట్టు మీదికి వచ్చే సరికి చీకటి పడింది. మరి ఏ దినమూ ఇంత మితిమీరిన దీర్ఘ దినంగా తోచలేదు.

ఏనుగులతో నాకు వుండిన 24 ఏండ్ల అనుభవంలోనూ - ఆ ఒక్కరోజు మాత్రమే ఏనుగులు ఎంతెంత ఘన కార్యాలు చెయ్య గలిగినదీ బాగా గ్రహించాను. పో - టోక్‌కు కలిగిన సమయ స్ఫూర్తీ, ఆలోచనా నూటికి నూరు పాళ్లూ సరైనవి. బందూలా తప్ప మరే ఏనుగైనా దారి తీస్తే మా ప్రయత్నం ఫలించి వుండదు!

మేము కావలా పెట్టుకుని చేసిన మకాములలో అదే చివరిది. ఏమంటే - తర్వాత మకాములలో ఇక జపానువాళ్ల భయం వుండదు.

తర్వాత మేము బారక్ (**Barak**) నదివైపు దిగవలసి వుంది. క్రిందటి దినం మీదికి ఎక్కడం ఎంత కష్టమైనదో, అక్కడినుంచి

దిగడంకూడా అంతకష్టమే! కాని, దారిలో రాళ్లూ, రప్పలూ లాంటి అడ్డంకులు లేవు. మేము మర్నాడే బయలుదేరలేదు. ఏనుగులు బాగా అలసిపోయినందున ఒక్కదినం విశ్రాంతి కావలసి వచ్చింది.

అక్కడి నుంచి మేము నదిని అనుసరించి ప్రయాణం సాగించాం. బురద, చిత్తడినేల, వెదురు పొదలు మాకు అడ్డుతగిలేవి. వెదురు పొదల్లోంచి కష్టంమీద దారి చేసుకోవలసి వచ్చేది. ఏనుగుల మీద దిట్టమైన సయాం పద్ధతి సరంజాము లేకపోతే, మేము వెదురు పొదలనుండి తప్పించుకు రావడం సాధ్యమయి వుండదు.

ఏటి గట్టును అనుసరించి ప్రయాణం చెయ్యడం కూడా అసాధ్యంగా వుండినది. దట్టంగా వున్న అడవులు నీటి దాకా వ్యాపించి వుండడమే కాకుండా, వెదుళ్ళూ, పేమూ అడ్డంగా వచ్చేవి. ఏనుగులు వెళ్ళడానికి వీలుగా వాటిని కొట్టివేయాలి. కూరుగావున్న ఆ మొదళ్ళ మీద నుంచి మనుష్యులు నడిచి వెళ్ళడం సాధ్యంకాదు.

ఆదినం, మేము ఉదయం 5 గం. మొదలుకొని సాయంకాలం 5 గం. వరకూ ప్రయాణం చేసి, పదిమైళ్లు మాత్రమే వెళ్లగలిగాం. ఒక నదీసంగమం చేరుకున్నాం. అక్కడనే బస చెయ్యాలని అనుకున్నాం. మా శరణార్థులు కొందరు తమ తడిగుడ్డలను వెంటనే నేలను పరచి, ఆరవేసుకోవడం ఆశ్చర్యకరమైన దృశ్యం.

నిరాశాజనకమైన ఆరోజే మా చిక్కులకు తుది అని గ్రహించాను; మరొక దినం ప్రయాణం చేస్తే మేము తేయాకుతోటను చేరగలం. అయినా, అంత బలగంతోటీ రాత్రిపూట అక్కడికి వెళ్లడం బాగా వుండదని మేము దానికి కొంత దూరంలోనే బస చెయ్యడానికి నిశ్చయించుకున్నాం. జబ్బుతో వున్నవారిని మాత్రం ఏనుగులమీద ఎక్కించుకుని తొమ్మిది యేనుగులతో నేనుమాత్రం తోటకు సమీపంగా

బస చెయ్యడానికి వెళ్లదలచాను. దట్టంగా వుండే అడవిలోంచి, మైదానంలోకి వచ్చి తేయాకుతోటను చూస్తూ ఎంతో ఆశ్చర్యపడ్డాను! కనుచూపు మేరవరకూ, మహాసముద్రంవలె పచ్చని తోట కానవచ్చింది. దేశపటంలో నేను చూచి, వేసుకున్న అంచనా సరిగానే వుంది. అనుకున్న చోటికే రాగలిగాను. నా కన్నులను నేను నమ్మలేక పోయాను. కొన్ని పావురాలు ఎగురుతూ కనిపించాయి కూడా. ఒక మైలు దూరంలో పెద్ద బంగళా కనిపించింది. అది ఆసాములో, తేయాకుతోటల యజమానులు కట్టించుకున్న విధంగానే కానవచ్చింది. ఇదివరలో ఊహించిన విధంగా అక్కడుండే ముసలి గృహస్థుకూ, పడుచు పెండ్లాముకూ, నన్ను ఎరుక పరుచుకోవడం కోసం ముందుగా వెళ్లాను.

అది సాధారణమైన బంగళా. చుట్టుపక్కల వున్న తేయాకు పొదలకంటె ఎత్తుగా వున్నచోట అది కట్టబడింది. దాని వసారామీద తెల్లని చొక్కా ధరించిన ఒక వ్యక్తి కనిపించాడు!

నేను, అక్కడికి వెళ్ళడానికి ముందుగానే ఆమనిషి స్కాట్లాండు దేశీయుని యాసలో "ఏమిటి తొందర? ఒక కప్పు టీ తీసుకో కూడదా?" అని బిగ్గరగా అన్నాడు.

"ఏమీ తొందరలేదు. టీ కంటె కావలసిందేమిటి?" అని నేను జవాబిస్తూ, ఆ తోటలోని దారిగుండా ఆ వరండా చేరాను. అక్కడ ఒక బల్లమీద భోజనం సిద్ధంగా వున్నది. ఆ తోట యజమాని జేమ్స్ సిన్‌క్లయర్ (James Sinclair) వయస్సు నలభై యెనిమిదేళ్ళు. బ్రహ్మచారి. అందువల్ల అక్కడ అందకత్తె అయిన పడుచు పెండ్లాము కానరావడంలేదు.

అతడు నా సమాచారం అడిగాడు. నేను సంగ్రహంగా మా వృత్తాంతం తెలియజేశాను. తర్వాత అతడు - జపానీయులు ఆ

మార్గంగా కొన్నివందల ఏనుగులతో వస్తున్నారనే వదంతి పుట్టిందనీ, అయినా, తాను దానిని నమ్మలేదనీ చెప్పాడు. ఏనుగులతో రావడం యథార్థమయినా, వచ్చినవాళ్ళు జపానీయులు కాకపోవడం అదృష్టం అన్నాడు.

తర్వాత మేము వేడివేడి కాఫీతోనూ, తాజా గ్రుడ్లతోనూ భోజనం ముగించాం. తర్వాత అతడు - ఆ మార్గంగా కొందరు శర ణార్థులు వస్తూవున్నట్లు ఇంఫాలునుంచి సిల్చారుకు (Silchar) తెలుప బడినట్లు చెప్పాడు. నాతో కొందరు శరణార్థులుకూడా వున్నారని విని అతడు ఎంతో ఆశ్చర్యపడ్డాడు.

అక్కడికింకా సిల్చారు ఇరవై మైళ్ళు. అక్కడుండే సివిల్ ఉద్యోగులకు - శరణార్థులైన స్త్రీలనూ, శిశువులనూ గూర్చి టెలి ఫోనులో తెలియజేశాను. శరణార్థులను ఆ అధికారులకు అప్పగిస్తే నాకు ఎంతో బరువు తీరినట్లు. మనస్సుకు శాంతి ఏర్పడుతుంది. ఆ దినం సైనికోద్యోగులతో సంభాషించడానికి అవకాశం లేకపోయింది. మాట్లాడి తీరాలనే కుతూహలమూ లేదు. అప్పటికి గడువుమించి ఆరు రోజులైనా, మూడు రోజుల ఆహారపదార్థాలు మిగిలివున్నాయి.

శరణార్థులైన స్త్రీ, శిశువులను ఆ సాయంకాలమే అధికారు లకు అప్పగించాను. అందువల్ల వారి ఆహారవస్తువులు మిగిలి, ఏనుగు లకు సంబంధించిన మనుష్యులకు సమృద్ధిగా అవి లభించాయి. రెండు వారాల తర్వాత నిర్వాసితుల శరణాలయానికి వెళ్ళి చూచాను. జబ్బుతో వుండినవారు తేరుకున్నారు. శరణార్థులందరూ చాలా సుఖంగానూ, ఆనందంగానూ వున్నారు. ఇండియాలోనికి పోవాలని - అందుకు ఎదురుచూస్తూ వున్నారు. యుద్ధానంతరం తమ పురుషులను

కలుసుకున్నప్పుడు, ఆ గూర్ఖా స్త్రీలు తమ అనుభవాలు చిత్రగాథలుగా చెప్పుకోవచ్చు!

అది ఏప్రిల్ 24-వ తేదీ మేము సిన్‌క్లయిరుతో, నాలుగు మాసాలు కలిసి వున్నాం.

సిల్చార్‌లోని ఉపకేంద్ర కార్యాలయంవారు మా రాకకు ఎంతో ఆశ్చర్యపడ్డారు. తాము ఊహించినదానికి భిన్నంగా జరిగిందని వారు భావించి వుండాలి! ఏనుగులకు దాణా ఎంత కావలసి ఉంటుందోనని సరఫరా శాఖవారు ఘనంగా అంచనాలు మొదట్లో వేసుకున్నారు కాని నలభై అయిదు ఏనుగులూ, వాటికి సంబంధించిన బర్మీయులూ, నలుగురు ఉద్యోగులూ చనిపోయినట్లు ఆ తరువాత వార్తలు రాసాగినవి. విమానదళంవారు మాకోసం ఇరవై రోజులు వెతికినా మేము అగపడలేదు. బతికున్నవాళ్ళ పద్దులోనుంచి మమ్మల్ని కొట్టివేశాక, మేము హఠాత్తుగా దిగబడ్డాము!

సప్లయిశాఖవారిని, ఏనుగుల ఆహారపదార్థాలను గురించి మేము అడగలేదు. మిగిలిన నా కోరికలైనా సాధారణమైనవే! అందువల్ల మామీద వారికి ప్రీతి ఏర్పడింది.

నేను విమానంపైని కోమిల్లాలోని సైనిక కేంద్ర కార్యాలయానికి వెళ్ళాను. మా రాకనుగురించిన వార్తలు వారికి ఆశ్చర్యం కలిగించి నేను అక్కడికి చేరుకునేసరికి, మమ్మల్లనూ మా ఏనుగులనూ ఆసాం అటవీశాఖవారికి వప్పగించడానికి నిర్ణయం జరిగింది.

నా దగ్గరున్న బర్మీయుల కుటుంబాలను గురించి ముందుగా పరిశీలించాను, వారిసంగతి యేమిటని. ఆసాం శరణార్థుల సంఘం ద్వారా, వారి జాడలు తెలుసుకుని, అక్కడికి వెళ్ళాను. వాళ్ళు,

ఆసాంలో బ్రహ్మపుత్రానదీ తీరంలోని పార్బతిపూరు (Parbutti-pur) లో ఉంచబడ్డారు. వర్షాకాలం అంతా వాళ్ళు అక్కడే వున్నారు. అయినా, కాలం వ్యర్థం చెయ్యకుండా, తాము తమ గృహాలు చేరు కోవడానికి ముందుగానే - చేతితో దారంతీసి, సిల్కు సంచులు అల్ల డమూ, గుడ్డలు నెయ్యడమూ చేస్తున్నారు.

వాళ్లు అద్భుతమైన వుత్సాహంతో ఆ ప్రమాద పరిస్థితులలో ఎంతో సాయంచేశారు. అందువల్లనే నేను వాళ్ల మగవారిని - నాపని వాళ్ళుగా పద్దు కెక్కకపోయినా, వాళ్లమీద చర్య తీసుకునే అధి కారం నాకు లేకపోయినా - నాలుగేళ్ళపాటు కట్టుదిట్టంగా ఉంచ కలిగాను.

౧౭

కోహిమా (Kohima), ఇంఫాలుల యుద్ధాన్నిబట్టి, బర్మా తిరిగి స్వాధీనం కావడం నిశ్చయమని తేలింది. కాని, మొదట్లో పరి స్థితి చాలా క్లిష్టంగానే వుండినది. శరణార్థుల బాధ్యత తీరిపోయాక పూర్తిగా ఏనుగుల బాధ్యతనే వహించాను. ఆరోగ్యం చక్కపడి శక్తి లభించేవరకూ వాటికి ఎంతోకాలం విశ్రాంతి అవసరం ! లేకపోతే అవి యేపనికీ ఉపయోగించవు. వాటికి మళ్లీ సరంజామా అంతా ఏర్పాటు చెయ్యవలసికూడా వున్నది.

కలపను తెచ్చే పనిలో ఆరితేరిన ఆ ఏనుగులకు ఆసాం అడవుల్లో ఎంతపనైనా వుంది. వాటిని ఆసాం అటవీశాఖకు ఉపయోగపడేటట్లు చెయ్యాలని సైన్యాధికారుల అభిప్రాయం. అదృష్టవశాత్తూ మా ఏను గులు అటవీశాఖకు ఉపయోగపడే కనుమలో లేవు. ఆసాం ప్రధాన రైల్వేకూ, ట్రంకురోడ్డుకూ సమీపంలో బ్రహ్మపుత్ర కనుమలోనే

అవి పని చెయ్యవలసివుంది. అది, అవివున్న చోటికి 200 మైళ్ళ దూరం. అప్పటికి వర్షాలు ప్రారంభమయాయి. అక్టోబరు నెలవస్తేనే కాని. ఏనుగులు పనిలో దిగడం సాధ్యం కాదని అధికారులకు నేను తెలియ జేశాను.

నేను ప్రయత్నించి, ఏనుగులను కలప పనిలో ప్రవేశపెట్టకుండా చెయ్యగలిగాను. అవి ఇండియాలో ఈ పనికి పూనుకుంటే బర్మాకు - యుద్ధ సమయములో తిరిగిరావు. యుద్ధం అయిపోయినా కూడా చాలా ఏళ్ళ వరకూ బర్మాకు తిరిగి రాకపోవచ్చును. ఈ వర్షాకాలంలో జపానీయులు దండయాత్ర సాగించకపోతే - మా సేనలు ఆ తర్వాత బర్మాలో ప్రవేశించడం నిశ్చయమనిన్నీ, అప్పుడు ఆ సేనల వెంట ఏనుగులు వెళితే, సమయం వచ్చినప్పుడు ఎంతో ఉపయోగపడతా యనిన్నీ నేననుకొన్నాను. నేను, ఏనుగులను కలప పనిలో ప్రవేశపెట్ట కూడదని గట్టిగా వ్రాస్తూ, అధికారులతో హోరాహోరి పోట్లాడాను. అవి, ఆసాం అటవీశాఖ వారికి పనిచెయ్యడంలో ఎన్నెన్ని ఆటంకాలు చూపాలో, ఆ పద్ధతి అంతా నేర్చుకున్నాను. నాకు సాధ్యమైనంత వరకూ, అధికారులతో పోట్లాడడానికి నిశ్చయించుకున్నాను.

నాతో వున్న ముగ్గురు ఉద్యోగులకూ దీర్ఘకాలపు సెలవు యిచ్చాను. ఇప్పుడు కాకపోతే - తర్వాత, వాళ్ళు సెలవు తీసుకుని వెళ్ళే అవకాశం వుండక పోవచ్చును.

ఇంఫాలు యుద్ధములో మాకే విజయం కలిగింది. అందువల్ల, ఏనుగుల విషయంలో నేను కోరినట్లే జరగడానికి వెంటనే మంచి అవ కాశం దొరికింది.

ఇంఫాలులోని సైనిక కేంద్ర కార్యాలయంవారు, ఏనుగుల విషయం భోగట్టా కోసం నన్ను పిలిపించారు. అక్కడి సంభాషణను

బట్టి ఏనుగులు శీఘ్రింగా కాబా కనుమకు వెళ్ళవలసి వుంటుందని తేలింది. బిషణ్‌పూరు మార్గంలో ఆటంకాలు లేనందున, ఏనుగులు శ్రిమలేక తిన్నగానే ప్రియాణం చెయ్యవచ్చు. ఇక ఏనుగులు కలప పనిలో ప్రివేశించ నక్కరలేదని తోచింది. తర్వాత నేను సేనాధిపతిని కలుసుకుని వాటిని కాబా కనుమకు తీసుకుపోవాలనే విషయం ఉత్తరువు ద్వారా నిశ్చయం చేయించుకున్నాను.

నే నీ సమాచారాన్ని బర్మీయులకు తెలుపగా, వాళ్ళు ఎంతో సంతోషించారు. ఇద్దరు అధికారులు వాటిని కాబాకనుమకు తీసుకుపోవడానికి ఏర్పాటు చేశాను. నేను ముందుగా పోయి, మా సేనల దృష్టిపథం నుంచి తప్పిపోయినవిగాని, వాళ్ళు పట్టుకున్నవి గాని అక్కడక్కడ వుండి పోతే, ఆ ఏనుగులను సంపాదించడానికి నిశ్చయించాను. జపానీయులు తమ దాడిలో ఏనుగులను ఉపయోగించారు. వాళ్ళు వెనకకు పారిపోయి నప్పుడు, ఏనుగులను విడిచిపెట్టి పోయి వుంటారని నా వూహ.

వర్షర్తువు ప్రారంభమైనా, మా సేనలు జపానీయులను వెనకకు తరుమ గొట్టడానికి నిశ్చయించాయి. 11-వ తూర్పు - ఆఫ్రికా సేనా శాఖ యొక్క అధిపతితో కలిసి పనిచెయ్యడానికి కాబా కనుమకు వెళ్ళాలని నాకు ఉత్తరువు వచ్చింది. దారిలో ౨౩-వ ఇండియా దళం యొక్క అధిపతిని కూడా కలుసుకోవలసి వున్నది. నేను ఇంఫాలుకూ టామూకూ వచ్చాను. టామూ పరిస్థితిని మాటలతో వర్ణించడం అసాధ్యం !

ఇదివరలో - నాలుగు నెలల క్రిందట ఊజీల కుటుంబాలనూ, పిల్లలనూ సురక్షిత ప్రిదేశాలకు తీసుకువెళ్ళిన ఆంగ్లో - బర్మీయుడు - మెక్‌విట్టీ (Mc Vittie) మా కంటె ముందుగానే తిరిగి వచ్చాడు.

అతడు జపానీయులు విడిచిపెట్టిన పదకొండు ఏనుగులను సంపాదించి, వాటి సాయంతో వంతెనలు నిర్మిస్తున్నాడు. ఏనుగులు చేస్తున్న యీ విలువైన పనిని గ్రహించి, వాటికి కావలసిన వస్తువులూ, సరంజామూ విమానాలు పడవేశాయి. ఏమంటే అన్నింటికన్నా వాటిపనే ముఖ్యముగా భావించబడింది. కొందరు ఊజీలు ఏనుగులతో సహా జపానీయులనుంచి తప్పించుకుని వస్తూనే వున్నారు.

కాబాకనుమలో ఇంకా వానలు పడుతూనే వున్నాయి. అయినా తూర్పు - ఆఫ్రికా సైన్యం ముందుకు సాగిపోతూ వున్నది. మూడు వారాల కాలములో అరవై ఏనుగులను సంపాదించి, మెక్‌విట్టీకి సహాయం చెయ్యడం కోసం పంపాను. వర్షాధిక్యంవల్ల, ఒకరోజు కట్టిన వంతెనలు మర్నాడే కొట్టుకు పోయేవి. మళ్ళీ మూడోనాడు వాటిని కట్టవలసి వచ్చేది. జపానీయుల లారీలు కనుమ పొడుగునా బురదలో కూరుకుపోయి వున్నాయి. మా ఆఫ్రికా సైనికులు లక్షలకొద్దీ మొక్కలను కొట్టి, రోడ్డుపైవేసి, దాన్ని సరిచేశారు. అప్పుడు వాళ్లకు - రోగంవల్లా, ఉపవాసంవల్లా, శ్రమవల్లా చచ్చిపోయి, రోడ్డుపొడుగునా పడి, క్రుళ్ళిపోయి, దుర్గంధం కొడుతున్న జపానీయుల కళేబరాలు కానవచ్చాయి.

చెట్లు నరికేవాళ్లు ఏనుగులను తమకు ముఖ్యసాధనంగా గ్రహించారు. ఏడు నెలల క్రింద చూచిన ఊజీలు మళ్లీ ఇప్పుడు కానవచ్చారు. జపానీయులు బర్మాను ఆక్రమించినప్పుడు వారికోసం నిర్బంధంగా పనిచేసినా, ఇప్పుడు నా పర్యవేక్షణలో తూర్పు - ఆఫ్రికనులతో కలసి పనిచెయ్యసాగారు. సైన్యానికి ఇచ్చినట్లుగానే వారికి కూడా ఆహారాది వస్తువులను ఇస్తున్నాం. సేనలన్నీ తిరిగి కనుమకు వచ్చాయనీ, తిరిగి వెనక్కు వెళ్లిపోవనీ ఊజీలకు నమ్మకం కలిగింది. గడియారం పనిచేసినట్లుగా - సమంగా విమానాలు వస్తువులను నేల

పడ వేసేవి. ఏనుగులు ఆ వస్తువులను - వాటిని పంచిపెట్టే కార్యాల యాలకు చేర్చేవి.

ఇంఫాలుకు చుట్టుపట్లవున్న చిన్ పర్వతాల్లో - ఉఖ్రూల్ (Ukhrul), జెసామి (Jesami) మార్గాల్లో ఏనుగులు జపానీయులకు లొంగి, పనిచేస్తున్నప్పుడు, బ్రిటిషు రాయల్ విమానదళంవారు వాటిపైని బాంబులు వెయ్యడం, తుపాకులు ప్రేల్చడం జరిగింది. అప్పుడు నలభై ఏనుగులు చచ్చిపోయాయి. చాలా ఏనుగులకు బాగా దెబ్బలు తగిలాయి. నేను వెతుకుతున్నప్పుడు దెబ్బలు తిన్న ఏనుగులు దొరికాయి. వాటికి చికిత్స అవసరం! అందుకోసమే నేను యూ నదీ (River Yu) ఏనుగుల చికిత్సాశాలను ఏర్పరిచాను. ఏనుగులకై స్థాపించబడిన పశువైద్యశాలలలో అదే మొదటిదని నానమ్మకం. ద్రావకాలు పడడంవల్ల ఏనుగుల వీపులమీద పెద్దపెద్ద గాయాలు కలిగాయి. ద్రావకాలు పడడంవల్ల, మునుముందు ఎలాటి పరిస్థితులు ఏర్పడేదీ ఊజీలకు అనుభవంలేదు. జపానీయులా శ్రద్ధతీసుకోలేదు. మేము ఏనుగులను పనులకూ, ప్రయాణాలకూ వుపయోగించేటప్పుడు ఎంతో జాగ్రత్తగా వుండాలనే గుణపాఠం దీని మూలాన బోధపడింది. కొన్నిటి గాయాల్లో అరంగుళం దళసరి మాంసం కాలిపోయి వుండినది. వాటి మీద బరువు వేసేటప్పుడు అవి అమితంగాబాధపడేవి. నేను ఆగాయాలను ఎం. బి. పౌడరుతో నింపి, చాలా శీఘ్రంగా మాన్పివేశాను.

ఏనుగులపైని ఆయుధాలు ప్రయోగించడం తమ కిష్టంలేదనీ, విధిలేక అలాచెయ్యవలసి వచ్చిందనీ చాలా మంది విమాన చోదకులు చెప్పారు. వార్తా పత్రికల్లో కూడా యీ విధంగానే ఉంది. అందు వల్ల వారు చెప్పినది సత్యమే అని నమ్మవచ్చు. ఈ ఏనుగుల ద్వారా జపానీయులకు వస్తువులను అందిస్తూవున్నప్పుడు-వేరొక మార్గం కాన

రాకపోగా, అలా చెయ్యవలసి వచ్చింది! ముఖ్యంగా - జపానీయులు చిన్ పర్వతాలకు పోయి జెసామి, ఉఖ్రూల్ సమీపంలో కోహిమాను స్వాధీనం చేసుకోడానికి సన్నాహాలు చేస్తూ వున్నప్పుడే యీ పని జరిగింది. అప్పట్లో జపానీయులు కృతార్థులై వుంటే, చీనాకు మరొక దేశంతో సంబంధం లేకుండా చేసి, అసాం, బెంగాలులలో ప్రవేశించి వుందురు! ఏనుగుల దళాలు పగటివేళలలో అడవుల్లో దాగుకొని, రాత్రి లైట్లు లేకుండా ప్రయాణం చేసేవి. అందువల్ల అవి ఎక్కడ వుండేదీ తెలుసుకోవడం చాలా కష్టం! యుద్ధరంగంలో గాయపడిన మనుష్యులతో కిటకిటలాడుతూవుండే చికిత్సాలయం ఎంత చికాకు కలిగిస్తుందో, అదేరీతిని ఈ ఏనుగుల చికిత్సాలయాన్ని పరిశీలించడం చాలా మనోవ్యాకులతను కలిగించేది. ఇప్పుడు తుపాకులు మోసే గుర్రాలకు బదులుగా యంత్ర సాధానాలు పూర్తిగా రావడంవల్ల గుర్రాలకు యుద్ధంవల్ల భీతివుండదు. అలాగే కంచరగాడిదలను కూడా శీఘ్రంగా తొలగిస్తారని ఆశించవచ్చు.

ఇంఫాలు సమతలంలో వున్న మా ఆహారవస్తువుల నిల్వలను స్వాధీనం చేసుకోవలెనని జపానీయులు ఎంతో ప్రయత్నించారు. కాని, లాభం లేకపోయింది. అందువల్ల వారు చిన్‌డ్విన్‌కు ఉత్తరంగానూ, క్రిందనూ వున్న వూళ్లపై బడి బియ్యం దోచుకున్నారు. గ్రామస్థులు తిండిలేక చాలా బాధపడవలసి వచ్చింది. ఇరవైకి లోపువయస్సు గల పిల్ల యేనుగుల ద్వారా నేను వాళ్లకు ఆహారవస్తువులు సరఫరా చేయించాను. వాటి వుపయోగం అప్పుడు ఎక్కువ కనబడింది! మ్యోతిట్‌కు (Myothit) కు ఉత్తరం వైపు, సిట్టాంగుకు తూర్పు వైపు రోడ్ల పునర్నిర్మాణానికి ఎన్నో ఏనుగులు కావలసి వచ్చాయి. వీటిని కోరినంతగా సప్లయి చేయలేనందువ నాకు ఏమీ తోచేదికాదు.

సాధ్యమైనంత వరకూ ఏనుగులను, అడిగిన వారికి పంపుతూ వుండే వాడను.

వర్షాలు తగ్గాక మా సేనలు బర్మాలో ప్రవేశించ సాగినవి. అందుకై చిన్‌డ్వినుకూ నాలుగుదిక్కులా రోడ్లు వెయ్యవలసి వచ్చింది. నా దగ్గరున్న బర్మీయుల పెద్దలే నా ఉద్యోగులైనారు! అందరినీ తృప్తిపరచడానికి యత్నిస్తూ, వాళ్ళు అద్భుతంగా పని చేశారు.

అందరితోనూ సంబంధం పెట్టుకోవడంకంటె చెట్లుకొట్టే కంపెనీలు ఒక్కొక్కదానికీ ఒక్కొక్క ఉద్యోగిని నియమించి, వాటికి వస్తువులను సరఫరా చెయ్యడం, మంచిచెడ్డలను గమనించడం మొదలైన పనులు ఆ ఉద్యోగికే అప్పగించడం మేలని తోచింది. అలా చేస్తే-నేను అతనితోనే ఆ కంపెనీని గురించి మాట్లాడుతూ, పనులను సులభంగానూ, సానుకూలంగానూ జరిపించ వచ్చును! ఆ విధంగా ఏర్పాటు జరిగించె. ఆ అధికారులు తమ పనికోసం తగిన మనుష్యులనూ, ఏనుగులనూ ఏర్చి కూర్చుకొని అద్భుతంగా పనిచేసేవారు ఎట్టి క్లిష్టపరిస్థితులలోనూ పని సక్రమంగా జరిగేది. ఆ ఉద్యోగులకు నేను ఎంతో కృతజ్ఞుణ్ణి.

అట్టి ఉద్యోగుల్లో అలెగ్జాండరు (Alexander) ఒకడు. యువకుడు; శాంతి సమయంలో సివిల్ ఇంజినీరుగా వుండేవాడు. అతడు, ఏనుగులతోనూ, ఊజీలతోనూ అంటిపెట్టుకునివుండి వారం రోజుల్లోనే అన్నిటి పేర్లూ, అందరి పేర్లూ నేర్చుకున్నాడు. ఊజీలకు సిగరెట్లు లంచమిచ్చి సాయంకాలం శ్రద్ధతో బర్మాభాష నేర్చుకునేవాడు. అంతా సక్రమంగానే జరిగేది. కాని ఒక మారు హఠాత్తుగా ఒక విపత్తు సంభవించింది. అతని మకాముకు దగ్గరున్న ఒక 5-వ మార్కు మందు గని ప్రేలడంవల్ల ఓకెతప్పా (Okethappah = Pagoda

Stone = గోపురశిల) అనేపేరు గల ఏనుగుకు గట్టి దెబ్బలు తగిలాయి. రాత్రి రెండు గంటల సమయంలో అలెగ్జాండరు తన జీపులో-భయంకరమైన మార్గాన ప్రయాణంచేసి, నా దగ్గరికి వచ్చాడు. అతడు దాన్ని గురించి చెపుతూ "దాని వెనుకకాళ్లు గట్టి దెబ్బలు తిన్నాయి. అది యింకా ప్రాణంతో వున్నదనుకుంటాను" అని అన్నాడు. అతనితో వచ్చిన బర్మీయులు మాత్రం తమ భాషలో అది చచ్చిపోయిందని నాకు తెలియజేశారు. నేను ఆ ఏనుగు కాళ్లు ఛేదించలేననీ, ఇక మీద యిలాంటి ప్రమాదాలు జరగకుండా చూస్తాననీ చెప్పాను. అంత, అతడు ఈ విషయం విడిచిపెట్టి-తనకు బర్మాభాషలో ఒక పాఠం బోధించాలని - రాత్రి రెండున్నర గంటలప్పుడు - కోరాడు!! తెల్లవారకముందే బయలుదేరి మేమిద్దరం అక్కడికి వెళ్లాం. ఆ యేనుగు చచ్చిపడి వున్నది! దాన్ని చూస్తే ఎంతో జాలికలిగింది.

డిసెంబరు నెల వచ్చిన కొద్ది రోజులకే చిండ్విన్ వైపు నాలుగురోడ్లు, రాకపోకలకు అనుకూలంగా తయారైనాయి. ఉత్తరం వైపు టామూ నుంచి టోనే (Tonhe) వరకూ, తూర్పున టామూ నుంచి సిటాంగుకూ, యూవాకూ, ఆగ్నేయంగా టామూనుంచి మాలయక్కూ, దక్షిణంగా టామూ నుంచి కలేవాకూ అవి ఏర్పడ్డాయి. ఆ మార్గాలో ఒకటి, రెండు చిన్న వంతెనలను మాత్రం కట్టవీలయింది. కారణం వంతెనలు కట్టే సామగ్రి లేకపోవడమే! ఆ సామగ్రినంతా - కలేవా దగ్గర చిన్డ్విన్ నదిని దాటడానికి కట్టే వంతెనకై తీసుకున్నారు. ఏనుగులు 270 కి పైగా కర్ర వంతెనలనూ, కాల్వలమీది చిన్న వంతెనలనూ నిర్మించాయి. అందువల్ల పెద్ద వంతెన నిర్మాణ ప్రారంభానికి ముందుగానే, రోడ్లమీద మోటార్లు ముందుకు పోవడానికి వీలైంది.

చిన్‌డ్విను‌కు రోడ్లు పడడంవల్ల, కలేవాలో చిన్న పడవలనూ, పెద్ద పడవలనూ నిర్మించడానికి తగిన కలపను సప్లయి చేయడానికి - అడవులకు సంబంధించిన జట్టులు వచ్చాయి. ఏనుగుల సాయంతో ఆ జట్టుదారులు కలపనుతీసి, రంపాలతో కోసి, ఐదువందల చిన్న పడవల నిర్మాణానికి తోడ్పడ్డారు. టామూ నుంచి కలేవాకు వెళ్ళే రోడ్డుపైని కట్టిన పెద్ద వంతెనల పైభాగాన్ని కప్పడానికోసం తగిన కలప, మోసుకు పోవడానికి అనుకూలమైన రంపపు యంత్రంతో కూడా ఏనుగులు సరఫరా చేశాయి. ఆ రోడ్డు అన్ని కాలాలలోనూ ప్రయాణానికి అనుకూలంగా తయారైనది!

శాంతి సమయంలో మామూలుగా చేసే పనులకు అలవాటు పడిన ఏనుగులు, యుద్ధకాలంలో అలవాటుకాని పనులను ఎన్నిటినో చెయ్యవలసి వుండినది. ఆలాంటి పనుల్లో దూలాలను తొమ్మిది, పది అడుగుల వరకూ ఎత్తి, ఉంచవలసిన చోట వుంచడం ఒకటి. అంత మీదికి ఎత్తితేనేగాని వంతెన మీదికి ఎక్కించడం సాధ్యంకాదు, ఒక్కొక్క దూలం పావుటన్ను బరువు. అందువల్ల తొండంతో తీసి పట్టుకోవడమే చాలా కష్టం. తర్వాత హెచ్చుతగ్గులు లేకుండా దంతాలపై నిలుపుకుని, ఆ మీద మెల్లిగా మీదికి ఎత్తాలి. అలాటప్పుడు దూలం వెనక్కు దొర్లితే, ఆ సమయంలో దాని మెడపై కూర్చుని వున్న ఊజీ ప్రాణానికి ఉపద్రవం కలుగుతుంది.

ఒకప్పుడు నేను మరియిద్దరు కలప పని ఉద్యోగులతో కలిసి వంతెన తయారవుతూ వుండడం పరిశీలించాను. ఒక తెలివైన ఏనుగు చేత నేర్పరి అయిన ఊజీ పని చేయిస్తున్నాడు. అప్పటికి సాయంత్రం అయింది. ఏనుగూ, ఊజీకూడా అలసిపోయారు. ఎంత యత్నించి సరిగా ఉంచాలనుకున్నా, చాలా దూలాలు జారిపోయాయి. ఆ యేనుగు దూలాన్ని చాలా మీదికి ఎత్తి, వంతెనపై పెట్టవలసివుంది.

అలాటప్పుడు అది తన మావటీనికి ఏ అపాయమూ కలగకుండా ఎంతో జాగ్రత్తగా గమనించాలి. ఇంకా మూడిటికిపైగా దూలాలు మీదికి ఎక్కాలి. ఆ ఏనుగు అన్నిటికన్నా పెద్దదూలాన్ని తీసుకుని తొండానికీ, దంతాలకూ మధ్యను నిలువునా నిలిపింది. తర్వాత ఊజీ సైగను గమనించి, మెల్లగా దానిని దంతాలమీదికి జరపసాగింది. తొండంతో పట్టుకుని దాన్ని హెచ్చుతగ్గులు లేకుండా - దంతాలకు రెండుప్రక్కలా సరియైన తూకం వుండేటట్లు చెయ్యసాగింది. అద్భుతంగా అది పని చెయ్యడం చూస్తూ, ఆ వుద్యోగులు నిర్ఘాంతపోయారు. నేను "ఇక మీద జాగ్రత్త"అని బర్మాభాషలో శాంతం అన్నాను. ఆ యేనుగు వెంటనే తలవంచి, ఆ దూలాన్ని కిందికి జారవిడిచింది. ఊజీ చీదరించుకున్నాడు. ఆ యేనుగు ఆ మీదట ఊజీ సలహా అక్కరలేకుండా, సులభమైన పద్ధతిలో ఆ దూలం ఎత్తడానికి ఒక ఆలోచన చేసింది. అది తొందరగా ఒక పక్కకుపోయి ఒక కర్రసమ్మెట తెచ్చింది. అది, వంతెనమీద కర్ర మేకులు దిగగొట్టడానికి ఉపయోగించేది ! ఆయేనుగు ఆ సమ్మెటను, తన దంతాలకూ, తొండానికీ మధ్యను నిలువుగా వుండే లాగున నొక్కి, యిరికించింది. దాని అభిప్రాయం ఏమిటో, నేనూ, ఊజీకూడా గ్రహించాము. ఊజీ వెంటనే, మళ్లీ దూలాన్ని ఎత్తడానికి ఏనుగును ప్రోత్సహించాడు. ఈసారి దూలాన్ని వంతెనమీదకు ఎక్కించి తీరాలనే పట్టుదలతో, అది తన యావచ్ఛక్తినీ ఉపయోగించి, ఎత్తి వెనకటిలాగే సమానంగా దంతాలమీద వుంచుకుని తలపైకెత్తింది. ఈసారి సమ్మెటలాంటి కొయ్యముక్క, దూలం నుదుటి మీదకు దొర్లి ఊజీకి అపాయం కలిగించకుండా అడ్డినది. అది చూస్తూ వున్న మేజరూ, బ్రిగేడియరూ (సైన్యాధికారులు) ఆశ్చర్యపడ్డారు ! నా గుండెలు కొట్టుకోసాగాయి. ఆ యేనుగు నెమ్మదిగా వంతెన దగ్గిరికి పోయి, కొంచెం ఎత్తుగా వుండడంకోసం ఒక దూలంమీద తన

ముందుకాళ్లనుంచి నిలిచింది. తన తొండంచివరి అంగానికి దెబ్బతగల కుండా, దాన్ని చుట్టుకుని, ఎలెక్ట్రిక్ క్రేను (బరువులుదించే యంత్రం) పనిచేసినట్లు నెమ్మదిగా, తల కొంచెం వంచి, జాగ్రత్తగా ఆ దూలాన్ని వంతెనమీదికి - అది పడవలసిన చోటికి దొర్లించింది. ఏనుగులు ఎంతో తెలివితో పనిచేసే సందర్భాలలో ఇదొకటి

ఏనుగులకు వింతవింత పనులు అప్పగించేవారు. అవి ఆ పనులు చెయ్యడమూ చూడదగినదే! నిలిచిపోయిన లారీలను తొయ్యడానికీ, తొండంతో తారు పొయ్యడానికీ, గతుకులలోనూ, సందుల్లోనూ మట్టి పోసి, కాళ్లతో దిమ్మిస చెయ్యడానికీ ఏనుగులు కావలసివచ్చేవి.

ఏనుగులు కడసారిగా చేసిన పని, 33-వ సేనాదళం, టాంకు లతో కలేమియో (Kalemyo) వెళ్లడానికి నాయంజయా నది (Nayanzayah) మీద వంతెన కట్టడం! తుపాకి గుండ్లు పేలుతూ వుండగా ఏనుగులు పని చెయ్యడం అప్పుడే చూచాను!

వంతెన సాయంకాలంలోపుగా తయారు కావాలి. ఏనుగులు ఉదయం ఏడు గంటలనుంచి రాత్రి ఏడుగంటలదాకా పని చేశాయి. ఐదు ఏనుగులు మధ్యలో బెదరి, పారిపోయినా తిరిగి వచ్చాయి. ఆ దినమంతా రెండు, మూడువందల అడుగుల ఎత్తున డకోటా విమానాలు తిరుగుతూ, అక్కడికి అరమైలులోగానే అవసరమైన పదార్థాలను కొన్నిటిని నేలపడవేసేవి. శత్రువిమానాలు మూడు డకోటాలను పడగొట్టాయి! ఇంత గడబిడ జరుగుతున్నా, లక్ష్యం చెయ్యకుండా ఏనుగులు తమ పనిని సాగిస్తూనే వుండినవి.

ఇండియంగ్యీ (Indiangyi) దగ్గర విమానాలు వస్తువులను పడవేసేచోటికి దగ్గరగావున్న యేనుగులు - ఉప్పుబస్తాలు నేల పడినట్లు గ్రహించాయి. శాంతి సమయంలో వాటికి నెలకు 15 పౌనుల ఉప్పు

మాత్రం యిచ్చేవారు. అదికూడా 1942లో ఆగిపోయింది. వాటికి ఇప్పుడు ఉప్పు ఎంతో అవసరం! అందువల్ల, అవి పనిలోంచి విడుదల పొందిన వెంటనే అక్కడికి పరుగెత్తాయి. ఇది తమాషాగా వుండినది!

కలేవా దగ్గర చిన్‌డ్విన్ దాటిన, తర్వాతవున్న అడవులు మా స్వాధీనానికి వచ్చాయి. అక్కడ ఏనుగులు చాలా కనబడుతున్నా యని విన్నాను. వాటిని పట్టుకున్న సైన్యం, ఆ యేనుగులను తమకు ప్రయాణ సాధనాలుగా ఉపయోగించడానికి యత్నించింది. కాని, యేనుగులను ఏ విధంగా చూడాలో, వాటి తత్వం ఎలాంటిదో, వాటికి ఏమేమి కావాలో తెలిసినవారు ఆ సైన్యంలో ఒకరూ లేరు. ఆ సైన్యంనుంచి ఏనుగులను స్వాధీనం చేసుకోడానికి నేను హోరా హోరి పోట్లాడవలసి వచ్చింది. ఒకప్పుడు, పది ఏనుగులకోసం ఆరు జీపులను వాళ్లకు ఇచ్చుకున్నాను!

4-వ సైనికదళం కాబా కనుమకు వచ్చేసరికి, శత్రువులనుంచి స్వాధీనం చేసుకున్న ప్రతి యేనుగూ పని చెయ్యడానికి సిద్ధంగా వుండి నది. దక్షిణంవైపు, మ్యిత్తా (Myittha) కనుమకు ఎగువగా కలే మియో నుంచి గంగా (Gangaw) వరకూ, యా (Yaw), ఐరావతీ నదులకూ రోడ్డువేసే పనిని ప్రారంభించడానికి తయారుగా వున్నవి. అప్పటికి ఫించ్, (Finch) స్కాన్లన్ (Scanlon) అనే ఇద్దరు ఉద్యోగులు - అనుభవజ్ఞులు మాతో చేరారు. వారు ఒక ఏనుగుల గుంపు బాధ్యతను తీసుకుని ఉత్తమంగా తమ పనిని నిర్వహించారు.

నాకు చాలా శ్రమగానూ, చికాకుగానూ వుండినది. కడుపు నొప్పితో ఎంతో యాతన అనుభవించాను. పొరపాటున నేను పానీయపు సీసాల బిరడాలను మింగివుంటాననీ, అందువల్లనే ఆ బాధ అనీ కొందరు మిత్రులు నా బాధను తగ్గించదలచారు. నేను నవ్వి

వేశాను, చిన్న శస్త్ర చికిత్స చేస్తే చాలనీ, అన్నారు ఆ సమయంలో ఒక డివిజనల్ కమాండరు వచ్చి తనతో ఎల్. 5 లో (L. 5 = ఒక విమానం) మాలయక్ మీదుగా ప్రయాణం చేయాలని కోరాడు. ఆ ప్రదేశంలోని ఒక నదిని దాటబోయే సైన్యాధిపతి కొకనికి ఎక్కడ దాటవలసినదీ సలహా యివ్వాలట! అదే అప్పటికి నేను చెయ్యవలసిన కడపటి పని. ఆ పని ముగిసిన తర్వాత అతడు నన్ను చూడడానికి తన డాక్టరు నొకణ్ణి పంపాడు.

పనులు చాలా చురుకుగా జరుగుతున్నవి. నేను ఎటిన్‌జిన్ (Etinzin) చీలికనుంచి ఇంఫాలులోని సైనిక కేంద్రాలయానికి ఎల్. 5 విమానంలో వెళ్లితీరాలని వార్త వచ్చింది. సైన్యాధిపతి నాతో మాటలాడాలట! తీరా, ఆ చీలికదగ్గరికి వెళ్ళి చూతునా, విమానం లేదు. కాని, 4-వ దళం కమాండరు తక్షణం తన్ను చూడ వలెనని వార్త పంపాడు. ఆవార్త అక్కడికి వచ్చింది. నేను జీపును త్రిప్పుకొని, ఫించ్‌తోకూడా 4-వ దళం కేంద్ర కార్యాలయానికి వెళ్ళాను. 4-వ దళం గంగా కనుమకు వెళ్లనున్నదని ఎవ్వరూ నాకు తెలుపలేదు. నే నక్కడికి వెళ్లేసరికి సైనికోద్యోగులు ఫలాహారం చేస్తు న్నారు. నన్ను చూచి, దళం కమాండరు మిగిలివున్న ఒకే ఒక గ్రుడ్డును నాకు ఇప్పించాడు. దాని ప్రభావం ఏమోగాని, అరగంట సేపు నాకు ఏమీ బాధ లేకపోయింది. నాకు చెప్పిన పనిని నెరవేర్చ డానికి తగిన శక్తి కలిగింది. నేనప్పుడు ఎగువకు 'యూ' కనుమకు - నలభై మైళ్లదూరం వెళ్లి, మర్నాడు మధ్యాహ్నం చిన్‌డ్విన్ నదిని యీది దాటడానికి ఏనుగుల జట్టులు ఆరింటిని ఒప్పుకొనేటట్లు చెయ్యాలి. శత్రువులకు అపోహ కలిగించడానికే, నిజానికి ఆ దాటడం. సైన్యం నదిని ఇంకా ఎగువగా వేరొకచోట దాటి అవతలి ఒడ్డుకు పోవలసివుంది.

నేను ఫించ్‌తో కూడా ఆ మకాములకు వెళ్ళి బర్మీయ నాయకుల తోనూ, మావటివాళ్లతోనూ దీన్ని గురించి ప్రసంగించాను. ఆ పని ఎంతో కష్టమూ, ప్రమాదకరమూ అయినా, వాళ్ళు సమ్మతించి, ఎంతో ఉత్సాహాన్ని ప్రకటించారు. తమతో మరెవ్వరూ వుండనక్కర్లేదనీ, అన్నీ తామే చూసుకుంటామనీకూడా చెప్పారు. వాళ్ళు, చెప్పినట్లుచేసి తీరుతారనే నమ్మకం నాకుఉన్నది. నేను ఫించ్‌తో కూడా కేంద్ర కార్యాలయానికివచ్చి "అన్ని యేర్పాట్లూ చేసి వచ్చా" మని సైన్యాధికారికి చెప్పాను. ఫించ్‌కు గంగా కనుమలోని ప్రతి అడుగూ బాగా తెలుసునని వివరించాను. కాని, రాత్రి పడకముందే సైన్యాధిపతి ఏనుగుల జట్టులు ఆ కనుమలోనే వుంటే తన బలగానికి ఎంతో సహాయపడగలవనీ గ్రహించాడు. మొదట అనుకొన్న రీతిగా శత్రుసేనలను మోసగించ తలచడం కంటే ఇదే మంచి దనుకున్నాడు. మర్నాడు తెల్లవారే సరికి ఏనుగు చిన్‌డ్విన్ దాటే పద్ధతి రద్దు చెయ్యబడింది.

విచార పూరిత హృదయంతో నేను కాబా కనుమను విడిచి - చీకటిలో ఇంఫాలుకు ప్రయాణం సాగించాను. కడుపునొప్పి బాధ తగ్గడానికి, నేను జీపులో - బండిని నడిపే చక్రానికి గుండెలను గట్టిగా ఆనుకోవలసి వచ్చినది.

సైన్యాధిపతికి తన సైన్యంలో వుండే ప్రతి వ్యక్తీ తెలుసు. అతడు శీఘ్రంగా నన్ను చూచి, వెంటనే "హిల్ స్టేషన్" ఆసుపత్రికి వెళ్లవలసిందనీ, జబ్బు నయమయాక - ఏనుగుల పని చూసుకోమనీ చెప్పాడు. నా పనిని గురించి మరే ఏర్పాట్లూ చెయ్యనక్కర్లేదనీ, నడుమ ఏ మకాములోనూ ఆగనక్కర్లేదనీ కూడా అన్నాడు.

కొంచెం కాలం పరీక్షించి, వైద్యులు, రోగనివారణకు నా పిత్తాశయాన్ని తీసివెయ్యవలసి వుంటుందని అన్నారు. అదృష్టవశాత్తూ

ఒక్కడు మాత్రం ఆంత్రమూలంలోని కురుపు వల్లనే ఆ బాధ అనీ, మూడు వారాలు కదలకుండా పడక మీద వుంటే చాలుననీ అన్నాడు. ఆ పద్ధతే చక్కగా పని చేసింది. ఆరు వారాలకు తర్వాత నేను నా జీపులో-ఆసాంలోని షిలాంగు నుంచి దిగువ చిన్‌డ్విను లోని మొనీవా సైనిక కేంద్రానికి ప్రయాణం చెయ్యగలిగాను.

నేను వెంటనే ఫించ్‌ను చూశాను. నేను లేని ఆరు వారాలలో ఎన్నో విశేషాలు జరిగాయి. 14-వ సైన్యం మాండలే వరకూ తీసుకు పోయింది. ఆ యుద్ధంలో చాలా మంది మిత్రులు ఆత్మత్యాగం చేసి వుంటారు! ఫించ్, కాబా కనుమలో టేకు మొదలైన కలపను రెండు కోత మిల్లులలో కోయిస్తూ దీక్షగా పని సాగిస్తున్నాడు. ఆ కోసిన దూలాలు పడవల నిర్మాణానికి ఎంతో అవసరం. అప్పట్లో అది ఎంతో ముఖ్యమైన పని. చిన్‌డ్విన్‌లోని కలేవా నౌకా నిర్మాణ కేంద్రంగా తయారైనది. నదుల్లో ప్రయాణంచేసే అన్నిరకాల పడవలూ అక్కడ తయారవు తున్నవి. అవసరమైన అన్ని కొలతల్లోనూ చక్కని టేకు అక్కడికి సరఫరా అయినట్లు ప్రపంచంలోని మరియే నౌకా నిర్మాణ శాలకూ సప్లయి కాలేదు.

ఏనుగుల చేత ఈ పని చేయిస్తూ వున్నవారు, తాము శాంతి సమయంలో సాధారణంగా జరిపే పనికి మరల ప్రారంభిస్తున్నట్లు భావించి సంతోష పడ్డారు. ఏనుగులకు స్థిరమైన మకాములు కొన్ని వున్నవి. అలాంటి ఒక మకాములో బందూలా పనిచేస్తున్నది. ఆసాం మార్గంలో అద్భుతంగా పర్వతారోహణంచేసి మార్గదర్శకం అయిన దగ్గర్నుంచీ కూడా అది మంచిస్థితిలోనే వున్నది. ఆ మకాము ముసలి పో - టోక్ పర్యవేక్షణ క్రింద వున్నది. బందూలా పెద్దపెద్ద దూలా లను తెచ్చేది. అట్టివి తేవడం మరే యేనుగుకూ సాధ్యం కాదు. ఆ

మకాము ప్రధానమైన మిలిటరీ రోడ్డుకు రెండు మైళ్ళ దూరంలో వుంది. రోడ్డు మీద ఎడతెగకుండా తిరిగే లారీల చప్పుడు ఆ మకాముకు వినిపిస్తూనే వుంటుంది.

ఏనుగులు అలవాటు పడినా, ఊజీలు మాత్రం యుద్ధం ఎప్పుడు ఆగి పోతుందా అని యెదురుచూస్తూ మనశ్శాంతి లేకుండా వున్నారు. అందువల్ల నేను సైనిక కేంద్రానికి వెళ్లడానికి ముందే ఒకసారి మకాముకు పోయి, వాళ్ళకు ధైర్యం చెప్పి, ఏనుగులను పరీక్షించాలని అనుకున్నాను. అందుకోసం నేను పో - టోక్ మకాముకు వస్తానని ఫించ్‌తో ముందే చెప్పాను.

పరీక్షకు వచ్చిన ఏనుగుల వరసలో బందూలా కానరాలేదు. నా కాశ్చర్యం కలిగింది. "బందూలా ఎక్కడ?" అని పో - టోకును అడిగాను.

'తాకిన్ గ్యీ!' (Thakin Gyi = ఇది 'బిల్'ను గూర్చిన గౌరవ సంబోధన) అది మూడు రోజుల నుంచీ కానరాలేదండి" అని అతడు జవాబిచ్చాడు.

అప్పుడు ఫించ్ అందుకుని "అర్థం లేనిమాట! ఐదురోజుల క్రిందట నేను వచ్చినపుడు 'దానిని యింకా పట్టుకోలే'దంటూ నువ్వు చెప్పలేదూ?" అన్నాడు.

నేను మరేమీ మాట్లాడలేదు. ఏనుగుల నన్నిటినీ పరీక్షించాక పో - టోక్ బసకు తిన్నగా వెళ్లాను. అక్కడ అతని మనుష్యులందరూ వున్నారు. ఏదో పొరపాటు జరిగిందని నే నూహించాను. మావటి వాళ్ళనూ, చెట్లు కొట్టే వాళ్ళనూ - అందరినీ పిలిపించి "శాంతి సమయంలో ఏనుగులను పోగొట్టు కొంటే ఎంత కష్టమో,

యుద్ధసమయంలో అయితే యింకా ఎంత కష్టమో మీ కందరికీ తెలుసు బందూలా ఆచోకీతీసేటందుకు మీరేమైనా ప్రయత్నించారా" అని అడిగాను. ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. నేను పోటోక్ వైపు తిరిగి "నువ్వేదైనా ఏర్పాటు చెయ్యలేదా?" అని అడిగాను.

ముసలి పో-టోక్ వెలవెలపోయి, కలతపాటుతో "ఎక్కడా దాని అడుగుల జాడయినా కానరాలేదండి" అని మెల్లని గొంతుకతో సమాధాన మిచ్చాడు.

బర్మాలోని చీఫ్ - ఇంజినీర్లందరికీ ఎక్కువ కోపం వస్తుందని తెలిసీ కూడా గట్టిగా యిలా అరిచాను - "బందులా కనబడే వరకూ కలపపని జరగడానికి వీలులేదు. కేవలం బియ్యం తప్ప మరే ఆహార వస్తువులూ బసల్లోని వారికి ఇయ్యకూడదు" అని.

ఫించ్‌తోకూడా మకాముకు వెళ్ళిపోయాను. బందూలా కానరాకపోవడం సాధారణమైన విషయం కాదనీ, అందులో ఏదో రహస్యం యిమిడివున్నదనీ అనుకున్నాం. నేను సైనిక కేంద్రానికి వెళ్లాను. వెళ్తూ "బందూలా కనబడితే వెంటనే కబురు చెయ్యమని ఫించ్‌తోచెప్పాను. కాని, నాకు ఏకబురూ రాలేదు. ఐదురోజులయాక తిరిగి వచ్చాను. వచ్చేసరికి పోటోక్ జబ్బులో పడివున్నాడనీ, అతని మకాం మొత్తమూ బందూలా కానరాకపోవడంవల్ల చాలా విచారంలో మునిగి వున్నదనీ తెలిసింది.

నేను తిన్నగా పోటోక్‌వద్దకుపోయి గట్టిగా అరిచాను. అతడు బడి పిల్లవాడివలె కన్నీళ్లు ప్రవహించగా వెక్కి వెక్కి యేడుస్తూ "తాకిన్ గ్యీ! మకామునకు 400 గజాల దూరంలో బందూలా చచ్చి పడివుంది. నేను సుస్తీగా వున్నాను. నడిచి రాలేను. మీరే పోయి చూడండి" అన్నాడు.

మాటలాడకుండా ఇద్దరు ఊజీలు ముందుదారి తీయగా, నేను వారి వెంట వెళ్ళాను. ఆ దారిలో కొంచెం దూరం వెళ్ళేసరికే విపరీతమైన దుర్గంధం కొట్టింది. ఊజీ లిద్దరూ పక్కకు తప్పుకున్నారు. ఒక చిన్న పచ్చిక నేలమీద బండూలా పడివున్నది, చచ్చిన ఆ గజరాజును చూచి, నా కన్నులనే నమ్మలేక పోయాను. దాని పొట్ట కుళ్ళిపోయి, ఉబ్బివున్నది. దాని కుడిదంతం పూర్తిగా కోసివేసి వున్నది. ఎడమదంతం కిందివైపు వుండి నేలలో దిగబడిపోయి వున్నది. దానిని ఎవ్వరూ ఇంత వరకూ కోసివెయ్యలేదు.

నాకు విపరీతపు దుఃఖమూ, ఓర్చుకోలేనంత కోపమూ కలిగాయి. సత్యాన్ని తెలుసుకోవాలని సంకల్పించు కున్నాను. దాన్ని ఎవ్వరో గుండువేసి కొట్టి చంపారు. ఆ గుండు తిన్నగా దాని మెదడులో ప్రవేశించి వుండాలి. ఏమంటే దాని నుదుటిపైని గుండు దెబ్బ కానవస్తున్నది. అది నిలిచివున్న పాటున కూలిపోయి వుంటుంది. చాలా రోజుల నుంచీ ఆ వైపు ఏ ప్రాణిన్నీ పోయి వుండలేదని నాకు తోచింది.

నేను అక్కడ అయిదుగురు కారెనులను కాపుంచాను. వాళ్ళు ఆ కళేబరం చుట్టూ తుపాకులు పట్టుకుని భద్రంగా వున్నారు. ఎవరైనా రెండవ దంతాన్ని తీసుకోవడానికి రాత్రివేళ వస్తే ఏమి చెయ్యాలో వాళ్లకే తెలుసును. మర్నాడు ఉదయం వస్తానని చెప్పి నేను వెళ్ళిపోయాను.

పోటోక్‌ను తరచి తరచి అడగ్గా తెలిసిన విషయం ఇదీ - పది రోజుల కిందట ఒక సాయంత్రము దాని ఊజీ చూసేసరికి బండులా చచ్చిపడివుంది. మర్నాడు ఉదయం పోటోక్ ఊజీతో కలిసి వెళ్ళి, చూసేసరికి దాని కుడి దంతం కోసివేసి వున్నది. భయ, విచారాలు

గొనగొనగా అతడు తన మనుష్యు లందరికీ - అందరూ ఆ సంగతి ఎత్తకుండా వుండాలనీ, ఆ కళేబరం వైపు ఎవ్వరూ పోకూడదనీ కట్టడి చేశాడు. ఏమంటే - అలాంటి గొప్ప యేనుగును చంపేశక్తి వనదేవతలకు తప్ప మరొకరికి లేదనీ, ఆ వైపు వెళ్లితే - దాన్ని గురించి మాట ఎత్తితే ఆ దేవతలకు కోపం వస్తుందనీ వాళ్ల నమ్మకం ! ఈ ఘోరవార్త తెలిస్తే తనవలెనే నాకూ, ఫించ్‌కూ అలవి లేని దుఃఖం కలుగుతుందనే కారణంవల్ల పోటోక్ దీనిని వెల్లడించలేక పోయాడు.

ఇక అతన్ని ఏమి తిట్టినా, ఎంత నిందించినా ప్రయోజనంలేదు. సందిగ్ధంగా వున్న అతని మాటలను బట్టి అపరాధిని కనిపెట్టడం ఎంతో కష్టం ! పో-టోక్‌తో ఏమి చెప్పినా లాభం లేదు. బందూలా తన జీవితాన్ని సార్థకం చేసుకుని చచ్చిపోయింది. ఇక ఏమిచేసినా, దానికేమో ప్రయోజనం లేదు. విచారమూ, క్రోధమూ కలతపాటూ ముప్పిరిగొని ఆ రాత్రి నాకు చాలసేపు దాకా నిద్రపట్టలేదు.

మర్నాడు మధ్యాహ్నానికి దాని ఎడమ దంతం తీసివెయ్య బడింది. దాని మెదడులో ఒక 303 గుండు దొరికింది. అది నా వూహ సరియైనదని సాక్ష్యమిచ్చింది. ప్రతిదినమూ ఆ సమీపంనుంచి వేలకొద్దీ లారీలు వెళ్లుతూ, వస్తూవుంటాయి. నే నా చుట్టు ప్రక్కల వున్న సిపాయీల గుంపులను పరిశోధించాను. ఒక్కడూ కూడా అపరాధి అయినట్లు రుజువు కాలేదు. వాళ్లలో చాలా మంది యుద్ధంచేసే దళాలకు చెందినవారు కారు. ఆయుధ సామగ్రిని పరిశీలించాను. లాభం ఏమీ లేకపోయింది.

బందూలా పడివున్న చోటికి రెండు మైళ్ళ దూరంలో ఒక చిన్‌గ్రామం వుంది. కొంత సాయుధ దళంతో అక్కడికిపోయి అక్కడున్న ఆయుధాల నన్నిటినీ పది నిమిషాలలో తీసుకురావాలని ఊరి

పెద్దకు ఉత్తరు విచ్చాను. అతడు అవివున్న వ్యక్తులతో కూడా ఆయుధాలను తీసుకువచ్చాడు. వాళ్లలో ముగ్గురి దగ్గర పాత 303 చేతుపాకులు ఉన్నాయి. వాళ్ళ ముగ్గురినీ నిర్బంధంలో వుంచి - కోసివేసిన బందూలా దంతం దొరుకుతుందేమో అని ప్రతీ యిల్లూ పరిశోధించాను. కాని, లాభం లేకపోయింది.

"బందూలా దంతాన్నయినా తెచ్చి యివ్వాలి. లేదా, దానిని ఎవ్వరు చంపారో ఆ సంగతినైనా చెప్పాలి. అంతవరకూ ఈ ఆయుధాలను మీకు స్వాధీనం చేసేదిలేదు" అని నేను ఊరి పెద్దతో గట్టిగా అన్నాను. ఆ మాటలకు అతడు బెదిరిపోయాడు. కాని లాభం లేకపోయింది.

పోటోక్‌నూ, బందూలా ఊజీనీ పనిలోంచి తొలగించివేస్తే కొంత సత్యం బయట పడవచ్చునని, ఆ విధంగా చెయ్యమని ఫించ్‌తో చెప్పాను. దానివల్లా లాభం లేకపోయింది.

బందూలా మరణకారణం అగోచరమై పోయింది. దాని ఎడమ దంతం నా దగ్గర అమూల్యమైన చిహ్నంగా వున్నది. తాను వుద్యోగము విడిచిపెట్టి నప్పుడు - అలాంటి గజరాజును మరెవ్వరికీ అప్పగించడం యిష్టంలేక పో-టోక్ ఇలా చంపివేసి వుంటాడా అనే అనుమానమూ తరచు కలిగేది. బర్మా ఆటవికుల స్వభావాలు చాలా వింతైనవి. నేనిలా ఊహించడానికీ అవకాశం లేకపోలేదు. తాను ప్రేమించిన ఏనుగు స్మృతి చిహ్నంగా దాని కుడివైపు దంతం తన దగ్గరవుండాలనే కోరిక అతనికిన్నీ వుండవచ్చు. ఏమైతేనేం! రహస్యం బయటపడలేదు. బందూలా అనే పేరుకూడా అసాధారణమైనదే ! అది ఒక బర్మా సేనాని పేరు. 1886 లో బర్మా బ్రిటిష్ వారికి స్వాధీనమయే టప్పుడు జరిగిన యుద్ధంలో అతడు బ్రిటిష్ వారిని ఎదిరించి ఎంతో అద్భుతంగా పోరాడినాడు.

బందూలాకు సంబంధించిన వివరాలను దాని ఘనకార్యాలతో కూడా ఇక్కడ వివరిస్తున్నాను.

## బందూలా నెం. ఎస్. కే. 895

1897 - నవంబరు - జననం.

1903 - తర్బీతు చేశారు. రెండు పిరుదులకీ వాతలు పెట్టారు.

1904 - 17 బరువులు మోస్తూ అడవి ఉద్యోగి వెంట ప్రయాణము చేసింది.

1919 - 21 మూ నది (Moo) లో ఇసుక తిప్పలనుంచి దూలాలను లాగేది.

1922 - గంగా అడవికి బదిలీ చెయ్యబడింది.

1923 - 31 మాంగ్ ఆంగ్ గ్యా(Maung-Aung-Gyaw) కలప పని మకాములో ఉండినది.

1932 - అడవి యేనుగుతో పోట్లాడి దెబ్బతిని సంవత్సరకాలము విశ్రాంతి తీసుకుని తేరుకుంది.

1933 - ఎగువ చిన్‌డ్విన్ నదిలోని కిన్‌బాట్ (Kinbat) అడవికి మార్చబడింది. మాంగ్ పోటోక్ మకాముకు దఖలు పడింది. మాకు రిజర్వు (Mawku Reserve)లో బరువైన కలపను తీసింది.

1934-41 : అడవిలో ముఖ్యమైన ఏనుగుగా బాగా పని చేసింది.

1942- జనవరి - ఏప్రిల్ - బర్మా సేనలు వెనక్కు మరలడానికి ముందు కాలే-(Kalew)-కలేమియో రోడ్డు తయారు కావడానికి పని చేసింది.

మే - అక్టోబరు - జట్టు నుంచి విడదీయబడింది. విటోక్ (Vitok) లో వుంటున్న మాంగ్ పోటోక్, ఇది జపానీయులకు చిక్కకుండా కాబా కనుమలో దాచివుంచాడు.

నవంబరు - తిరిగి టామూలో 'ఎలిఫెంట్ బిల్' కునూ హెరోల్డ్ బ్రౌనుకున్నూ స్వాధీనమైంది.

డిసెంబరు-14-వ సేనలోని నెం 1. ఏనుగుల కంపెనీలో ప్రధానమైన నెం. 1 ఏనుగుగా గ్రహించబడింది. వంతెనలకు కావలసిన కలప లాక్కొని వచ్చింది.

1943- మార్చి-నవంబరు-సేనలు తిరిగి రావడానికి కావలసిన కలపను టామూ దగ్గర సిద్ధం చేసింది.

నవంబరు—*1944* మార్చి-కాబా కనుమలో సేనలతో కూడా కలిసి వంతెనలు నిర్మించింది.

1944- ఏప్రిలు-మే-బర్మాలోని కాందాంగ్ నుంచి ఆసాములోని బలదాన్ పోయే టప్పుడు ఏనుగులన్నిటికీ నాయకత్వం వహించింది.

జూన్-అక్టోబరు-ఆసాంలోని సుర్మా కనుమలో విశ్రాంతి తీసుకుంది. కట్టుబడిపోయి ఒక దినం అనాస తోటలో ప్రవేశించి 900 అనాస పండ్లు తినివేసింది. భరించరాని శూల నొప్పితో బాధపడి తేరుకుంది.

నవంబరు—డిసెంబరు—తిరిగి బర్మాకు ప్రయాణం చేసింది.

1945- జనవరి-మార్చి—అడవిలోని రంపపు కోత మిల్లు పని—సేనలను నౌకానిర్మాణానికి కలప లాక్కొని వచ్చింది

మార్చి *8*. విటోక్ సమీపంలో చచ్చి పడివుంది. ఎవరో దీన్ని తుపాకితో కాల్చి చంపారు.

నేను ఆసుపత్రిలో వున్నప్పుడు ఈ సంఘటన జరిగింది. పని చాలా తొందరగా జరిగింది - మ్యిత్తా-మణిపూరు నదుల సంగమ స్థలంలో-ఏనుగులు కలపతో ఒక వంతెనను నిర్మించాయి. టిడ్డింవరకూ అలాంటి వంతెనలే చాలా తయారయినవి. టాంకులు వాటిపైని ఏ చిక్కూ లేకుండా వెళ్ళేవి. 120 మైళ్ల పొడుగునా వున్న యీ అటవీ మార్గంలో పనిచేసే దళాలకు సేనల అవసరంగాని, త్రవ్వకంచేసే యంత్రాల అవసరం గాని లేకపోయింది.

ఈ సమయంలో 400 ఏనుగులు నా స్వాధీనంలో వుండి పని చేసేవి. జపానీయులకు దొరకక తప్పించుకొని తమ ఏనుగులతో

కూడా అడవుల్లో వున్న ఊజీలతోకూడా సంప్రదింపులు జరుపు తున్నాను. వాళ్లు నింజిన్, పాకొక్కు (Ningin, Pakokku) అడ వుల్లో దాగుకొని వున్నారు!

జపానీయులు వెనక్కుపోతూ వున్నప్పుడు—నూరు ఏనుగులతో కూడా వున్న బర్మీయులను తమతో కూడా రావాలని నిర్బంధించారట ఐరావతీనది ప్రాంతములో 'సా' (Saw) ప్రక్కకు రావాలని కోరారట! అప్పుడు బర్మీయుల పెద్ద జపాను ఉద్యోగి దగ్గరకు వెళ్లి, మమ్మల్నీ, మా ఏనుగులనూ పూర్తిగా కాల్చి చంపివేసినాసరే, మేము ఒక అడుగు కూడా ముందుకు వెయ్యం అనిగట్టిగా చెప్పాడు. ఆతడు తనపై అధికారికి యీ సంగతి చెప్పడానికి వెళ్ళాడు వాళ్ళ నిర్ణయం ఏమిటో తెలియడానికి ముందే బర్మీయులు ఏనుగులతోకూడా జపానీయుల సరిహద్దుదాటి మూడు మజిలీలలో మా ప్రాంతాని వచ్చివేశారు. దీనితో మా ఏనుగుల సంఖ్య 700 దాకా పెరిగింది. క్రొత్తగా చేరిన ఏనుగులు చాలా అలసిపోయి వున్నాయి. జపా నీయులు వాటిచేత శక్తికి మించిన పని చేయించారు. వాటికి బాగా విశ్రాంతి కావాలి.

ష్వేబో (Shwebo) పతనానంతరం 'మూ' (Moo) నదీ ప్రాంతంలో మరి ఏభై ఏనుగులు దొరికాయి. ప్రోం (Prome), ప్యిన్మానా (Pyinmana), టూంగూ (Toungoo) జిల్లాలను మా సేనలు స్వాధీనం చేసుకునేదాకా మెట్టప్రదేశంలో మరే ఏనుగులూ లభించలేదు. తర్వాత 300 ఏనుగులు లభించాయి.

తరచుగా ఊజీలు ఎంతో భక్తి విశ్వాసాలను చూపేవారు. ఒకప్పుడు ఒక స్వతంత్ర దళం చిన్డ్విన్, మూనదుల మధ్య భాగాన్ని దాటుతూ, 'మూ' కనుమకు వెళ్లడానికి తగిన ప్రయాణ సాధనాలను పంపాలని కోరింది. దానికి సాయపడడానికి నేను ఏనుగులను పంప డానికి సమయం చాలదు. అందువల్ల నేను బర్మాభాషలో ఒక జాబు వ్రాయించి, ఒక చిన్న విమానం ద్వారా నా దగ్గిర ఏడేళ్లు పని చేసిన ఒక కంట్రాక్టరుకు అందిచ్చేటట్టు చేశాను. ఆ జాబును ఆ విమానం

నాంగ్గాకు (**Naunggauk**) గ్రామంలో పడ వేసింది. ఆ వూళ్లో యిది వరలో నా దగ్గర పనిచేసిన మనుష్యులే నివసిస్తున్నారు. అందులోని విషయం యిదీ - "బ్రిటిష్ సేనలు కొన్ని శీఘ్రంగానే అక్కడికి వస్తున్నాయి. వాటి సహాయానికి వీలయినన్ని బరువు మోసే ఏనుగులనూ (జపానీయుల నుంచి తప్పించుకొన్న వాటిని), వీలయినన్ని ఎద్దు బండ్లనూ సిద్ధంచేసి వుంచాలి" అని.

సైన్యం అక్కడికి వచ్చే సరికి 23 ఏనుగులూ, 34 ఎద్దుబళ్లూ సరియైన పద్ధతిలో సిద్ధంగా వున్నవి. ఆ సైన్యం ఏర్పాటు చేసిన చోట నేను L. 5 విమానంలో దిగాను. ఎంతో భక్తితో, నేను చెప్పిన పనిని నిర్వహించినందుకు వాళ్లకు బహుమతిగా యివ్వడానికి చాలాసొమ్ము తీసుకు వెళ్ళాను. ఆ ప్రాంతంలో బందిపోటు భయం ఎక్కువ వున్నందున - ఆ సొమ్ము తీసుకోవడానికి వాళ్లు భయపడ్డారు కాని, వాళ్ళకు ఆయుధాలను కూడా సప్లయిచేసి, ఆ బహుమానాలను పంచిపెట్టాను.

33-వ దళమూ, 4-వ దళమూ మెట్ట ప్రాంతానికి వెళ్లిపోయాయి. ఎండకాలం ముగియ వచ్చింది. ఏనుగులు ఒకే ఒక మార్గంలో - కాబా కనుమ కింద - టామూ నుంచి కలేవా వరకూ పనిచేస్తూ వున్నవి. వర్షాలు ప్రారంభం కాకముందే అక్కడ అన్ని కాలాలకూ అనుకూలమైన రోడ్డు నిర్మాణం జరగాలి. నూట యేభై ఏనుగులు అందుకై చిన్న చిన్న వంతెనలు బాగుచెయ్యడం మొదలైన పనులు జరిపేవి. దాని నిర్మాణానికి విపరీతపు ఖర్చువుతుంది. కాని మరో మార్గం లేదు. ఖర్చు చెయ్యవలసినదే! రెండున్నర అడుగుల వెడల్పు తివాసీ వంటి పట్టాలు - నీరు ఇంకని పదార్థాలతో తయారైనవి - తారు పూసినవి వాటికి ఉపయోగించ బడినవి. అవి ఎనిమిది అంగుళాల దళసరి వుండేటట్లు ఒక దానిపై ఒకటి అతికించి, దారికి రెండు పక్కలా పరవడం జరిగింది. మధ్యను కొంత ఎత్తు ఏర్పడగా, తర్వాత మధ్యభాగంపై, అవి పరవ బడ్డాయి. ఇలా చేస్తూ, చురుకుగా పనిచేస్తే, దినానికి ఒకమైలు చొప్పున రోడ్డు తయారయింది. అది యింకా పూర్తి కాకముందే వర్షాలుప్రారంభమయాయి. అలాంటి

చిక్కు సమయంలో కూడా ఆ రోడ్డుపై రోజుకు 700 టన్నుల వస్తువుల రవానా జరిగేది.

1945 జూలైలో ఈ రోడ్డు దెబ్బ తిన్నది. అక్కడక్కడ మైలు దూరందాకా రోడ్డుపైని పరిచిన పట్టాలు కొట్టుకుపోయి చిత్తడి నేల తయారయింది. అప్పుడు - ఆ మార్గాన్ని ఉపయోగించుకోడానికి అక్కడక్కడ కర్రలతో ప్రక్కదారులు నిర్మించవలసి వచ్చింది. ఆ రీతిని ఏనుగులు అయిదుమైళ్ల దాకా - ఆ వర్ష ఋతువులో మార్గాలను నిర్మించాయి. మైలుకు 2,500 దూలాలవంతున 12,500 దుంగలు కావలసి వచ్చినవి. వాటిని కొట్టేక, దారిదగ్గిరికి యీడ్చుకుని రావడం, సరియైన పద్ధతిలో వుంచడం అంతా ఏనుగుల పనే! ఈ పనిని భయంకరమైన వర్షాకాలంలో నెం. 1. ఏనుగుల కంపెనీయే చేసింది. వరద వచ్చినప్పుడల్లా అడవుల్లోని చెత్త చెదారాలతో కాల్వల మీద చిన్న వంతెనలు నిండి పోయేవి. ఏనుగులు ఆ చెత్తను తరుచు తీసివెయ్యవలసి వచ్చేది. రోడ్డుకు ఆటంకం లేకపోయేది. దాని మీద సైన్యానికి పెట్రోలు పంపబడుతూ వుండేది.

రంగూను పతనం దగ్గర పడింది. నిస్సందేహంగా అక్కడ చాలా కలప అవసరం! అక్కడ ఎంతకలప సరఫరా అయ్యేదీ ఎవరూ ఎరుగరు. యుద్ధానికి ముందు రంగూను పరిసరాల్లో మూడు లక్షల దుంగలు డిపోలలో వుండి కోత మిల్లులకు సప్లయి అయేవి. అది ఆక్రమింపబడినప్పటికి దానికి పదిమైళ్ల చుట్టుప్రక్కల మూడు వేలదుంగలు మాత్రం అందుబాటులో వున్నాయి. 1942 నుంచీ అక్కడక్కడ ప్రవాహాల దగ్గర వుండిపోయిన దూలాలను రవానా చెయ్యడానికి కొంత కాలం వరకూ ఏనుగులు పని చెయ్యాలి. సైన్యాలకు చెయ్యవలసిన పని ముగిసిన వెంటనే ఏనుగులు ఈ పనికి రావలసి వుంటుంది

జపానీయులు బర్మాను ఆక్రమించి వున్నప్పుడు ఏనుగులను ఎలాగున ఉపయోగించుకున్నదీ - ఆ వివరమంతా విస్తారంగా బర్మీయుల వల్లనూ, కలప పని చేసేవారి వల్లనూ తెలిసింది. 1942లో -

జపానీయులు, సయాం నుంచి బర్మాలో ప్రవేశించినప్పుడు కాక రైక్ (Caukeraik) కనుమగుండా ఆయుధాలను చేరవెయ్యడానికి ఏనుగులను ఉపయోగించారు. దీని కోసం వాళ్లు ముందుగానే పథకాలు నిర్ణయించు కున్నారు. అందువల్ల వారు అనుకున్న ప్రకారం జరగడానికి అవకాశం కలిగింది. బర్మాను ఆక్రమించడానికి ముందు జపానీయులు ఏనుగులను మరి యే సైనిక కార్యాలకూ వుపయోగించలేదు. వాళ్లు సైన్యం పర్యవేక్షణ క్రిందనే అడవులను క్రమంగా వినియోగించు కోడానికి తగిన ఏర్పాట్లు చేశారు.

ఏనుగులతో ఊజీలూ కూడా జపాను వాళ్లకు సైనికంగా ఎంతో ఉపయోగించారు. ఎగువ చిన్‌డ్విన్ నుంచి - ఇంఫాల్, ఉఖ్రూల్, కోహిమా, జస్సానీల మీదుగా ఇండియామీద వాళ్లు చేసిన దాడిలో రవానాకు ఏనుగుల మీదనే ఆధారపడి వుండినది. దుర్గమాలైన అటవీ మార్గాలలో-కష్టాలకు నిలయమైన దేశంలో అవి ఎంతో త్వరగా పోయేవి.

1944 మార్చి 13-వ తేదీ రాత్రి జపానీయులు 350 ఏనుగులతో చిన్‌డ్విన్ నదినిదాటి చిన్ పర్వతాలవైపు ప్రయాణం చేశారు. ముఖ్యంగా ఏనుగులు ఒక ఎన్. సి. ఓ. అధికారంక్రింద వుండేవి. ఏటవాలుగా వుండి, దుర్గమములయిన చోట్లలో వాళ్లు ఏనుగులను వుపయోగించుకొని, రోడ్డు సౌకర్యం వుండేచోట్ల మోటార్లనూ, ఎద్దు బండ్లనూ వాడుకునేవారు. వాళ్లకు లభించిన అవకాశాలను అనుసరించి అప్పటికప్పుడు రవానా పద్ధతులను నిశ్చయించుకునేవారు. వాటిలో చాకచక్యం ఎక్కువ కానరాకపోయినా, అవి వాళ్ళకు అనుకూలంగానూ, శీఘ్రంగానూ పని చేసేవి.

తక్కిన జంతువులను బాధించినట్లుగా, జపానీయులు ఏనుగులను బాధించలేదు. వాటిని చూచుకునే బాధ్యతను ఊజీలకే అప్పగించేవారు. అయినా, వాళ్ళు ఏనుగులను తొందరపెట్టడమూ, వాటికి కావలసిన ఆహారాన్ని పూర్తిగా యివ్వకపోవడమూ జరిగేది. వాళ్ళ అశ్రద్ధవల్లనూ, నిర్లక్ష్య భావంవల్లనూ ఏనుగుల వీపులమీద వ్రావ

కాలు పడి, వాటికి గాయాలను కలిగించిన సంగతిని ఇదివరకే నేను తెలిపానుకదా !

"బర్మాలో కలప పని చేస్తూవున్న నాలుగువేల యేనుగులు కానరావడంలే"దని 'డెయిలీ మెయిలు' (Daily Mail) పత్రికలో ప్రకటించబడింది. దానిమీద 'పంచ్' (Punch) పత్రిక "వాటికై మీరు అన్ని ప్రదేశాలు వెతికారా ?" అని ప్రశ్నించింది. "మనం వెతకనూ లేదు - ఇంకెవరైనా వెతుకుదురాన్న అవకాశమూ లేదు"అన్నదే దీనికి సమాధానం.

1942 నవంబరు మొదలుకొని, వాళ్ళు నిర్నిబంధనగా లొంగి పోయిన తేదీవరకూ - జపానీయులనుంచి ',652 ఏనుగులు స్వాధీనం చేసుకోబడినవి. అవి వాటి పనిలో ప్రవేశించాయి. బర్మాను విడిచి రావడానికి ముందు నేను ఎగువ బర్మాలోని కాబా కనుమలో పని చేస్తూవున్న 417 ఏనుగులవద్ద సెలవు తీసుకున్నాను. అప్పట్లో అవి 14-వ దళానికి సాయపడుతూ వున్నవి. అవి నెం. 1,2 ఏనుగుల కంపెనీలకు చెంది వున్నాయి. మిగిలినవన్నీ యుద్ధానికి ముందున్న మాదిరిగా కలప పనిలో మునిగి, బర్మాలోని టేకు అడవుల్లో అంతటా వేర్వేరు ప్రాంతాలలో వాటివాటి స్వస్థలాలకు పోయి సుఖంగా వున్నవి. యుద్ధమూలంగా కొన్ని అలసిపోయినవి. కొన్ని బెదరి పోయాయి. కాని అవి మంచివాళ్ళ చేతుల్లో వుండడంవల్ల శీఘ్రంగానే తేరుకోగలవు. కనబడకుండా వున్న 3,999 (డెయిలీ మెయిల్ పత్రిక చెప్పినదాన్నిబట్టి) ఏనుగుల్లోనూ వందలకొద్దీ చనిపోయాయి. దానికి మానవుల అవివేకమూ, వాటిపై వహించిన కాఠిన్యమూ కారణాలు. బ్రతికివున్న వెన్నో చెప్పడానికి వీలుకాదు. తమ జీవనం కోసం ఆహారానికి మిక్కిలి శ్రమపడుతూ బాగా దెబ్బలు తిన్నవి ఎన్నో వున్నవి. అవి ప్రాచీనపద్ధతిని అనుసరించి వాటి గాయాలకు - దినానికి రెండు, మూడు సార్లు బురద మట్టిని పూసుకుని చికిత్స చేసుకొని తేరుకొని వుండాలి. అలా తేరుకొన్నతర్వాత ఆ యేనుగులు యుద్ధసమయంలో నరకంగా మారిపోయిన కనుమలను విడిచిపెట్టి

ప్రశాంత ప్రదేశాలకు వెళ్ళి వుండవచ్చును. కాని, దెబ్బలు తినకుండా తప్పించుకుని పారిపోయినవి చాలా వుండవచ్చు.

చచ్చిపోయిన ఏనుగులకంటె బెదరి పారిపోయినవీ, దెబ్బలు తిన్నవీ ఎక్కువగా వుంటాయి. అవి యెక్కడ వుంటాయో నాకు తెలుసును. అడవి ఏనుగుల గుంపులతో కలిసిపోయినవన్నమాట పెంపుడు యేనుగులు తమతో చేరినప్పుడు అడవి యేనుగులు వాటిని ద్వేషించవు. జంతువుల్లోగాని, చిన్న పిల్లలలోగాని, చివరకు పెద్ద వాళ్ళలోగాని కొత్తవారి చేరికవల్ల - వాళ్ళపై అసహనభావం కల గడం పరిపాటి. ఏనుగుల్లో అలాంటి భావంలేదు. ఎన్నోవిధాల అవి తక్కినవాటికంటే ఉత్తమమైనవి.

అడవి యేనుగులతో కలిసిపోయి వున్న పెంపుడు ఏనుగులను తిరిగి పట్టుకోడానికి బర్మా ఆటవికులు ఎంతో ప్రయత్నించవలసి వున్నది. ఎంతో గొప్ప ధైర్యంగల యిద్దరు ఊజీలు అత్యంత విశ్వాస పాత్రమైన ఏనుగుపై కూర్చుండి కయాంగ్ గడ్డిని మేపుతూ, తాము పట్టుకొనదలచిన ఏనుగుదగ్గరగా వెళ్ళాలి. తర్వాత ఆ యిద్దరు ఊజీ లలో ఒకడు దానితో నెమ్మదిగా మాటలాడడానికి ప్రారంభించాలి. అది యేమీ గడబిడ చెయ్యకుండా, ఆ ఊజీమాట వింటే, తాను కూర్చున్న ఏనుగు వీపుమీదనుంచి దాని వీపుమీదికి ఉరకాలి. ఇలా జరిగేటప్పుడు కొంతవరకూ అది బెదరిపోవడం జరుగుతుంది. అయినా, తెలివైన మావటివాడు - మిగిలిన అడవియేనుగులు బెదరి పారిపోగా- తాను కూర్చున్న ఏనుగును లొంగదీసుకోగలడు. వాటిని పట్టుకొన డానికి యింతకంటె వేరే మార్గంలేదు. కాని, యీ విధంగా స్వాధీన మయేవి చాలా తక్కువ. బర్మాలో వుండే యిప్పటి పరిస్థితులను బట్టి ఏనుగులు విధీ, విరామమూ లేకుండా మనుష్యులకోసం పని చెయ్య డానికి బదులు అడవుల్లో స్వేచ్ఛగా తిరుగుతూ సుఖంగా కాలం గడప డమే మంచిదని నాకు తోస్తుంది.

---